





శ్రీరస్తు

శుభమస్తు　　　　అవిఘ్నమస్తు



# అంతయు నీవే హరి పుండరీకాక్ష

## ఎన్నుకొన్న
## అన్నమయ్య సంకీర్తనలకు

### అవతారిక మరియు భావ వివరణ


రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.

# అంతయు నీవే హరి పుండరీకాక్ష

మొదటి ప్రచురణ

**అక్టోబర్ 2012**

రచన

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**

వెల : **అమూల్యం**

ప్రతులకు :

ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం. 61, సిద్దార్థ నగర్,

హైదరాబాద్ - 38. ఫోన్ : 093930 21360

డి.టి.పి. ప్రింటింగ్ :

**కె. వి. ఆర్**

98495 79345





**అంకితము**

# శ్రీహరి పాదపద్మములకు

**భక్తితో**



కం ॥ హరి చరణములకు భక్తిని
మురిపెంబుగ బూనినేను మ్రొక్కుచుదీనిన్
సరగున అంకితమిత్తును
తరియింపగ 'అమరవాది' తరముల వరుసల్

# అన్నమయ్య - అనుయాయులు

## అన్నమయ్య "భక్తి" కీర్తనలు

## విషయ సూచిక

అంతయు నీవే హరిపుండరీకాక్ష

# ప్రార్థన

కం॥ శ్రీమన్నారాయణుపై
నామది యిటు నిల్చుటెల్ల నరహరికృపయే
ఏమరి భవసాగరమున
నే మరువక దిద్దుమయ్య నిగమ సువేద్యా!

ఉ॥ శ్రీవనితామనోహరుడు చిన్మయరూపుడు శేషశాయియున్
భూవిభుడౌ పరాత్పరుని పున్నెము కొల్లయివాని మెచ్చుచున్
దావతిజెప్పినాడనవతారిక తోడుత భావసంగ్రహం
బీవిధి వేంకటేశ్వరుడ! యేమని నీదయనుగ్గడించెదన్?

కం॥ అవతారంబులు పదియట
అవిరళముగ వాటిదాల్చి ఆర్తుల సఖులన్
అవనిని బ్రోచినవైనము
అవలీలగనట్టి కథలె హరికథలాయెన్

సీ॥ బొరియ గప్పలు జేర వుదధిమీనంబీద
నింగిపక్కియెగురనెపమెవండు?
చీమకుదోమకు చిరుతకు కరికిని
పాముతేళ్ళకు నొప్పు పసయెవండు?
నరులందు సురులదు నానాయసురులందు
భావాలగల్పించు మతి యెవండు?
జన్మాంతరంబుల సతమతంబులజేసి
కర్మదీర్పించెడి ఘనుడెవండు?

ఆ.వె॥ ఇందుగలడు 'చూడ' నందులేడా? యని
సందియమ్ము వలదు సర్వమతడె
ఇందు రవి నయనుని ఈరీతి కీర్తించి
శ్వాస ఆగుటైన సమ్మతంబె.





తే॥ రోమకూపములందున లోకములను
దాల్చి పోషించి రక్షించు తండ్రియెవడు?
సవితు దర్శించగా జ్ఞాన చక్షువేది?
దాని తెరిపించు గురువెక్కడని వెదుకను?

చం॥ పదియవతారముల్ బడసి పంకజనాభుడు ధర్మరక్షణన్
ముదముగ జేసె; పాడె తను పుణ్యుడు అన్నమ వేల కీర్తనల్
పదునుగ, వేయినామముల స్వామిని సంస్తుతిజేసె, పేర్మితో
ఇదెగొని వేయికీర్తనల నెంచితిరా పదిసంపుటంబులన్

శా॥ కాయంబేటికి గొల్వకున్న హరి నీ కావ్యాలు నాకేటికిన్?
ప్రాయంబేటికి పాడకున్న మది సంభావించి యాశ్రీపతిన్?
ధ్యేయంబేమిటి జన్మనెత్తిమనిషై దీనోద్ధరున్ జేరకన్
న్యాయంబే? యిది నాదు బోధ వినుడీ నారాయణున్ మ్రొక్కుడీ

ఆ.వె॥ వేయి కీర్తనములు పేర్చితినొకచోట
సంపుటమ్ములు 'పది' చక్కనాయె
అన్నమయ్యకిదియె హారతి శ్రీహరీ!
జన్మ అయినదయ్య! సార్థకంబు

మ॥ ఎరుగన్ స్తోత్రము జేయలేను తపముల్ హెచ్చాయె నజ్ఞానమే
యెరుగన్ వేదము శాస్త్రధర్మ విధులన్ యేపూజలున్ రావు, నా-
కరువై దీక్షితులన్నపేరు మిగిలెన్ అబ్బోసి!! వింతే సుమీ!
బరువున్ మోయగలేను వేంకటపతీ! పాపోపశాంతీయవే.

సీ॥ కామక్రోధములడ్డి కట్టేయ జూచిన
నన్నొదలరేయందు విన్నపముగ
రంభాది భామల రతిగోల నాకేల
తిరుమల నాఆత్మ తిరుగవలెను
చిత్రగుప్తుడు నన్ను శిక్షింపబోయిన
కేల్మోక్కి చూపుదు కీర్తనములు
దండధరుడు బట్టి దండించదలచిన
ఆర్తితో పాడెదనన్నమయ్య

ఆ.వె॥ జన్మపీకులాట చదువుల చెరలాట
మరల మరులగోల పాపహేల,
వింత ఆటచాలు వేంకటనగవిభో!
బక్కప్రాణినయ్య! పగయిదేల?

ఉ॥ చాలదు చాలబోదనుచు చాలతెరంగుల చింత చావకన్
చాలనకుండ వేసరితి సంపదకై హరిబాటనొగ్గితిన్
చాలని, కుంటిజేసినను చావుయిదేనని నచ్చజెప్పి, రే!!
చాలుర నన్ను జేరుమని సద్గురు డన్నమదారిబెట్టె, పో!

మత్తకోకిల :

ఏమిభాగ్యము! యెంత చిత్రము మేమనందునుయెన్నడో
ఏమిపూజలు సేసినాడనొ ఈ విశిష్ఠత దక్కెరా
వేమరౌవిధులన్ నుతించగ విష్ణుదేవుడు మెచ్చగా
ఓ మహాత్ముడ! అన్నమార్యుడ వూరడిల్లెద నీ స్మృతిన్.





# ముందుమాట

వేయి నామాలదేవుడు; వేయి రూపాలదేవుడు; వేయి మోముల దేవుడు; వేయి కన్నులదేవుడు; వేయి పాదముల దేవుడని వేదము వేనోళ్ళ పొగిడే దైవము పురుషోత్తముడు. ఆ విశ్వరూపుని అన్నమాచార్యులవారు ముప్పది రెండు వేల కీర్తనలు పాడి మెప్పించి తరించారు. ఆరువందల సంవత్సరాలయినా అన్నమయ్య కీర్తన విననిదే వేంకటరమణునికి వేకువ కాదు. స్వామి సేవకై వేచిన వేల్పులు వేసరి, వేంకటనాథా! నీదేవేరులనైనా వేడుక జేయవయ్యా! అని వేడుకొంటున్నారు.

వేంకటేశ్వరా! అనంతమైన నీ భక్తుల త్రొక్కిసలాట తట్టుకొనే శక్తి నాకు లేదయ్యా! అర్భకుడిని అంటూనే నా బోంట్లు సందు దొరికితే ఒక్క రెప్పపాటు కాలమైనా చూడాలని వువ్విళ్ళూరే అందం ఆ శ్రీనివాసునిది. స్వామి సాన్నిధ్యం సాధ్యంకాదని నేనొకపనిచేశాను. రోజుకొక్కక్క కీర్తన చొప్పున అన్నమాచార్యులవారి కీర్తనలను పాడి, మథించి, దాని భావ వివరణ వ్రాస్తాను. ఆ కీర్తనకు ఉపోద్ఘాతంలాంటి అవతారికను జోడిస్తాను. ఆవిధంగా నూరు కీర్తనలయ్యాక కంప్యూటర్‌లో భద్రపరుస్తూను. ఆ విధంగా కీర్తనల సంపుటములు ఒకదాని తరువాత ఒకటిగా తొమ్మిది పూర్తి అయినవి.

ఇదిగో మీ చేతిలో వున్న ఈ సంపుటము పదియవది దీనితో వేయి కీర్తనలు పూర్తి అవుతాయి. వేయి నామముల వేంకటేశ్వరుని వేయి కీర్తనలతో వేడుకోవటం నిజంగా వేల జన్మల వేసరిన వెడగు బడగునకు వేడుకే. ఈ సందర్భంగా నేను విన్నవించే ఈ ముందుమాట నా మనస్సులోని మాటయై మీ ముందున్నది.

రోజులో ఒక్క గంట సమయం ఈ మూడింటిలో ఒక్క పనికి కేటాయించండి. 1) భగవంతుని గురించి వినండి. 2) భగవంతుని (ఏ పేరుతో పిలిచినా పర్వాలేదు) ప్రార్థించండి. 3) భగవంతునిపై వ్రాయండి. ఏ పనిచేసినా కర్తవ్య భావనతో చేయండి కర్తృత్వ భావనతో కాదు. అంటే అది నా బాధ్యత అనుకొని చేయండి. కానీ నేనే దీన్ని చేయగల మొనగాణ్ణి అనే గర్వంతో చేయకండి. అనవసరమైన మాటలు, పనులు, ఆలోచనలు

వదిలేయండి. హలో, హాయ్, బుల్‌షిట్... ఇత్యాది పూతపదాలు మానివేసి 'హరీ' అనండి 'సాయి' అనండి 'శివా' అనండి, 'శ్రీరాం' అనండి మీలో వచ్చే మార్పుకి మీరే ఆశ్చర్యపోతారు. దూషణ భూషణలు (తిట్లూ, పొగడ్తలు) దేహానికే నాలోనివాడికి (అంతర్యామికి) కాదు అని గ్రహించండి. చివరి శ్వాసవరకు ఇట్లా వుండగలిగితే 'మోక్షం' అనేది సాధ్యమే. ఇందులో సందేహం లేదు. కాని తమాషా యేమిటంటే దేహమే మనం అనుకొని భ్రమతోనే వుంటాము. అరిషడ్వర్గాలవశమై అవస్థలు పడుతుంటాం. ఇందుకు ఆ శ్రీపతి మాయ ముఖ్యకారణం. దాన్ని జయించడం యెవరి తరమూ కాదు.

దానికి పెద్దలు ఒక వుపాయం చెప్పారు. అదే శరణాగతి. ఆ స్వామిని శరణుజొచ్చి "అన్యధాశరణం నాస్తి త్వమేవ శరణం మమ" (నీవేతప్ప ఇత: పరంబెరుగ) అని నిత్యమూ వేడుకోవాలి. అప్పుడే ఆ శ్రీహరి నిన్ను ఆ శరణాగతుల "క్యూ"లో చేర్చుకొంటాడు. అది చేంతాడంత "క్యూ". మీవంతు యెప్పుడొస్తుందో తెలియదు. రావడమైతే గ్యారంటీ. కానీ అప్పటిదాకా నీభక్తి నిలుస్తుందా? ఈలోపుగా యెన్ని ఆశల పల్లకీలు!! యెన్ని నిరాశల నిస్సత్తువలు!! యెన్ని భ్రమలు, యెన్ని కన్నీళ్ళు!! యెన్ని వువ్విళ్ళు!! చెప్పలేము. తుకారాం వంటి భక్తులే "వున్నావా? అసలున్నావా? వుంటే కళ్ళు మూసుకున్నావా! ఈలోకం తీరు చూడకున్నావా?" అని నిగ్గదీశారు. మరి మనలాంటి అర్భకులు ఆయన శోధనలను తట్టుకోగలరా? నూరు నోములఫలం ఒక్క రంకుతో పోయినట్లు ఆయనతో ఆడే ఈ వైకుంఠపాళి ఆటలో నిచ్చెనల నెక్కించేది ఆయనే... పాములతో కరిపించి క్రిందికి దించేది ఆయనే. ఎవరి అదృష్టం ఎలావుంటుందో ఎవరికీ తెలీదు. ఒక్కటేదారి. అదే శరణు మహానుభావా! అనడమే.

చిన్న పిల్లలు ఆటలలో అనేకరకములైన చేష్టలతో, మాటలతో, పెద్దలవలె ఆరింద మాటలు మాట్లాడుతూ పెద్దవారికి వినోదం కలిగిస్తారు. వారి ఆటలలో నిజము లేదని వారికి నిజంగా తెలియదు. వారు తాము చేసేది నిజమే అనుకొంటారు. అవునా? పరమాత్మకూడా అలాగే మన వెంపర్లాట, సుఖదు:ఖ భ్రాంతిని జూచి నవ్వుకొంటుంటాడు. ఒకాయన స్థలం కొనుక్కొని ఇల్లు కట్టుకొని గొప్ప విందు ఇస్తాడు. ఇప్పుడు చూడండి.





నిన్న ఆ స్థలమూ వాడిది కాదు. ఇల్లూ వాడిదికాదు. రేపు ఆ రెండూ వాడివి అవునో కాదో తెలియదు. ఇప్పుడు మాత్రమే వాడివి. రేపు వాడేవుండకపోతే ఇల్లేమిటి వాకిలేమిటి? రాజులు కట్టించిన కోటలు నిలిచాయా? జమీందారుల భూములు నిలిచాయా? కానీ ఒక పోతన నిలిచాడు, ఒక అన్నమయ్య నిలిచాడు, కృష్ణరాయని కీర్తి నిలిచింది. అందుకని మంచిని పెంపొందించండి.

అయితే ఇదీ ఒకనాటికి కాలగర్భంలో కలిసిపోతాయి. ఎ.డి. 5000 నాటికి నేడు వినిపించే ఏ పేరూ వినిపించదు. అవునా? అందుకే వేదాంతులు కీర్తికోసం కూడా పాకులాడరు. వారు ముక్తిని కోరుకొంటారు. జననమరణాల చక్రవ్యూహంనుండి విముక్తిని కోరుకొంటారు. పరమాత్మలో ఐక్యం కావాలని కోరుకొంటారు. అది అంత సులభసాధ్యం కాదు. తుది శ్వాసదాకా యే భ్రమలకూ లొంగక, నాకు నీవుతప్ప ఇంకేమీ వద్దు, నీవే నాకు దిక్కు అని వుండగలమా? మీరు అవునంటే ఆ దేవదేవుడూ అవునంటాడు. ఇది జరిగేపనేనా? ఏమో... యెవరికేది ప్రాప్తమో ఏడుకొండల వాడికి కాక యెవరికి తెలుసు?

ఈ పదియవ సంపుటిలో కూడా 101 కీర్తనల నందించి 1009 కీర్తనలు పూర్తిచేయాలని నా ఆశ. ఇది మోకాళ్ళపర్వతం. నావల్ల అవుతుందా ప్రభూ! అని రోజూ నిద్రలేస్తూనే... అర్థిస్తుంటాను.

ఇది ఒక మహాయాగము. మంత్రమూ తంత్రమూ, మడి ఆచారము, శమము దమమూ, శక్తియుక్తీ లేని నాబోటి సామాన్యుడు ఈ బరువు మోయగలడా? తూర్పున వేగుచుక్క దర్శనం కోసం రాత్రంతా నిద్రలేక నిద్రరాక యెదురు తెన్నులు చూచిన బడుగునకు తెల్లవారు జామున ఆవేగుచుక్క దర్శనంతో ఆశ చిగురించినట్లు రోజులు గడుస్తున్నకొద్దీ మెల్లిమెల్లిగ నా గమ్యం కూడా దగ్గరవుతోంది.

ఒక కీటకము తనచుట్టూ ఝుంకారముతో తిరిగిన భ్రమరాన్ని చూచి భయంతో కూడిన విభ్రమకు లోనై దాన్నే ధ్యానిస్తూ కొన్నాళ్ళకి అది కూడా భ్రమరం అయిపోతుందట. ఇది ప్రకృతి సిద్ధాంతం. దీన్నే భ్రమర

కీటకన్యాయం అంటారు పెద్దలు. నిత్యమూ హరినే స్మరిస్తూ 32,000 కీర్తనలు చెప్పి హరి సాయిజ్యం పొందారు అన్నమాచార్యులవారు. ఇది 600 ఏళ్ళ క్రిందటి చరిత్ర. అంత దీక్షగాని హరికృపగాని లేని అర్భకుణ్ణి నేను. అయినా అనునిత్యం అన్నమయ్య కీర్తనలలో గడిపినందున నాకూ కీర్తనలు వ్రాయగలశక్తి వచ్చింది. అయస్కాంతంతో ఇనుపముక్కను అనేక మార్లు రాపాడిస్తే ఇనుపముక్క కూడా ఒక చిన్న అయస్కాంతమవుతుంది. ఇది "సైన్సు" చెప్పే సత్యం. అట్టి ఇనుపముక్క అయస్కాంతశక్తి అల్పమూ, పరిమితమూ కూడా. కీర్తన రాగమేమిటో తెలియని అజ్ఞాని సృజనాత్మకత కూడా చెప్పుకోదగ్గది కాదు. అయినా? హరికృపకిది ఉదాహరణయే కదా!

**అందాల హరి గొలిచిన అన్నమాచార్యుడా!**
**అందించితివయ్య! ముక్తినన్నమాచార్యుడా!** ॥పల్లవి॥

**పాపడిగా గొన్నాళ్ళు పడుచుపిచ్చి కొన్నాళ్ళు**
**పాపపు పని కొన్నాళ్ళు పగరగులుట గొన్నాళ్ళు**
**పాపలతో గొన్నాళ్ళు పలుభ్రమలతో గొన్నాళ్ళు**
**పాపముడుగ జేరితి హరిబాట నన్నమార్యుడా!** ॥అందాల॥

**అమరిన కీటక మొందు అదె భ్రమరంబయినట్లు**
**అమలుడవగు నీవైతిని అన్నమాచార్యుడా**
**అమరని వెస నాకేటికి? అసురత్వము బోద్రోలుము**
**అమరవాది నయ్య! నేను అన్నమాచార్యుడా!** ॥అందాల॥

**అదె శ్రీవేంకటనగమున అలమేలుమంగ గూడి**
**ముదమారగ వరాలిచ్చి మురహరి గోవిందుడు**
**ఇదిగో అవతారికలు ఇదె భావ వివరణలు**
**అదె నీకీర్తనల జడి అన్నమాచార్యుడా!** ॥అందాల॥

ఈవిధంగా కీర్తన వ్రాయగలిగేశక్తి వచ్చినా, నాకు అన్నమాచార్యులవారి కీర్తనలు వివరించడమే ఇష్టం. నాముక్తి మార్గం అదే. ఈ విధంగా



అంతయు నీవే హరిపుండరీకాక్ష

నాజీవితమూ ఇంకా కొంతమందికి వుపయోగపడుతుంది. ఇంతకంటే హరిసేవయేమంటుంది చెప్పండి.

ఇక చిట్టచివరిగా "అంతయు నీవే హరి పుండరీకాక్ష" గురించి. ఇంతవరకు 909 అన్నమయ్య కీర్తనలకు అవతారికల వంటి ఉపోద్ఘాతాలను, భావవివరణల వంటి తాత్పర్య వివరములను అందించాను. ఈ పదియవ సంపుటములో కూడా 101 అన్నమయ్య భక్తి శృంగార, అధ్యాత్మ కీర్తనలను అందించాలని నా సంకల్పం. దీనితో 1009 కీర్తనలు చేయాలనే నా సంకల్పం నెరవేరుతుంది. శ్రీ వేంకటేశ్వరుని కరుణా కటాక్ష వీక్షణం నాపై వుంటే నా సంకల్పం నెరవేరుతుంది.

ఎటుజూచినా శ్రీహరియే, దేంట్లోనైనా శ్రీహరే, ఏదైనా శ్రీహరే. ఈభావనతో శ్రీహరి శరణాగతులై జీవిస్తే... త్రికరణ శుద్ధితో వుండగలిగితే మన బాగోగులు ఆయనే చూసుకొంటాడు.

ఇది సత్యం. పున: పున: సత్యం



## అంతయు నీవేహరి పుండరీకాక్ష

సంపుటి: 4 కీర్తన : అచ్చుతుఁ డనియెడి నామము గలిగినయట్టి
సంఖ్య : 104 పుట : 70 రాగం: సామంతం

### సామంతం

1 అచ్చుతుఁ డనియెడి నామముగలిగినయట్టి నీవెకాక
కుచ్చి నీకు నేశరణని కొలిచితి గురుతుగఁ గావఁగదే ॥ పల్లవి॥

అణురూపగు మశకములోపల నణఁగిన నీకంటే
గుణించి యెంచి చూచినను కొంచె మింక నేది
ప్రణుతింపంగ బ్రహ్మాండకోట్లు భరియించు నీకంటే
గణనకు నెక్కుడు నీవేకాక ఘన మిఁక నేది ॥అచ్చు॥

దాకొని జగములు పుట్టించుబ్రహ్మకు తండ్రివి నీవే
కైకొని చదువులఁ దెలిసిచూడ రక్షకు లిఁక మరి వేరీ
యేకోదశముగ వటపత్రమున యీఁదేటి నీకంటే
దీకొని పలికిన కాలంబుల కొనదేవుఁడు మఱి వేఁడీ ॥అచ్చు॥

శ్రీవేంకటమున వరము లొసఁగేటి శ్రీపతి నీకంటే
తావునఁ గన్నులఁజూడఁగఁ బ్రత్యక్షదైవము మరివేఁడీ
వేవేలకు వైకుంఠవిభుఁడవై వెలసిన నీకంటే
భావించి చూచిన నంతరంగమునఁ బరోక్షదైవము మరివేఁడీ॥అచ్చు॥

**అవతారిక:**

శ్రీమన్నారాయణుని స్తుతిస్తున్నారు అన్నమాచార్యులవారు. 'కుచ్చి' అంటే కుచించుకుపోయి, లేక బాగా తగ్గిపోయి అని అర్థం. అచ్చుతుడంటే 'చ్యుతి' లేక నాశనమెరుగనివాడు. "ఓ ప్రభూ! అచ్చుతుడనేపేరుగల నీవు కాక, రక్షించే వారెవరు వున్నారు? అణకువతో నిన్ను శరణని కొలిచితేచాలు. ఈ మాటే గుర్తుగా మమ్ము గావగదే!" అంటున్నారు భక్తిని ప్రకటించాలి అంటే శరణాగతిని మించిన ఉపాయము లేదు. ఈ కీర్తన





వివరణ అనుకున్నంత తేలికకాదని పల్లవి చదవంగానే అర్థం అయింది. అయితేనేమి ఆదిలోనే ఆదిదేవునితో అంతయు నీవేహరి పుండరీకాక్ష! అన్నాము కదా! ఇంకా భయమెందుకు? పదండి ముందుకు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! అచ్చుతుడు (అచ్యుతుడు) అనే పేరుగల నీవు తప్పించి, మాకు మరొక దిక్కులేదు. నీకు నేను కుచ్చి (వినమ్రుడనై) నీవే శరణని కొలిచితిని. నన్ను గురుతుగ (నన్నే లక్ష్యముగా) కావగదే (రక్షింపు తండ్రీ)

అణురూపములోనున్న (అత్యల్ప పరిమాణముగల) మశకము (దోమ) లోపలకూడా అణగియున్న నీకంటే లెక్క కట్టటానికి, కొంచెమింకనేది (అల్ప ప్రాణియేదీ?) ప్రణుతింపగా (కీర్తించగా) అనంత కోటి బ్రహ్మాండములను నీ వుదరములో భరిస్తున్నావు. గణనకు నెక్కిన (ప్రసిద్ధుడైన) దేవరు? ఎవ్వరూ లేరయ్యా!

దాకొని (అవ్యక్తుడవై) జగములనన్నింటినీ సృజించు పరమేష్ఠి అయిన బ్రహ్మదేవుని సృజించి నీవు ఆయనకు తండ్రిగారైనావు. ఆనాడు సోమకుడు అనే రాక్షసుడు ఆయన దగ్గరనుంచి చదువులను (వేదములను) కాజేస్తే నీవు కైకొని (పూనుకొని) వాడిని చంపి, వాటిని కాపాడినావు. నీకంటే రక్షకులెవరు?

ఏకోదకముగా (ఒక్క నీరు తప్ప ఇంకేమీ లేనట్లుగా) వున్నప్పుడు, వటపత్రశాయివై (ఒక్క మఱ్ఱియాకుపై పవ్వళించిన శిశువు వలె యీదేటి (తేలిన) నీకంటే దీకొని పలికిన (ధైర్యంగా చెప్పాలంటే) కాలంబుల కొనదేలిన (యుగాంతాలలో కూడావుండే) దేవుడు మఱివేఁడి (ఇంకలేదయ్యా!)

శ్రీవేంకటాద్రి మీద వెలసి వరములనొసగే శ్రీపతీ! నీకంటే తావున గన్నుల జూడ (నెలకొని చూడాలంటే) ఇంకొక ప్రత్యక్షదైవము లేనేలేదు. వేవేలకు (వేలకొద్దీ శరణాగతుల కొరకు) వైకుంఠపతివై ఈ తిరుమలలో వెలసిన నీకంటే అంతరంగమున (మానసాకాశమున) భావించి చూచిన (భావనలో నిలిపి సందర్శించిన) ఇంకమరి యొక పరోక్షదైవము (ఇంద్రియములకు గోచరింపని పరమాత్మ) మరి వేఁడీ (ఇంకాయెవ్వరున్నారు?)

సంపుటి: 4 కీర్తన : ఆతడేపో మాయేలిక ఆతడే జగన్మూల
సంఖ్య : 109 పుట : 73 రాగం: మాళవి

### మాళవి

2 ఆతఁడేపో మాయేలిక ఆతఁడే జగన్మూల-
మాతఁడే శ్రీవేంకటాద్రియందు మీఁదిదైవము ॥ పల్లవి॥

కమలవాసినియైన కాంతఁ బెండ్లాడినాఁ (నవాఁ?)డు
కమలములో బిడ్డఁ గన్నవాఁడు
కమలాప్తునిలోనఁ గలిగి మెరయువాఁడు
కమలనాభుఁడేపో కలుగుమాదైవము ॥ఆతఁ॥

జలధి బంధించి లంక సంహరించినవాఁడు
జలధిచొచ్చినదైత్యుఁ జంపినవాఁడు
జలధిసుతునకు వరుస బావైనవాఁడు
జలధిశయునుఁడేపో చక్కని మాదైవము ॥ఆతఁ॥

కొండ గొడుగుగనెత్తి గోవులఁగాచినవాఁడు
కొండవంటి రాకాసిఁ గొట్టినవాఁడు
కొండలకు నెక్కుడైనగురుతు శ్రీవేంకటాద్రి
కొండరూపు దానేపో కోరిన మాదైవము ॥ఆతఁ॥

**అవతారిక:**

అన్నమాచార్యులవారి ఈ కీర్తన అర్థం కావాలంటే పురాణాలమీద మంచి పట్టు వుండితీరాలి. ఆతడే జగన్మూలమైన శ్రీవేంకటాద్రిమీది దైవము అని కీర్తిస్తున్నారు. ఈ స్వామి కమలాప్తుడైన సూర్యునిలోని వెలుగై దీప్తించువాడు. ఈయన జలధిసుతునకు బావగారు అంటున్నారు. మరి ఆబావమరిది యెవరో? ఈయన కొండవంటి రాకాసిని కొట్టినవాడట. మరి ఆ రాకాసియెవరో? శ్రీవేంకటాద్రి కొండరూపు తానేపో అంటున్నారు.





అంటే ఏయిటి? భావవివరణ చదివితే అన్నీ పూసగుచ్చినట్లు అర్థమవుతాయి మరి.

**భావ వివరణ:**

ఆతడే (ఆ శ్రీవేంకటేశ్వరుడే) పో మాయేలిక (ప్రభువు). ఆతడే జగమునకు మూలకారణము. ఆతడే శ్రీవేంకటగిరిపై వెలసిన దైవము.

ఆతడెటువంటివాడో తెలియునా? కమలములో వసించు కాంతను బెండ్లాడినవాడు. కమలములో బిడ్డను (బ్రహ్మదేవుని) గన్నవాడు (కన్నతండ్రి). కమలాప్తుడైన సూర్యునిలో గలిగి (నెలకొని) వెలుగులు జిమ్మేవాడు. అటువంటి కమలనాభుడే పో మాకున్న దైవము.

ఇంకా చెప్పాలంటే, ఆయన జలధిని బంధించినవాడు (సేతువును సాగరముపై నిర్మించిన శ్రీరాముడు). లంక (లంకిణి) అను రాక్షసిని సంహరించినవాడు (చంపించినవాడు). ఆయనే జలధి జొచ్చిన దైత్యుని (వేదములను అపహరించి సముద్రంలో దాగిన సోమకాసురుని) చంపిన శ్రీమన్నారాయణుడు కూడా ఆయనే. జలధిసుతునకు (క్షీరసాగర మథనమున పుట్టిన చంద్రునికి) వరుస బావ (అతని యొక్క సోదరి శ్రీలక్ష్మిని పెండ్లాటుచేత వరుసకు బావ) అయినవాడు. అటువంటి క్షీరసాగరముపై పవ్వళించు స్వామియే పో మా దైవము.

ఇంతేకాక తన శ్రీకృష్ణావతారమున ఈయనే కొండను (గోవర్ధన పర్వతమును) గొడుగువలె చేతబట్టుకొని గోవులను, గోకులమును రక్షించినాడు. ఈతడే కొండవంటి రాకాసిని (రాక్షసి పూతనని) గొట్టినవాడు (చనుబాలుత్రాగు నెపముతో సంహరించినవాడు). కొండలకు నెక్కుడైన (కొండలలో అత్యంత శ్రేష్ఠమైన) శ్రీవేంకటాద్రిపైన కొండరూపములో వున్నాడు (ఆ వేంకటాద్రి పడుకొని వున్న స్వామి శిరస్సును స్ఫురింపజేస్తుంది). తానేపో (ఆ శ్రీవేంకటేశ్వరుడే పో) మా దైవము.

సంపుటి: 4 కీర్తన : కదిసి యాతడు మమ్ముగాచుగాక
సంఖ్య : 445 పుట : 299 రాగం: శంకరాభరణం

## శంకరాభరణం

3 కదిసి యాతఁడు మమ్ముఁగాచుఁగాక
అదె యాతనికె శరణంటే నంటి నేను ॥ పల్లవి॥

యెవ్వని వుదరమున నిన్నిలోకములుండు
యెవ్వని పాదము మోచె నిల యల్లను
యెవ్వఁడు రక్షకుఁ డాయ నీ జంతుకోట్లకు
అవ్విభునికి శరణంటే నంటి నిప్పుడు ॥కదిసి॥

సభలో ద్రౌపదిఁగాచె సర్వేశుఁ డెవ్వఁడు
అభయహస్త మొసంగె నాతఁ డెవ్వఁడు
ఇభవరదుఁ డెవ్వఁడు యీతనికే వొడిగట్టి
అభినవముగ శరణంటే నంటి నిప్పుడు ॥కదిసి॥

శరణుచొచ్చిన విభీషణుఁ గాచె నెవ్వఁడు
అరిది యజునితండ్రి యాతఁడెవ్వఁడు
యిరవై శ్రీవేంకటాద్రి యెక్కి నాతఁడితఁడే
అరసి యితనికే శరణంటే నంటి నిప్పుడు ॥కదిసి॥

**అవతారిక:**

అదె యాతనికె శరణంటే నంటి నేను అనిపాడుతున్నారు, అన్నమయ్య. ఇదే ఈనాటి తెలుగులో అయితే 'అతనికే శరణంటూ నంటిని' అనే మాటను వుపయోగిస్తాము. ఈ కీర్తన కూడా యెన్నో పురాణ గాథలతో ముడిపెట్టబడియున్నందున మంచి పురాణ వాఙ్మయపరిచయం వున్నవారికి మాత్రమే ఈ కీర్తనలోని లాలిత్యము అర్థమవుతుంది.

"ఎవని పాదము మోచె నిలయల్లను" అంటే ఎవ్వని పాదము భూమినంతా కొలిచింది అని అర్థం. అవును ఎవరి పాదం భూమిని కొలిచిందో తెలుసా?





**భావ వివరణ:**

ఆతడు (ఆ శ్రీహరి) కదిసి (మాకు దగ్గరయై) మమ్ము గాచుగాన (రక్షిస్తాడు కాబట్టి), నేను అదె (అందుచేతనే) ఆయనకే 'శరణంటేనంటి' (శరణు మహాప్రభో! అన్నాను.)

మేము మామూలు సాధారణమైనవాడిని ఆశ్రయించాలనుకొన్నారా యేమి? ఇన్నిలోకములు (ఈ పదినాలుగు భువనాలు) యెవ్వని వుదరములో (కడుపులో) నున్నవో, ఇలయెల్లను యెవ్వని పాదము మోచెన్? (ఈ భూమినంతా యెవరి పాదము కొలిచింది? (మనపొట్టి వామనమూర్తి). కోట్లాది జంతువులు విచక్షణా రహితంగా ఒకదాన్నొకటి చంపుకొంటూనే వుంటాయి. మరి వాటికి రక్షకుడెవడు? అవి ఇంకా యెందుకు జీవిస్తూనేవున్నాయి? వాడే జగద్విభుడు, వాడే నారాయణుడు. ఇప్పుడే నేను ఆయనకు శరణు మహాప్రభో! అన్నాను.

ఆరోజు, నిండు సభలో వస్త్రములూడదీసి దుశ్శాసనుడు ద్రౌపదిని వివస్త్రను చేయబోతే అక్షయముగా వలువలిచ్చి అభయ హస్తము నిచ్చిన ఆతడెవ్వరు? ఆ సర్వేశ్వరుడెవరు? ఇభవరదుడెవ్వడు (ఆనాడు కారడవి కొలనులో తన కాలునుపట్టి పీడిస్తున్న మొసలి నుండి తనను రక్షించుకోలేక "నీవే తప్ప నిత:పరంబెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్ అని రోదిస్తున్న గజేంద్రుని హుటాహుటివెళ్ళి రక్షించినదెవ్వరు?) ఆతనికే అభినవముగ (కొత్తగా) ఒడిగట్టి (నిశ్చయుడనై) శరణు మహాప్రభో! అన్నాను.

ఎంత నచ్చజెప్పినా వినక, శ్రీరామపత్ని సీతను చెరబట్టి కులఘాతకుడైన అన్న రావణాసురుని త్యజించి శరణుజొచ్చిన విభీషణుని రక్షించినదెవరు? అరిది (దుర్లభుడైన) అజునకు (బ్రహ్మదేవునికే) తండ్రియైన వాడెవరు? ఇంకెవరండీ... ఇదిగో ఇరవుయై (ఇక్కడ నెలకొని) ఈ శ్రీవేంకటాద్రిని యెక్కిన ఈయనే ఆయన... ఆయనే యీయన. అరసి (అది గ్రహించి) నేను ఇప్పుడు ఈయనకే "శ్రీవేంకటేశవమ్ శరణం ప్రపద్యే"... అని వేడుకొన్నాను. శరణంటేనంటినయ్యా!

సంపుటి: 2 కీర్తన : నరుడా యీతడు ఆదినారాయణుడు గాక
సంఖ్య : 497 పుట : 336 రాగం: సాళంగనాట

## సాళంగనాట

4 నరుఁడా యీతఁడు ఆదినారాయణుఁడు గాక
ధరణిఁ గీరితి కెక్కె దశరథసుతుఁడు ॥ పల్లవి॥

యీతఁడా తాటకిఁ జంపె నీ మారీచసుబాహుల
నీతఁడా మదమణఁచె నిందరుఁ జూడ
యేతులకు హరువిల్లు యీతఁడా విరిచి యట్టె
సీతఁ బెడ్లియాడెను యీ చిన్న రాముఁడా ॥నరుఁ॥

చుప్పనాతి ముక్కుగోసి సోదించి దైత్యులఁ జంపి
అప్పుడిట్టె వాలినేసినాతఁ డీతఁడా
గుప్పించి కోఁతుల నేలి కొండల జలధిగట్టి
కప్పి లంక సాధించె నీ కౌసల్యానందనుఁడా ॥నరుఁ॥

రావణాదులను జంపి రక్షించి విభీషణుని
భావించయోధ్య నీతఁడు పట్ట మేలెను
శ్రీవేంకటేశుఁ డితఁడే సృష్టి రక్షించె నితఁడే
యీవల మాపాలనున్న యీ రామచంద్రుఁడా ॥నరుఁ॥

**అవతారిక:**

విశిష్టా ద్వైతమత ప్రచారకుడైఅన్నమాచార్యులవారు వూరూరా తిరిగి తన కీర్తనలను వినిపించి మరీ విష్ణుతత్త్వం ప్రబోధించారు. ఆ రోజుల్లో రామాలయంలేని వూరు వుండేదికాదు. ఏవూరికెళ్తే ఆవూరి శ్రీరామునిపై కీర్తన చెప్పేవారు. ప్రతి కీర్తనలోనూ రామకథను ఆద్యంతం గానం చేయడం ఆయన ప్రత్యేకత. బహుశా ఆ వూరిలో సంస్కృత పండితులెక్కువమంది వుంటే కీర్తన గీర్వాణిలో చెప్పేవారేమో. అందుకనే అన్నమయ్య సంస్కృత కీర్తనలు





యెక్కువగా శ్రీరామునిపైనా నృశింహునిపైనా వున్నాయని నాకు అనిపిస్తుంది. అందుకే... ఓ నరులారా! ఈతడు ఆదినారాయణుడు దశరథసుతునిగా ధరణిలో కీర్తిని పొందాడు... అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ నరులారా! ఈతడెవరనుకొన్నారు? ఆదిదేవుడైన ఆదినారాయణుడు. గాక (అయితే) ధరణిన్ కీరితికెక్కె (భూలోకంలో పేరుపొందినది మాత్రం) దశరథ సుతుడైన శ్రీరామచంద్రమూర్తి అనే సుమా! (మరి ఆయన చేసిన ఘనకార్యాలు అట్లున్నవి).

ఈయన తాటకి అనే రాక్షసిని సంహరించాడు. ఇందరుజూడ (విశ్వామిత్రుని యాగమును చూచుటకు వచ్చిన ఇంత మంది చూస్తుండగా) ఈయన దాని కొడుకులైన మారీచ సుబాహుల మదమును అణచినాడు. ఈచిన్నారి రాముడు, ఏతులకు (ఉద్ధతితో) శివధనస్సును విరిచి అట్టే (అవలీలగా) సీతను పెండ్లాడినాడు.

ఈయన లక్ష్మణుని ప్రేరేపించి 'చుప్పనాతి' అని పేరువడ్డ శూర్పనఖ ముక్కు చెవులను కోయించినాడు. సోదించి (వెదకి వెదకి) రాక్షసులను సంహరించినాడు. ఆ తరువాత రావణాసురునివంటి వాని మదమణచిన వాలిని ఒక్క అమ్ము వేసి మట్టుబెట్టాడు. ఆ మహానుభావుడే ఈ చిన్నారి రాముడా!! కుప్పించి యెగిరే కోతులను ఒక సేనగా నడిపించిన నాయకుడా!! అవునయ్యా! ఈ కౌసల్యానందనుడే జలధిగట్టి (సముద్రముపై సేతువును నిర్మించి రావణునిపై దండెత్తి స్వర్ణలంకను సాధించినాడు.

ఆనాడావిధంగా రావణుని సంహరించాక ఆ లంకను రావణుని తమ్ముడైన విభీషణునికే పట్టము గట్టిన ధర్మమూర్తి ఈయన. తమ కోసల రాజధాని అయోధ్యా నగరానికి పట్టాభిషిక్తుడై పరిపాలించాడు. ఆనాటి త్రేతాయుగానంతరం ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడై తదనంతరం ఈ కలియుగంలో ఇతడే కలియుగంలో శ్రీవేంకటేశ్వరుడై ఈ సృష్టిని రక్షిస్తున్నాడు. ఈ శ్రీరామచంద్రడే మా పాలనున్నాడు (మా పాల దైవమై వున్నాడు).

సంపుటి: 4　　కీర్తన : అతడితడా వెన్నలంతట దొంగిలినాడు

సంఖ్య : 6　　పుట : 4　　రాగం: లలిత

**లలిత**

5 అతఁడితఁడా వెన్న లంతట దొంగిలినాఁడు
యేతులకు మద్దులు రెండిలఁ దోసినాఁడు　　॥ పల్లవి॥

యీతఁడా దేవకిగన్నయింద్రనీలమాణికము
పూతకిచన్ను దాగి పొదలినాఁడు
యీతఁడా వసుదేవుని యింటలో నిధానము
చేతనే కంసునిఁ బుట్టచెండుసేసినాఁడు　　॥అతఁ॥

మేటియైనగొంతిదేవిమేనల్లుఁ డీతఁడా
కోటికిఁ బడెగెగాను కొండ యెత్తెను
పాటించి పెంచే యశోదపాలి భాగ్య మీతఁడా
వాటమై గొల్లెతలను వలపించినాఁడు　　॥అతఁ॥

ముగురువేలుపులకు మూలభూతి యీతఁడా
జిగి నావులఁ బేయలఁ జేరి కాచెను
మిగుల శ్రీవేంకటాద్రిమీఁదిదైవ మితఁడా
తగి రామకృష్ణావతార మందె నిప్పుడు　　॥అతఁ॥

**అవతారిక:**

ఈ వెన్నలు దొంగిలించే గొల్లపిల్లవాడు ఆ తిరుమలేశుడా!! రెండు మద్ది చెట్లను ఇతడు వుద్ధతితో తోసినాడు అంటున్నారు అన్నమయ్య. ఈ కీర్తనలో వాడిన భాష తెలుగునుడికారములతో బహు పసందుగా వుంది. ఈయన కంసుని పుట్టచెండుసేసినాడు అంటున్నారు. అంటే బంతిలా ఆడుకొన్నాడన్నమాట. అదేవిధంగా "కోటికి బడెగె గాను కొండయెత్తెను" అంటే జగత్ప్రసిద్ధుడై గోవర్ధనము అనే కొండను యెత్తినాడు అని అర్థం





చెప్పుకోవాలి. ముగురు వేల్పులకు మూలభూతి అంటే బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు మూలకారణమైన పరమపురుషుడు ఈ బాలుడు అని కీర్తిస్తున్నారు. ఇప్పుడాయన యెత్తినది రామకృష్ణావతారమట. అంటే?

**భావ వివరణ:**

ఆహా! యేమిటీవింత!! అతడు (ఆదిదేవుడైన పరమాత్మ) ఇతడా (ఈ బాలుడా). వీడు వెన్నలనన్నింటినీ రేపల్లెలో దొంగిలించినాడు. ఏతులకు (ఉద్ధతితో) తమ పెరటిలో బహుకాలమునుంచివున్న రెండు మద్ది చెట్లను ఇల తోసినాడు (నేలపై పడతోసినాడు).

ఈతడు ఆ దేవకీదేవి గర్భవాసము నుండి జన్మించిన ఇంద్రనీల మాణిక్యము. మానవకాంతగా వచ్చిన పూతన అనే రాక్షసి చనుబ్రాలు తాగి పొదలినాడు (వర్ధిల్లినాడు). ఈతడు ఆ వసుదేవుని ఇంట వెలసిన నిధానము (పాతర వంటి నిధి). తన మేనమామయైన కంసుని చేతనే (ప్రాణాలతో) పుట్టచెండుసేసినాడు (బంతి ఆట ఆడుకొన్నాడు).

ఈ బాలుడే పెరిగి పెద్దవాడై పాండవుల తల్లి గొంతిదేవికి (కుంతీదేవికి) మేనల్లుడై అత్తా అనిపిలిచి ఆమెకు అభయమొసగినాడు. ఇతడే "కోటికిన్ పడెగెగాను కొండయెత్తెను" (జగత్ ప్రసిద్ధమైన గోవర్ధనపర్వతమును యెత్తి తన చిటికిన వ్రేలిపై నిలబెట్టాడు). పాటించి (ఆదరించి) పెంచిన తల్లి యశోదాదేవికి ఇతడు భాగ్యమై, మరు జన్మలో కూడా వకుళాదేవియైన ఆమెకు బిడ్డ శ్రీనివాసుడై అమ్మా అని పిలిచాడు. గోపికలను వాటమై (మరిగి) వలపించుకొనినాడు.

ఈతడు, ఆ ముగ్గురు వేలుపులకు (త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు) మూలభూతి మూలకారణమైన పరమపురుషుడు. అయినా జిగి (వెలుగులు జిమ్మి) ఆవులను పెయ్యలను కాచినాడు. మిగుల (అధికుడై మిగిలిపోయి) శ్రీవేంకటాద్రిపైని వేంకటేశ్వరుడు కూడా ఇతడేనా? అవునయ్యా! నిజము. ఇప్పుడు బలరామకృష్ణుల అవతారమెత్తిన ఈ బాలుడే ఆ పరమాత్మ.

సంపుటి: 4 కీర్తన : నరులార నేఁడువో నారసింహజయంతి
సంఖ్య : 310 పుట : 208 రాగం: ముఖారి

## ముఖారి

6 నరులార నేఁడువో నారసింహజయంతి
సురలకు నానందమై శుభము లొసఁగెను ॥ పల్లవి॥

సందించి వైశాఖశుద్ధ చతుర్దశి శనివార-
మందు సంధ్యాకాలమున నౌభళేశుఁడు
పొందుగాఁ గంభములోనఁ బొడమి కడపమీఁద
కందువ గోళ్ళఁ జించెఁ గనకకశిపుని ॥నరు॥

నరమృగరూపము నానాహస్తముల
అరిది శంఖచక్రాది ఆయుధాలతో
గరిమఁ బ్రహ్లాదునిఁ గాచి రక్షించి నిలిచె
గురుతరబ్రహ్మాండ గుహలోనను ॥నరు॥

కాంచనపుగద్దె మీఁద గక్కనఁ గొలువైయుండి
మించుగ నిందిరఁ దొడమీఁదఁ బెట్టుక
అంచె శ్రీవేంకటగిరి నాదిమపురుషుండై
వంచన సేయక మంచివరాలిచ్చీనదివో ॥నరు॥

**అవతారిక:**

ఒకానొక నృసింహ జయంతి సందర్భంగా అన్నమాచార్యులవారు చెప్పిన కీర్తననాస్వాదించండి. "ఓనరులారా! నేటిదినముననే స్తంభములో నరసింహుడు వుదయించి హిరణ్యకశిపుని తుదముట్టించి దేవతలకు శుభములను ఆనందమును యొసగినాడు" అని, ఆయన ప్రహ్లాదుని రక్షించిన వైనం కీర్తిస్తున్నారు. శ్రీవేంకటగిరి ఆదిమ పురుషుడైన ఆ ఏడుకొండలవాడే ఈయనైనందువలన వంచన సేయక మంచి





వరాలిస్తాడు అని అంటున్నారు. ఈ ఔభళేశుడు (అహోబల నరసింహుడు) గురుతరమైన బ్రహ్మాండ గుహలో వెలసినాడట.

**భావ వివరణ:**

ఓ నరులారా! నేడే నృసింహ జయంతి. ఈ నరసింహ జయంతి నాడే ఆయన స్తంభమున వెలసి హిరణ్యకశిపుని వధించి సురులకు ఆనందము కలిగించి శుభములనొసగినాడు.

ఈ ఔభళేశుడు (అహోబలేశ్వరుడు) సందించి (పూని) వైశాఖ శుద్ధ చతుర్దశినాడు, శనివారము రోజున సంధ్యా సమయమున ఆవిర్భవించినాడు. చక్కగా ఆ హిరణ్యకశిపుని వరముల ననుసరించియే కంభములో పొడమి (స్తంభములోనుంచి పుట్టాడు కాబట్టి యే తల్లిదండ్రికి పుట్టనివాడైనాడు). ఒక కడపమీద వాడిని చంపాడు (కాబట్టి ఇంటా బయటా కాని చోటనే వాడు చచ్చాడు). కందువ (సామర్థ్యంతో) తనవాడియైన గోళ్ళతో (యే ఆయుధముతోను వాడికి చావులేదు కాబట్టి) చీల్చి ఆ కనకకశిపుని (హిరణ్య కశిపుని) వధించినాడు.

ఈయనయెట్లా వున్నాడో ఒకసారి చూడండి. ఈయనది నరమృగరూపము (తల సింహానిది శరీరము నరునిది), నానాహస్తములు (చాలా చేతులు వున్నందున నరుడు కూడా కాదు). అరిది (ఉపయోగింపబడని) శంఖచక్రములు ఆయన హస్తభూషణములుగా వున్నవి. గరిమ (అద్భుతముగా) తన ప్రియభక్తుడైన ప్రహ్లాదుని కాపాడి రక్షించి నిలిచినాడు. ఎక్కడ? బ్రహ్మాండమైన ఈ అహోబలం కొండ గుహలో నిలిచినాడు.

ఎట్లా నిలిచాడో గమనించండి. ఆ దనుజుని వధానంతరం వెంటనే బంగారు గద్దెపై (సింహాసనముపై) మించుగ (వున్నతముగా) ఇందిరను (శ్రీలక్ష్మిని) తన తొడపై కూర్చుండబెట్టుకొని కొలువైయున్నాడు. ఈయనే అంచె (ఆ తరువాత) శ్రీవేంకటగిరి మీద ఆది పురుషుడు శ్రీవేంకటేశ్వరుడై నిలిచాడు. వంచన సేయక (నమ్మిన తన భక్తులను వంచించక) మంచి మంచి వరములనిస్తున్నాడు. అదిగో ఆయనకు మ్రొక్కండి.

సంపుటి: 14 కీర్తన : మంచివాడవంతేపో మాధవరాయా
సంఖ్య : 237 పుట : 138 రాగం: దేసాళం

## దేసాళం

7 మంచివాఁడవంతేపో మాధవరాయా
మంచుమాయ మాఁడుకూరి మాధవరాయా ॥ పల్లవి॥

మోనాననుండిన నన్ను ముట్టి వేఁడుకొనేనంటా
మానమేలంటేవోయి మాధవరాయా
నేనా సారెకు వచ్చి నీతో నెదురాడేదాన
మానవుగా మాఁడుకూరి మాధవరాయా ॥మంచి॥

యోగసక్యానకే మాఇల్లుచొచ్చి వచ్చేవు
మగనాలిఁ గదవోయి మాధవరాయా
బగి వాయక కూచుండి పైఁ దొడవేసేవు నీ –
మగువనా మాఁడుకూరి మాధవరాయా ॥మంచి॥

వోపనన్నాఁ బోనీవు వొడివట్టి తీసేవు
మాపుదాఁకా నేలోయి మాధవరాయా
కోపుగా శ్రీవేంకటాద్రిఁ గూడి చూపేవా నీయెమ్మె
మాపైనే మాఁడుకూరి మాధవరాయా. ॥మంచి॥237

**అవతారిక:**

మాడుకూరు అనే గ్రామములో వెలసిన మాధవరాయనిపై సరస శృంగార కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఈయన మంచివాడే, కాని మంచుమాయగాడట. మంచువలె చల్లనైనవాడే కాని మాయగాడట. నాయిక మానమునంటి వేడుకొంటాడట. ఇక మౌనంగావుండటం ఆవిడవల్ల యేమవుతుంది చెప్పండి. మహానుభావా! నేను మగని చాటు 'మగనాలి' నన్నా వినిపించుకోడట. నేను 'ఓపను'





అన్నాకూడా వదలడట. శ్రీవేంకటాద్రిపై కూడా 'యెమ్మెలు' చూపిస్తున్నావా నామీద అంటున్నారు. కొంచెం తికమకపెట్టే కీర్తనే ఇది. శృంగార భక్తిని రుచి చూడండి.

**భావ వివరణ:**

ఓ మాధవరాయా! నీవు మంచివాడవు. అంతే... నేను నీకు నిజమే చెబుతున్నాను. మాడుకూరిలో వెలసిన మాధవరాయా! నీవు చల్లే మాయలు మంచు మాయలు. మంచు అస్థిత్వమువలె, నీ వలపు మాయ అస్థిరమైనది.

మోనాన వుండి నన్ను (నేను మౌనంగా వుంటే) ముట్టి వేడుకొంటావు (నన్ను తాకుతూ బ్రతిమిలాడతావు). నా మానము నంటి మరీ మాటలు కలుపుతావు. నేను నీయెదుటకు వచ్చి నా మౌనం వదలి నీతో యెదురుమాట్లాడేదాకా, మానవుగా (వదలిపెట్టవు కదా!) ఓ మాడుకూరి మాధవరాయా! నీతో వేగటం కష్టమే స్వామీ!

ఎగసక్కెములు (పరాచికాలు) ఆడుకొంటూ మా ఇంట్లో దూరుతావు. నేను మగనాలిని (మగనిచాటు పెళ్ళాన్ని) అన్నా నన్ను విడిచిపెట్టవు. బగివాయక కూర్చుండి (నాపక్కనే కూర్చుండి) తొడపై చేతులు వేస్తావు. ఇదేమి అఘాయిత్యము? నేనేమి నీ మగువనా? (పెండ్లామునా?) ఓ మాడుకూరి మాధవరాయా! ఇదేమన్నా మర్యాదగా వున్నదా ప్రభూ!

స్వామీ! నీ చిలిపి చేష్టలకు నేను ఓపను (తాళను) అన్నా, నన్ను పోనియవు. ఒడిసిపట్టి ఆక్రమింతువు. మాపుదాకా (చీకటిపడేదాకా చీకాకు పెడతావు). ఇట్లా అయితే యెట్లు ముడిపడుతుంది? కోపుగా (అందముగా) శ్రీవేంకటాద్రిమీద కూడి నీవే వేంకటేశ్వరుడవై నీ యెమ్మెలు (వన్నెలు) మాపైన చూపిస్తున్నావా? ఓ మాడుకూరి మాధవరాయా! మేము చరితార్థులమైనాము ప్రభూ!

సంపుటి: 14 కీర్తన : కోడెకాదు గదవమ్మ గోవిందరాజు
సంఖ్య : 95 పుట : 57 రాగం: దేశాక్షి

## దేశాక్షి

8 కోడెకాఁడు గదవమ్మ గోవిందరాజు
వేడుక మోవులతేనె విందారగించీని ॥ పల్లవి॥

కొలువు కూటములోన గోవిందరాజు వాఁడే
పలుమారుఁ జెలులతోఁ బందేలాడీని
నిలువుల మేడమీఁద నిలిచి గోవిందరాజు
వలపులు చల్లుచును వసంతాలాడీని ॥కోడె॥

కోరి కేళాకూళిలోన గోవిందరాజు వాఁడే
సారె నింతులతో నీరు చల్లులాడీని
తూరుచు సింగారపుఁ దోటలో గోవిందరాజు
సైరణ లేకందరితో జాజరలాడీని ॥కోడె॥

గోముల శ్రీవేంకటాద్రి గోవిందరాజు వాఁడె
రామలతోదుతను సరసమాడీని
గామిడై పాన్పుపైఁ గూడి కందువ గోవిందరాజు
మోములు చూచందరితో ముచ్చటలాడీని. ॥కోడె॥95

**అవతారిక:**

నిఘంటువు సాయం లేకపోతే ఈ కీర్తన వివరించడం దాదాపు అసాధ్యమే. కోడె వయసుగాడైన గోవిందరాజు వేడుకతో అధరామృతాల నాస్వాదిస్తుంటాడట. నిలువుల మేడమీద నిలిచివుంటాడట. కేళాకూళి అంటే జలక్రీడలని అర్థం. అవంటే మహా ఇష్టంట ఆయనకి. సైరణలేక జాజరచల్లుతాడట. రామలతో సరసాలాడతాడట. మోములు చూచి అందరితో ముచ్చట్లాడతాడట. పాన్పుపై గామిడై కూడినాడట.





ఒకటారెండా? దాదాపు అన్నీ తెలియని తెలుగుమాటలే. తెలివిగా భావవివరణ చదివేద్దాం. పదండి ముందుకు. ఇంతకీ ఈ కీర్తన తిరుపతిలోని గోవిందరాజ స్వామిపైననే సుమండీ.

**భావ వివరణ:**

ఓ భామలారా! ఈ గోవిందరాజస్వామివున్నాడే, ఈయన కోడెగాడు గదమ్మా (కోడెవయసువాడు కదుటమ్మా!) ఈయన వేడుకతో భామల మోవితేనెలు (అధరామృతములను) విందారగించీని (విందువలె నాస్వాదిస్తాడు).

ఈ గోవిందరాజస్వామి తన కొలువుదీర్చియున్నాడు. కానీ తన చెలులతో (ఇద్దరు భామలు భూదేవి శ్రీదేవిలతో) పందేలాడీని (పందెములు కాస్తున్నాడు). ఆయన నిలువుల మేడల మీద (ఎత్తయిన మేడలమీద) నిలిచి అందరినీ పరికిస్తుంటాడు. తన చెలియలతో వలపులు చల్లుతూ వసంతోత్సవం చేసికొంటాడు (హెూలీ ఆడుతుంటాడన్నమాట).

ఆ గోవిందరాజస్వామికి ఇంకొక ఇష్టమైన ఆట వున్నది. అదే కేళాకూళి (జలక్రీడ). బహు కోరికతో ఆయన జలక్రీడను ఇంతులతో (స్త్రీలతో) నీరు చిమ్ముతూ చల్లులాడీ (చల్లుతూనే వుంటాడు). ఆయన శృంగార వనములో తూరుచు (దూరిపోయి) సైరణ లేక (ఆపటం అనేదే లేకుండా) జాజరలాడీని (వున్నట్టుండి వెనుక నుండి నీళ్ళు చిమ్మటం లాంటి కొంటె పనులు చేస్తుంటాడు).

ఈ గోవిందరాజస్వామే, గోముల (సౌకుమార్యంతో) శ్రీవేంకటాద్రిపై రామలతో (స్త్రీలతో) సరసములాడీని (సరసములాడుతున్న) శ్రీవేంకటేశ్వరుడు కూడా అయివున్నాడు. గామిడై (సర్వశ్రేష్ఠుడై) ఈ గోవిందరాజస్వామి తన శయ్యపై, కందువ గూడి (సమర్థుడై కూడి) మోములు చూచి (వారి అందమైన మొగములను తదేకంగా చూస్తూ) ముచ్చటలాడుతుంటాడు. (ఇన్ని చేస్తూ కూడా శరణాగతులను ఒక కంట కనిపెడుతూనే వుంటాడు సుమా!)

సంపుటి: 14 కీర్తన : వేడుక కాడితడు విఠ్ఠలేశుడు
సంఖ్య : 590 పుట : 340 రాగం: రామక్రియ

**రామక్రియ**

9 వేడుకకాఁ డితఁడు విఠ్ఠలేశుఁడు
వీడని పొందులు సేసీ విఠ్ఠలేశుఁడు ॥ పల్లవి॥

వెన్నదిన్న మదమున వెలఁదులుఁ దానును
వెన్నెలలో నాడీ నిదె విఠ్ఠలేశుఁడు
పన్ని రతుల కింతులఁ బాంచజన్యరవమున
సన్న సేసి పిలిచీని సారె విఠ్ఠలేశుఁడు ॥వేడు॥

ఆసపడి కొలువులో నాడువారి మీఁదట
వేసీ విరులఁ గొని విఠ్ఠలేశుఁడు
వేసరక పదారువేలు సతులయిండ్లా
సేసవెట్టి పెండ్లాడీఁ జేరి విఠ్ఠలేశుఁడు ॥వేడు॥

మెల్లనె గందమిచ్చేటి మెలుతను గాఁగిలించి
వెల్లవిరిగాఁ గూడె విఠ్ఠలేశుఁడు
యిల్లిదె శ్రీవేంకటేశుఁ డితఁడె తానై వుండి
యెల్లగాఁ గోనేట వరాలిచ్చె విఠ్ఠలేశుఁడు ॥వేడు॥ 590

**అవతారిక:**

వేడు కాడంటే నేటి పరిభాషలో 'జల్సారాయుడు' అన్నమాట. అట్లాంటి ఈ విఠ్ఠలేశుడు వీడని పొందులు సేసీ - నంటున్నారు అన్నమాచార్యులవారు. మెలత యొకతె మెల్లగా గంధమియ్యబోయిందట. ఈ విఠ్ఠలేశుడు వూరకుంటాడా? వెల్లవిరిగా ఆమెను కౌగలించి కూడినాడట. ఆ సంతోషంలో కోనేటి ఒడ్డున యెల్లగా వరాలిచ్చేస్తున్నాడట. అంతే కాదండీ ఈ విఠ్ఠలేశుడే ఆ శ్రీవేంకటేశ్వరుడూనూ అంటున్నారు.





పండరంగి విఠ్ఠలునిపై చక్కటి సరస శృంగార కీర్తన ఇది. ఇదే బ్రహ్మానందం. అవునా?

**భావ వివరణ:**

ఓ భక్తులారా! ఈ విఠ్ఠలేశుడు గొప్ప వేడుకకాడు (విలాసపురుషుడు). ఈయన వీడని పొందులు సేసి (విడుపులేని రతి కూటములు గల శృంగార పురుషుడు).

ఈ విఠ్ఠలేశుడు వెన్నలనారగించి. అటు పిమ్మట సంతోషముతో పండువెన్నెలలో వెలదులతో (రమణులతో) ఆడీని రాసక్రీడల దేలినాడు. రతుల కొరకు ఈయన ఇంతులను, పన్ని (పన్నుగడతో) పాంచజన్య శంఖానాదము సంకేతముగా, సారెకు (ప్రతిసారీ) సన్నసేసి (సైగజేసి) పిలిచీని (పిలుస్తాడు). ఎంత టక్కరివాడో చూడండి.

ఈ విఠ్ఠలేశుడు ఆసపడి (వ్యామోహము కలవాడై) అంతమంది స్త్రీల గుంపులోనున్న ఆడువారిపై కూడా విరులవేసి (పూవులను జల్లి) తన వశము చేసికొంటాడు. వేసరక (విసుగు అనే మాటలేక) పదియారువేలమంది సతుల ఇండ్లలో, సేసవెట్టి (అక్షతలు జల్లి) మరీ వారిని పెండ్లాడినాడు. (ఇందులో పెండ్లాడాలనే కోర్కె ఇంతులదే సుమా!) స్వామికి యేనాడు, యెవరిపైనా, యే కోరికా వుండదు. ఎందుకంటే ఆ దేవదేవుడు నిరంజనుడు, అవునా?

ఈ కొంటె కోణంగి ఇంకా యేమిచేస్తాడో తెలుసా? తనకు గంధము పూస్తున్న పడతులను మెల్లగా సందిటజేర్చి వెల్లవిరిగా (విజృంభించి) కూడి ముచ్చట దీరుస్తాడు. ఇల్లిదే (ఇదే) శ్రీవేంకటాద్రిపై శ్రీ వేంకటేశుడైన ఇతడే నేడు ఈ కోనేటి ఒడ్డున విఠ్ఠలేశుడై యెల్లగా వరాలచ్చీ (అంతులేని వరములనను గ్రహించుచున్నాడు).

సంపుటి: 14 కీర్తన : కొల్లున నవ్వేరు నిన్ను గోవిందుడా
సంఖ్య : 333 పుట : 193 రాగం: మనోహరి

## మనోహరి

10 కొల్లున నవ్వేరు నిన్ను గోవిందుఁడా
గొల్లెతల నేమనేవు గోవిందుఁడా ॥ పల్లవి॥

యేపున నీసుద్దులెల్ల యిట్టె యశోదతోడ
గోపిక లాడుకొనేరు గోవిందుఁడా
తీపుల నీచేఁతలెల్ల తేట తెల్లమాయనిదే
కోపగించఁ జెల్లదిఁక గోవిందుఁడా ॥కొల్లు॥

సిసువవై యాడువారి చీరలు దీసినందుకు
కొసరి తిట్టేరు నిన్ను గోవిందుఁడా
పసులఁగాచేచోట భామలు విందు దెచ్చిరి
కుసిగుంపు సేయకుమీ గోవిందుఁడా ॥కొల్లు॥

వాడలసతుల నొక్కవావిగానే సేసితివి
కోడెల నావులఁ గాచేగోవిందుఁడా
యీడనే శ్రీవేంకటాద్రి నిరవై శ్రీసతితోడఁ
గూడి లోలుఁడ వైతివి గోవిందుఁడా. ॥కొల్లు॥ 333

**అవతారిక:**

"గోవులను కాచే గోవిందుడా! నిన్ను చూచి ఈ రేపల్లె గొల్లభామలు గొల్లుమని నవ్వారయ్యా! వాళ్ళనేమనగలము?" అంటున్నారు అన్నమాచార్యులవారు. నీ కోపాలు యికపై చెల్లేట్లులేవు. మరి నీవు వాళ్ళ చీరెలెత్తికెళ్ళిపోతే మళ్ళీ నిన్నే తిడుతున్నారు, అంటున్నారు. ఈ గోవిందుడు గొల్లవాడలోనున్న సతులనందరినీ ఒక్కవావిగానే చేశాడట. అంటే యేమిటో తెలుసా? ఆ గోవిందుడు, వరుసకు వదినా మరదళ్ళయిన





ఇద్దరిని కూడితే వారు ఏమవుతారు? ఒకేవావి కదా! అంటే అక్కా చెల్లెళ్ళేకదా! అదన్నమాట సంగతి. ఇంతా చేసిన ఆ శ్రీసతిలోలుడేనట.

**భావ వివరణ:**

ఓ గోవిందుడా! ఈ గొల్లెతలను (గొల్లభామలను) యేమనేవు (నీవేమి అనగలవు?) నీసంగతులు చెప్పుకొంటూ వాళ్ళు గొల్లుమని నవ్వుకొంటున్నారు చూశావా?

ఓ గోవిందుడా! నీ సుద్దులెల్లా (ముచ్చట్లనన్నియు) ఈ గోపికలు నీ తల్లి యశోదమ్మతో యేపున (వున్నవీ లేనివీ కల్పించి యెక్కువగా) చెబుతున్నారు. నీ తీపుల చేతలెల్లా (నీవు పెట్టిన యాతనలు చిలిపి పనులు) అన్నియునూ తేటతెల్లమాయె (బట్టబయలైపోయాయి). ఓ గోవిందుడా నీ అలుకలు చెల్లవిక.

ఇంత చిన్న పిల్లగాడివి స్త్రీలు స్నానమాడువేళ వారి చీరలెత్తుకుపోతావా? అందుకనే వారు నిన్ను కొసరి తిట్టేరు (కసురుకొని తిట్టిపోశారు). గోవిందుడా! ఇదేం పనయ్యా! అయినా నీచేతలు వారిని మురిపించినాయేమో కానీ, ఆ భామలు ఇప్పుడు నీవు పశువులు కాచే చోటికి విందు భోజనాలు తీసుకొనివచ్చారు. ఓ గోవిందుడా! ఇంకా వారిని కుసిగుంపు సేయకుమీ. (శ్రమపెట్టవద్దు స్వామీ!)

నీ లీల నెరుంగ మాకు శక్యమా ప్రభూ! ఈ గొల్లవాడలోని సతులనందరినీ రతిదేల్చి, వారిని ఒకేవావితో (ఒకే చుట్టరికపు వరుసతో, సవతులైనందున అక్క చెల్లెలి వరుసతో) కలిపినావు. కోడెలను ఆవులను కాచే గోవిందుడా! గోవర్ధన గిరినెత్తిననాడే నీవు పరమాత్ముడవని వారికి తెలిసిపోయింది. ఓ గోవిందుడా! నేడు ఈ కలియుగంలో శ్రీవేంకటాద్రిపై శ్రీసతితో నిరవై (నెలకొనినవాడవై) ఆమెను కూడి ఆమెకు లోలుడవైతివి (స్వాధీనుడవైతివి).

సంపుటి: 14 కీర్తన : శ్రీ వేంకటేశ్వరుడు శ్రీయలమేల్మంగతోడ
సంఖ్య : 240 పుట : 150 రాగం: సాళంగనాట

## సాళంగనాట

11 శ్రీవేంకటేశ్వరుఁడు శ్రీయలమేల్మంగతోడ
కోవిదుఁడై విహరించీ కోడతిరుణాళ్లు ॥ పల్లవి॥

వెల్లవిరిగా వీధుల వెన్నెలలు గాయఁగా
చల్లని పూవులవాన జడి మించఁగా
వొల్లనే సతులు దన్ను వుగ్గళించి పొగడఁగా
కొల్లలాడీ వలపులు కోడతిరుణాళ్లు ॥శ్రీవేం॥

ఆటల పాటలవాఁడు అండనే వినిపించఁగా
పాటించి యారగింపులు పైపైఁ జేయఁగా
గాఁటముగ వీడెములు గందములు నందుకొంటా
కోటిభోగాలు భోగించీ కోడతిరుణాళ్లు ॥శ్రీవేం॥

చేరి పన్నీరు కప్రము శిరసునఁ గులుకఁగా
వూరక యిందరు కొలువులు సేయఁగా
యీరీతి శ్రీవేంకటేశుఁ డిందరుసతులఁ గూడి
కోరికలు వెదచల్లీ కోడలిరుణాళ్లు. ॥శ్రీవేం॥240

**అవతారిక:**

'కోడతిరుణాళ్ళు' అంటే వసంతోత్సవ అని అర్థం. శ్రీవేంకటేశ్వరుడూ ఆయన దేవేరి అలమేల్మంగ వసంతోత్సవంలో పాలుపంచుకొంటున్నారట. ఆ దృశ్యాన్ని కళ్ళకు కట్టిస్తున్నారు అన్నమాచార్యులవారు. స్వామి వసంతాలు చల్లుటయేకాదు శృంగారవనంలో కోవిదుడై విహరిస్తున్నాడట. అంటే ఆరితేరినవాడై వసంతాలాడుతూ విహరిస్తున్నాడన్నమాట. అసంఖ్యాకమైన సుందరాంగులతో ఆ శ్రీవేంకటేశ్వరుడు కోరికలు వెదచల్లే





కోడతిరునాళ్ళు ఆడుతున్నాడట. 'కప్రము' అంటే కర్పూరము అని అర్థం. పన్నీరు కర్పూరము బాగా కలిపి తలమీద పోసేవారట ఆ రోజుల్లో.

**భావ వివరణ:**

శ్రీవేంకటేశ్వరుడు శృంగారపురుషుడు. తన దేవేరి అలమేల్మంగతో ఆయన కోవిదుడై (ఆరితేరిన నేర్పరివలె) కోడతిరుణాళ్ళు (వసంతోత్సవము) జరుపుకొంటూ విహరించీ (విహరించుచున్నాడు.). ఆ వైనం తిలకించండి.

ఆ తిరువీధులలో వెన్నెల వెల్లివిరిసి కాస్తున్నది. ఎవ్వరూ చల్లకనే పూవులవాన జడి (జల్లు) లాగా కురుస్తున్నది. ఆ వసంతోత్సవంలో పాల్గొంటున్న స్త్రీలందరూ తనను వుగ్గళించి పొగడగా (తన పక్షాన ఉత్తేజ పరుస్తూ పొగుడుతుంటే) ఆ దేవదేవుడు ఆమె వలపులను కొల్లలాడీ (అపహరించాడు). స్వామి కోడతిరుణాళ్ళు అంత చూడ ముచ్చటగా వున్నది.

కొంతమంది అక్కడ ఆడుతున్నారు (నృత్యం చేస్తున్నారు). కొంతమంది మధురంగా గానం ఆలపిస్తున్నారు. వారు అండనే (ఇంటిలోనే) వున్నారు, మరి అంత జోరుగా వసంతాలాడితే ఆలిసిపోయి ఆకలివేస్తుంది కదా! స్వామి అప్పుడు పాటించి (ఆదర పూర్వకంగా కాసేపు విశ్రాంతినిచ్చి) పైపై ఆరగింపులు (తేలికపాటి ఆహారం) తీసికొనినాడు. గాటముగా (అధికముగా) వీడెములు తాంబూలములను స్వీకరించాడు. గంధము పూతలు గ్రహించాడు. కోటి భోగాలు (అసంఖ్యాకమైన భోగములను) భోగించాడు. ఆ వసంతోత్సవం కన్నుల పండువగా వున్నది.

ఆహా!! ఎంత అద్భుతమైన దృశ్యమది!! వారి (స్వామివారు ఆయన దేవేరి) శిరసున (తలలమీద) చేరి (స్త్రీలందరూ కలిసి) పన్నీటిలో కలిపిన కప్రము (కర్పూరమును) గులకగా (కుమ్మరించగా) వీరంతా స్వామివారి కొలువుకూటమిలో చేరారు. ఈ విధంగా శ్రీవేంకటేశ్వరుడు ఇంతమంది సతులగూడి (సుందరాంగులతో కూడి) వసంతాలాడుతుంటే స్వామిపై కోరిక కలుగనిదెవరికి చెప్పండి. ఆ విధంగా ఆ మనోహరుడు కోరికలు వెదచల్లుతుండే కోడతిరుణాళ్లు ఆడుతున్నాడు.

సంపుటి: 14 కీర్తన:సతితోడ సారెసారెకు సరసములాడుకొంటా
సంఖ్య : 376 పుట : 218 రాగం: కాంబోది

**కాంబోది**

12 సతితోడ సారెసారెకు సరసములాడుకొంటా
తతితోడనారగించీ తగునె యీదేవుఁడు ॥ పల్లవి॥

ఒక్కమాటె వంటలెల్లా నొద్దనుండి వడ్డించి
మిక్కిలినలసె నలమేలుమంగ
చెక్కులఁ జెమటగారఁ జేరి యీపె వడ్డించఁగా
చొక్కి చొక్కి యారగించీఁ జూడరె యీదేవుఁడు ॥సతితో॥

పాతి పాతి బంగారుపళ్ళెములు వెట్టించి
మీతి బుసకొట్టె నలమేలుమంగ
జాతిన తురుముతోడఁ జవులాకె యడుగఁగ
ఆఱడి గూరలు మెచ్చీనంతలో నీదేవుఁడు ॥సతితో॥

వాలిన రాజసముతో వంటసాలలోననే
మేలిమిఁ గూచున్న దలమేలుమంగ
యీలోనె శ్రీవేంకటేశుఁడీపెఁ దానునారగించి
తాలమిఁ గాఁగిటఁగూడె దక్కక యీదేవుండు ॥సతితో॥ 376

**అవతారిక:**

అన్నమాచార్యులవారి వొక్కొక్క కీర్తనకు వొక్కొక్క ప్రత్యేకత వుంటుంది. ఇందులో చూడండి తన ముద్దుల సతితో ముచ్చట్లాడుకుంటూ మాటి మాటికీ సరసాలాడుతూ చాలా ఇష్టంగా భోజనం చేస్తున్నాడట ఆ దేవదేవుడు. తన చెక్కిళ్ళపై చెమటలు కారిపోతుంటే, సడలిన తనకొప్పును సవరించుకోలేక అలమేల్మంగమ్మ, తిప్పలు పడుతుంటే ఆహా! ఓహో! అని మెచ్చుకొంటూ ఆరగిస్తున్నాడట స్వామి. ఈలోనే అమ్మవారు కూడా ఆరగించి తాలిమితో





యీదేవుని కౌగిట కరిగిపోయిందట. ధన్యోస్మి. ఏమి ఆ పదకవితాసౌరభం!! ఏమి ఆ కల్పనా చాతుర్యం!! ఏమని పొగడుదునయ్యా! అన్నమయ్యా!

**భావ వివరణ:**

సారెసారెకు (మాటిమాటికీ) సతితోడ (తన భార్యతో) సరసములాడుకొంటూ (చలోక్తులు విసురుతూ) ఈ దేవదేవుడు తగు తతితోడన్ (తగినంత ప్రీతితో) ఆరగించీ (భుజించుచున్నాడు). ఆ వైనం వినండి.

జగముల తల్లి అలమేలుమంగ తను ఆయనకిష్టమని చేయించిన వంటకాలన్నింటిని ఒక్కటీ వదలకుండా వడ్డించింది. అందుచే ఆ తల్లి మిక్కిలి అలిసిపోయినది. ఆమె చెక్కుల జెమట (చెక్కిళ్ళపై శ్రమవలన చెమట) కారిపోతున్నది. ఆమె చేరి స్వయముగా వడ్డించుచునేయున్నది. ఈ దేవుడు చొక్కి చొక్కి (పారవశ్యముతో) ఆరగించుచున్నాడు. ఈ అద్భుత దృశ్యం మీ మనోనేత్రాలతో చూచి తరించండి.

ఈ తల్లి, పాతిపాతి (తడవ తడవకూ) వంటకాలన్నీ బంగారు పళ్ళెరములలో పెట్టించి, అలసటతో మీతి బుసకొట్టీ (పెద్దగా నిట్టూర్చింది) అలమేల్మంగమ్మకు ఆ పరిశ్రమవలన తురుము (సిగకొప్పు) సడలి పోయింది (వదులై విడిపోబోతున్నది). అయినా ఆమె కొప్పు సవరించుకొంటూనే, చవులడుగగా (వంటలెలావున్నాయండీ... అని అడుగుతుంటే) ఈ దేవుడు ఆఱడి (మించి) అంతలో (పూర్తిగా తినకుండానే) కూరలు మెచ్చీ (కూరలు యెంత బాగున్నాయి. ఆహా!! యేమి రుచి అని మెచ్చుకొన్నాడు).

ఆ తల్లి అటుపిమ్మట, వాలిన రాజసముతో (మిక్కిలి అతిశయించిన రాచఠీవితో) మేలిమి వంటసాలలో (స్వర్ణమయమైన ఆ వంటశాలోనే) తానూ భుజించుటకు కూర్చున్నది. ఈలోనె (ఈరీతిగా) శ్రీవేంకటేశ్వరుడు మరియు అలమేల్మంగ, ఆరగించిరి. ఆపై, తక్కక (తప్పకుండా) ఈ దేవదేవుడు తాలిమి (ఉత్సాహముతో) ఆ దేవిని కౌగిట కూడెన్.

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం

సంపుటి: 4 కీర్తన : వారిధిశయన వో వటపత్రపరియంక
సంఖ్య : 465 పుట : 314 రాగం: దేవగాంధారి

## దేవగాంధారి

13 వారిధిశయన వో వటపత్రపరియంక
గారవాన మేలుకొని కన్నులు దెరవవే ॥ పల్లవి॥

ఘనయోగిహృదయపుకమలాలు వికసించె
వొనర విజ్ఞానసూర్యోదయమాయ
మును జీవపరమాత్మములజక్కవలు గూసె
వనజాక్ష మేలుకొని వాకిలి దెరవవే ॥వారిధి॥

కలుషములనేటిచీఁకట్లెల్లఁ బెడఁబాసె
నలువంక వేదకీరనాదము మ్రోసె
అలరి యితరధర్మాలనేటిచుక్కలు మాసె
జలజాక్ష మేలుకొని సతిమోము చూడవే ॥వారిధి॥

కపటరాక్షసనేత్రకలుహారములు మోడ్చె
యిపుడే సుకర్మముల యెండలు గాసె
అపురూప శ్రీవేంకటాద్రీశ మేలుకొని
నిపుణుఁడ యిందిరయు నీవు మమ్ముఁ గానవే ॥వారిధి॥465

**అవతారిక:**

"వటపత్రపరియంక" అంటే మఱ్ఱియాకు తల్పముగా శయనించువాడని అర్థం. జక్కువలు అంటే చక్రవాక పక్షులు. కల్హారము అంటే తెలుపు రంగు మిళితమైన ఎఱ్ఱనికలువపూవు. తేలిక అని భ్రమ కలిగించే క్లిష్టమైన కీర్తన ఇది. వటపత్రశాయియైన జలధిశయన ఆదినారాయణునిపై అన్నమాచార్యులవారు చెప్పిన అద్భుతమైన కీర్తన ఇది. ఆయన యోగీశ్వరుల హృదయకమలాలలో వుంటాడు.



అంతయు నీవే హరిపుండరీకాక్ష

అన్య మతధర్మములను నక్షత్రాలు మాసిపోవునట్లు చేసే పూర్వోదయం అవుతుంది ఈయన నిదుర మేలుకొంటే. కపటులైన రాక్షసుల కన్నులనే కల్హారములు మ్రోడువారిపోతాయట. అంటే రాక్షసులు నశిస్తారని అర్థం.

**భావ వివరణ:**

ఓ వటపత్రపరియంకా! (మఱ్ఱియాకు శయ్యగా పరుండిన వాడా!) వారిధిశయనా! (క్షీరసాగరముపై శయనించు దేవా!) గారవాన (మంగళప్రదుడవై) మేలుకొని కన్నులు తెరవవయ్యా!

ఓ ప్రభూ! నిన్ను జూచి ఘనులైన యోగేశ్వరుల హృదయ కమలములు వికసించినవి, యెందుకంటే వారిలో నిన్ను గూర్చిన విజ్ఞాన సూర్యోదయమైనది కదా! ఆ విజ్ఞాన సూర్యోదయమున జీవాత్మ పరమాత్మ అనే జక్కువలు (చక్రవాక పక్షులజంట) ఆనందముగ కూసినవి. (అంటే ఆ జంట నిజానికి తామొక్కటే అని కూస్తూన్నాయి అని భావము). ఓ వనజాక్షా! (పద్మనయనా!) నీ వైకుంఠద్వారపు వాకిలి తలుపులు తెరిపించి నిదురమేలుకొనవయ్యా!

ఓ జలజాక్షా! నీవు మేలుకొంటే దుర్మార్గము అనే చీకట్లన్నీ తొలగిపోతాయి నలుదెసలా చతుర్వేదములనెడి కీరములు (చిలుకలు) నాదముతో రవళిస్తాయి. ఈ లోకంలోవున్న వేద-విహిత ధర్మములన్నియు నింగిలోని చుక్కలవలె (నక్షత్రముల తీరుగా) అదృశ్యమవుతాయి. ఓ దేవా! నిదురమేల్కొని ఒకపరి నీసతి మోమును పరికించుము.

ఓ దేవదేవా! నీవు మేలుకొంటే, కపటులైన రాక్షసుల నేత్రకలుహారములు (కన్నులనే లేత ఎఱుపురంగు కలువపూలు) మోడ్చె (ముడుచుకుపోతాయి). సుకర్మములు (వేదయుక్తమైన పనులు) అనే ఎండలుకాస్తాయి. అపురూపుడవైన శ్రీవేంకటేశ్వరా! నీవు నిదుర మేల్కొని ఇందిరాదేవితో కూడి నిపుణుడవై మమ్ము రక్షించి పరిపాలింపుము తండ్రీ!

సంపుటి: 4 కీర్తన: వైష్ణవులసొమ్ము నేను వారు నీసొమ్ములింతే
సంఖ్య : 185 పుట : 124 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

14 వైష్ణవులసొమ్ము నేను వారు నాసొమ్ములింతే
విష్ణుఁడ నీవెట్టైన వివరించుకోవయ్యా ॥ పల్లవి॥

నెఱి నీబంటనా హరి నీకంటె బలువులైన-
తఱి నీదాసులకే నే దాసుఁడగాక
గుఱుతెరుఁగుదునా నేఁ గోరి యింతకతొల్లి
గుఱుతు చూపిన మాగురువునేకాక ॥వైష్ణ॥

ముంచి నీకు మొక్కేఁగాక ముందే నీశరణులు
పెంచి పాదాలు నా నెత్తిఁబెట్టిరయ్య
పొంచి నీవేడ నేనేడ బుజముల ముద్రవెట్టి
సంచితమై సేసినట్టిసంబంధమేకాక ॥వైష్ణ॥

శ్రీవేంకటేశ నీసేవే సేసేఁగాక నేడీ-
సేవకుఁ దెచ్చెను వారిసేవేకాదా
భావమొక్కటిగా నాకుఁ బట్టిచ్చిరి నిన్ను వారు
ఆవలీవలికిఁ బరమార్థమేకాక ॥వైష్ణ॥ 185

**అవతారిక:**

విశిష్టాద్వైత మత దీక్ష స్వీకరించిన అన్నమాచార్యులవారు, బుజములపై శంఖచక్రముల ముద్రలు ధరించారు. తిరునామం నుదుటిపై ధరించారు. వైష్ణవ సిద్ధాంత ప్రచారకులై రోజుకి, కనీసం ఒక్క కీర్తన శ్రీవేంకటేశ్వరునిపై చెప్పారు. ఈ నాటికీ నాబోటి అనామకులను సైతం ఆ నామం అనుమానం లేకుండా రక్షిస్తున్నది. ఎందుకంటే.. వైష్ణవులంతా స్వామివారి సొమ్ము. అందుకే అన్నమయ్య "ఓ విష్ణుడా! నీవు యెట్లా అన్వయించుకొనినా





పర్వాలేదు, నేను వైష్ణవుల సొత్తును. వారు నీసొత్తు" అని తేల్చిపారేశారు. స్వామీ! నిన్ను నాకు ఆ వైష్ణవులు పట్టిచ్చారయ్యా! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ విష్ణుదేవా! నేను వైష్ణవదీక్షను స్వీకరించినందున వైష్ణవుల సొమ్మునైతిని. మరి ఆ వైష్ణవులు నీసొమ్ము. అనగా నీదాసులైన వైష్ణవులకు నేను దాసుడను. ఆ విధంగా నేను నీకు చెందినవాడినే. దీనిని నీవెట్లు వివరించుకొనినా నీఇష్టమే.

ఓ హరీ! నెఱి (న్యాయంగా) నీబంటునయ్యేవాడినే కాని, నీదాసులువున్నారే వారికి వారి బలంతోపాటు నీ బలంకూడా తోడవటం వల్ల, వారు నీకంటే బలవంతులు. అటువంటప్పుడు నాకెప్పుడూ యెదురుగా వుండేవారి దాస్యం చేయుట నాకు మంచిది కదా! నేను ఇంతకు పూర్వం నిన్నెరుగను. తొల్లి (మొట్టమొదట) మా గురువులే నీ గుర్తులు చూపించితే నిన్ను గుర్తుపట్టగలిగాను. లేకపోతే నీవెవవరవో నాకేమి తెలుసు?

ఓ విష్ణుదేవా! నేను వేరే నీకు మొక్కవలసిన పనిలేదు. ఎందుకంటే, ఇంతకు ముందే నీశరణము పొందిన మా గురువులు నీపాదాలను మానెత్తినయెప్పుడో పెట్టేశారయ్యా! మాకు వైష్ణవ దీక్షనిచ్చింది అట్లాగే కదా! ఆ దీక్షే లేకపోతే నీవు యెక్కడ మేము యెక్కడ? మా రెండు భుజముల మీద నీ శంఖ చక్రముల ముద్రలు వేశారు. మాగురువులావిధంగా మన సంబంధాన్ని సంచితము చేశారు (కూడబెట్టారు) గానీ (లేకపోతే) నీవు నాకెట్లు తెలిసేవాడివి?

ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ నాడు నేను నీసేవచేస్తున్నమాట నిజమే. కానీ నేను మొదట వారిని సేవించినందువల్లనే, నేను నిన్ను సేవించటం అన్నది జరిగింది. నాకు వారు భావమొక్కటిగా (అన్యథా శరణం నాస్తి అను ఒకే ఒక భావనతో) నిన్ను నాకు మాగురువులు పట్టిచ్చారు. అందువల్లనే మాకు ఆవలీవల పరమార్థము (ఇహపరములు రెండిటి పరమార్థము దక్కినది). కాక నేను నిన్నెట్లెరుంగుదునయ్యా!

సంపుటి: 4 కీర్తన : తిమ్మిరెడ్డి మాకునిచ్చె దిష్టమైన పొలము
సంఖ్య : 52 పుట : 35 రాగం: సామంతం

## సామంతం

15 తిమ్మిరెడ్డి మాకునిచ్చె దిష్టమైనపొలము
బొమ్మిరెడ్డి కప్పగించి పోదిసేసెఁ బొలము ॥ పల్లవి॥

నిండినట్టిమడుగులనీరువంకపొలము
కొండలు మోఁచినపెద్దగొబ్బరపుఁబొలము
అండనే పొలమురాజులుండేటిపొలము
చెండివేసి మాకులెల్లా సెలగినపొలము ॥తిమ్మి॥

ఆసపడి వరదానమడిగినపొలము
బాసలతోఁ గడు నెత్రుపట్టమైనపొలము
రాసికెక్కె మునులకు రచ్చైనపొలము
వేసరక నాఁగేట వేగిలైన పొలము ॥తిమ్మి॥

మంచి గురుతైన రావిమానిచేనిపొలము
వంచిన గుఱ్ఱముఁ దోలే వయ్యాళిపొలము
యెంచఁగ శ్రీవేంకటేశు నిరవైనపొలము
పంచుకొని లోకులెల్లా బ్రదికేటిపొలము ॥తిమ్మి॥52

**అవతారిక:**

ఇది అత్యద్భుతమైన దశావతారవర్ణన కీర్తించే అన్నమాచార్య కీర్తన. ఎంతో మేధాశక్తి వుంటేనే కాని ఈ కీర్తన అర్థంకాదు. తిమ్మన్న అంటే వేంకటేశ్వరుడు తిమ్మిరెడ్డి అంటే పరమాత్మ అయిన శ్రీవేంకటేశ్వరుడు. బొమ్మిరెడ్డి అంటే జీవాత్మయైన అంతర్యామి అంటే క్షేత్రజ్ఞుడు. దిష్టమైన పొలము అంటే (భాగ్యముకొద్దీ సంప్రాప్తించిన సాగుచేయదగిన మాగాణి వంటి క్షేత్రము లేక శరీరము). మా భాగ్యము కొద్దీ ఆ శ్రీవేంకటేశ్వరుడు మాకు ఈ దేహాన్నిచ్చి మాజీవాత్మకు ఒప్పగించి "వారే దీనిని సక్రమంగా సాగుచేసుకోండిరా" అన్నాడు... ఇదీ ఈ కీర్తన పల్లవి. ఇకపై ఓపికగా చదివి భావ వివరణ నాస్వాదించండి.





**భావ వివరణ:**

తిమ్మిరెడ్డి (పరమాత్మ) మాకు దిష్టమైన (మా భాగ్యముననుసరించి) ఒక పొలము (క్షేత్రము) సాగుచేసికొనమని, బొమ్మిరెడ్డికి (అంతర్యామియైన క్షేత్రజ్ఞునికి) ఒప్పగించినాడు. ఇక చూసుకోండి ఎన్నిరకాల పొలములు సాగులోకి వచ్చాయో.

"నిండినట్టి మడుగుల నీరువంక పొలము" – ఎప్పుడూ నిండుగా నీరువుండే చోట నీట్లో వుండేదేహము.. (అంటే మత్స్యావతారము.) "కొండలు మోచిన పెద్దగొబ్బరపు పొలము" నిస్వార్థముగా పరులకోసం పెద్ద కొండను మోసిన దేహం... (అంటే తాబేలు లేక కూర్మావతారం.) "అండనే పొలము రాజులు వుండేటి పొలము" సూకరములుండే దేహము– (అంటే వరాహావతారము). "చెండివేసి మాకులెల్లా చెలగిన పొలము". మాలిన్యమును లేక పాపమును చెండాడి విజృంభించిన దేహము – (అంటే నరసింహావతారము).

"ఆస పడి వరదానము అడిగిన పొలము" యాచించి వరమును పొందిన దేహము – (అంటే వామనావతారము). "బాసలతో కడునెత్రుపట్టమైన పొలము" ప్రతిజ్ఞ పట్టి ఎంతో నెత్తురు పారించిన దేహము – (అంటే పరశురాముడు). "మునులకు రచ్చై రాసికెక్కిన పొలము" మునులకు రక్షణయై విఖ్యాతిగాంచిన దేహము – (అంటే శ్రీరామావతారము). "వేసరక నాగేట వేగిలైన పొలము" విసుగులేక నాగలి ధరించు ఉద్రేకియైన దేహము – (అంటే బలరామావతారము).

"మంచి గురుతైన రావిమాని చేని పొలము" అశ్వత్థవృక్షం క్రింద మంచి ప్రసిద్ధినొందిన దేహము – (అంటే బుద్ధావతారము). "వంచిన గుఱ్ఱము దోలే వయ్యాళిపొలము" అణుకువ గలిగిన గుఱ్ఱమునెక్కి విహారముచేసిన దేహము – (అంటే కల్కి అవతారము). "యెంచగ శ్రీవేంకటేశు నిరవైన పొలము" ప్రసిద్ధికెక్కిన శ్రీవేంకటేశ్వరుడై నెలకొనిన దేహము. మరి ఆ అద్భుతమైన పొలము యెట్లాంటిదంటే లోకులందరూ దానిని పంచుకొని, శరణని బ్రతుకుతున్నారు. అవును కదా!

సంపుటి: 4 కీర్తన : అంజినీదేవి కొడుకు హనుమంతుడు

సంఖ్య : 272 పుట : 182 రాగం: మాళవి

**మాళవి**

16 అంజినీదేవికొడుకు హనుమంతుఁడు
సంజీవినిదెచ్చినాఁడు సారె హనుమంతుఁడు ॥ పల్లవి॥

కలశాపురముకాడ కదలీవనాల నీఁడ
అలవాఁడె వున్నవాఁడు హనుమంతుఁడు
అలరుఁ గొండలకోనలందలిగుహలలోన
కొలువు సేయించుకొనీఁ గోరి హనుమంతుఁడు ॥అంజి॥

పసలుగా జంగవెట్టి పండ్లగుత్తి చేతఁబట్టి
అసురలనెల్లఁ గొట్టీ హనుమంతుఁడు
వసుధఁ బ్రతాపించి వడిఁ దోఁక గదలించి
దెసలెల్లాఁ బాలించీ దివ్యహనుమంతుఁడు ॥అంజి॥

వుద్దవిడి లంకచొచ్చి వుంగరము సీతకిచ్చి
అద్దివో రాము మెప్పించె హనుమంతుఁడు
అద్దుక శ్రీవేంకటేశు కటుబంటై వరమిచ్చి
కొద్ది మీర సంతోసాలే గుప్పీ హనుమంతుఁడు ॥అంజి॥272

**అవతారిక:**

కలశాపురంలో వెలసిన హనుమంతునిపైచక్కటి కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. అంజినీదేవి కుమారుడైన ఈ రామబంటు సారెగా సంజీవని పర్వతం తీసికొని వచ్చాడు, అంటున్నారు. సారెగా అంటే పెట్టుబడిగా అని అర్థం చెప్పుకోవాలి. ఉద్ద విడి అంటే చాలా గొప్పగా అని భావించవచ్చును. ఈయన ఆయుధం ఏమిటో తెలుసా? 'పండ్లగుత్తి' అంటే ముళ్ళలాంటి పొలుసులున్న గద అన్నమాట. ఆయనతోక కదులుతున్నట్లు భావించగలిగిన ఈ పదకవితాపితామహుడు నిజంగా ధన్యజీవి





**భావ వివరణ:**

ఓ ప్రజలారా! అంజినీదేవి కుమారుడైన ఈ హనుమంతుడు, రామలక్ష్మణులను రక్షించుటకు సారెగా (పెట్టుబడిగా.. లేక... అర్పణగా) సంజీవినీ పర్వతము తీసికొని వచ్చినాడు.

అల (అదిగో) కలశాపురం అనే ఈ వూరిలో కదలీవనాల నీడ (అరటి తోటల చల్లని నీడలలో) వున్న వాడే హనుమంతుడు. ఈ మహానుభావుడు యెక్కడో కొండల కోనలలో వున్న గుహలో వెలసి, కోరి తన భక్తుల ద్వారా కొలువు చేయించుకొనినాడు. ఈ హనుమంతుడు ఈ రీతిని అలరుచున్నాడు.

పసలుగా (మృదువుగా) జంగవెట్టి (కాళ్ళఅంగజాచి), పండ్లగుత్తి (ముళ్ళవంటి పండ్లు వున్న గదను) చేతిలో పట్టుకొని రాక్షసులనందరినీ ఈ హనుమంతుడు చావబాదినాడు. దివ్యత్వముగల ఈ హనుమంతుడు, ప్రతాపించి (ప్రతాపమును చూపి) తనతోకను వడిన్ కదలించి (వేగముగా వూపి) పాలించీ, దెసలెల్లా (దిక్కులన్నీ ఏలుచున్నాడు).

ఆనాడు త్రేతాయుగంలో ఈయన యేమి చేశాడో తెలుసా? వుద్దవిడి (చాలా గొప్పగా) లంకలోకి చొచ్చి (దూరి) శ్రీరామముద్రికయైన వుంగరమును సీతాదేవికిచ్చి అద్దివో (అదిగో) ఆయన శ్రీరామచంద్రుని మెప్పించినాడు. ఈనాడు కలియుగంలో, అటు (ఆ తిరుమల శిఖరాలపై) శ్రీవేంకటేశ్వరునకు బంటై తన భక్తులకు వరమిచ్చి కొద్దిమీర (అశేషముగా) సంతోషములను గుప్పించుచున్నాడు. ఈ స్వామిని సేవించి తరించండి.

సంపుటి: 4 కీర్తన : అప్పడైన హరియెక్కె నదివో తేరు
సంఖ్య : 35 పుట : 24 రాగం: పాడి

## పాడి

17 అప్పఁడైనహరి యెక్కె నదివో తేరు
యిప్పుడు తిరువీధుల నేఁగీ తేరు ॥ పల్లవి॥

సముద్రాలమీఁదఁ దోలె సర్వేశ్వరుఁడు తేరు
భ్రమయ జరాసంధుపై ఁ బరపెఁ దేరు
తిమురుచు రుక్మకుపై ఁ దిరుగఁ దోలెఁ దేరు
ప్రమదాన సృగాలునిపై ఁ దోలెఁ దేరు ॥అప్పఁ॥

కమ్మి యక్రూరుఁడు దేఁగా కంసునిపై నెక్కెఁ దేరు
బమ్మరపో దంతవక్త్రుపైఁ దోలెఁ దేరు
దుమ్ములుగా సాల్వునిపై దొడ్డగాఁ దోలినతేరు
దొమ్మి రుక్మిణిపెండ్లికిఁ దోలినట్టితేరు ॥అప్పఁ॥

మీఱి హంసడిచికులమీఁదఁ దోలినట్టితేరు
తూఱి సంధిమాటలకుఁ దోలినతేరు
ఆఱడి శ్రీవేంకటేశుఁ డలమేలుమంగఁ గూడి
చూఱలుగొన నెక్కెను శోభనపుతేరు ॥అప్పఁ॥35

**అవతారిక:**

శ్రీవేంకటేశ్వరుని తేరు (రథము) తిరుమల తిరువీధులగుండా వూరేగిపోతున్నది. పరవశించిన అన్నమాచార్యులవారు ఆ హరి యేయే సందర్భాలలో నాలుగు అశ్వముల పూన్చి తను తోలే రథమునేకాక పరులు తోలే రథములను కూడా యెప్పుడెక్కాడో పునశ్చరణ చేసికొంటున్నారు ఈ కీర్తన ద్వారా. పురాణవాఙ్మయము బాగాపరిచయంవుంటేకాని ఈ ప్రయత్నం సిద్ధించదు. సృగాలుడు అనేవాడు నక్క రూపంలోవుండే రాక్షసుడు (నరకాసురుడేమో!!) ఇవన్నీ అటువంచి "హంసడిచికుల మీదన్ తోలినట్టితేరు" అన్న చరణంలో నాకేమీ పాలుపోలేదు. స్వామి తనశత్రువుపై యుద్ధానికి రథంపై వెళ్ళాడని తెలుస్తూనే





వున్నది. హంస అంటే శివుడు లేక విష్ణుడు. ఆయనపై ఆయనే యుద్ధానికి వెళ్ళడు కదా! కాబట్టి ఆ మాటకు అర్థం శివభక్తుడైన బాణాసురుడని భావించాను. ఇక చదవండి. నేనూ బ్రహ్మోత్సవాలలోనే దీన్ని వివరిస్తున్నాను.

**భావ వివరణ:**

అదిగో ఈ విశ్వమునకంతటికీ అప్పడు (తండ్రి) అయిన శ్రీహరి, తేరు యెక్కెను (రథము) పైయెక్కినాడు. ఇప్పుడు ఈ తిరుమల తిరువీధులలో ఈ రథము పోతున్నది. కనుల పండువుగా చూచి తరించండి.

ఒకప్పుడు ఈ సర్వేశ్వరుడు తన తేరును సముద్రాలమీద తోలినాడు. (అర్జునునికి తన ఆదినారాయణుని రూపం చూపాలని తన రథముపై శ్రీకృష్ణుడు వైకుంఠం తీసికొని వెళ్ళాడు). జరాసంధుడు భ్రమించి మతిపోగొట్టుకునేట్లు రథం తోలాడీయన. (వాడి అక్షౌహిణీ సైన్యమూ నశించేది). తిమురుచు (ఉద్రేకముతో) రుక్మకుపై (రుక్మిపై) తిరగబడితోలిన రథము ఇదే (రుక్మిణీ స్వయంవరంలో). ప్రమదాన (సంతోషముతో) సృగాలునిపై (నక్కరూపంలో వున్నరాక్షసునిపై) తోలిన రథము ఇదే (బహుశా నరకాసురుడు అయివుండవచ్చు).

అక్రూరుడు తీసికొనిరాగా కమ్మి (విజృంభించి) కంసునిపై దండెత్తిన తేరు ఇదే, (ఈ రథముపైననే అక్రూరునికి శ్రీకృష్ణుడు భగవంతుడని అర్థమైంది). దంతవక్త్రుడు భ్రమచెంది నిస్తేజుడగునట్లు శ్రీకృష్ణుడు తోలిన రథము ఇదే, (శ్రీహరిద్వారపాలకుడైన విజయుడే వీడై పుట్టాడు). ఈ రథముపైననే శ్రీకృష్ణుడు దుమ్మురేగునట్లు సాల్వునితో యుద్ధం చేశాడు. (అంబను కాదన్నదీ సాల్వుడే). రుక్మిణీకళ్యాణము సందర్భంగా రుక్మిణితోలిన రథం ఇదే, (శ్రీకృష్ణుడు శిశుపాలుని చిత్తుచేశాడీ రథంపైనుండే)

మీఱి (విజృంభించి) శివుడు రక్షణగా వచ్చిన బాణుని శ్రీకృష్ణుడు ఓడించినదీ రథముపైననే (ఉషాపరిణయం దీని తరువాతనే జరిగింది). సంధిమాటలు తూఱి (విఫలమై) భారతయుద్ధం జరిగినప్పుడు శ్రీకృష్ణపరమాత్మ, పార్థసారథియైనదీ రథముపైననే (భగవద్గీతకు వేదిక ఈ రథమే). నేడు శ్రీవేంకటేశ్వరుడు, అలమేల్మంగను ఆరడిన్ (మించి) కూడ, చూఱలుగొని (ఆదరణపొంది) ఎక్కిన శోభనపు తేరు (కళ్యాణప్రదమైన రథము) ఇదే. (చూచి తరించండి).

సంపుటి: 4 కీర్తన : అడియ నడియనయ్య యఖిలలోకైకనాథ
సంఖ్య : 416 పుట : 279 రాగం: బౌళి

**బౌళి**

18 అడియ నడియనయ్య యఖిలలోకైకనాథ
తడతాఁకులతాపత్రయము మానుపుటకు ॥ పల్లవి॥

శరణు శరణు వోసర్వేశ్వర నీకు
మరణభయములెల్ల మానుపుటకొఱకు
మొరయొ మొరయొ నీకు ముకుంద మాధవ
దురితములన్నియుఁ దొలఁగించుటకు ॥అడియ॥

దండము దండము నీకు దైవశిఖామణి
పండియుఁ బండని మతి పాకముసేయు కొరకు
అండనే దాస్యము దాస్యము నీకు నేనైతి
నిండు నీకరుణ నాపై నించేటి కొరకు ॥అడియ॥

అభయ మభయము శ్రీయాదినారాయణ
వుభయకర్మము నాకు నూడుచుట కొరకు
విభుఁడ శ్రీవేంకటేశ వినుతిసేసెద నిన్ను
శుభములన్నియు మాకుఁ జూపేటి కొరకు ॥అడియ॥416

**అవతారిక:**

అద్భుతమైన శరణాగతి వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. అడియను అడియను అయ్యా! అంటే నీదాసాను దాసుణ్ణి ప్రభూ! అని అర్థం. ఈ లోకంలో మూడు విధములైన తాపత్రయములు జీవిని బాధిస్తున్నవి. అవే అధ్యాత్మికము, ఆధిభౌతికము మరియు ఆధిదైవికము. ఇవి తడతాకుతుంటాయి... అంటే తత్తరపడేట్లు చేస్తాయి. ఓ అఖిలలోక నాయకా! శరణు దండము దండము, అభయం అభయం అని వేడుకొంటున్నారు. మరి ఆ శ్రీవేంకటేశ్వరుడు అనుగ్రహిస్తే అన్నీ శుభములే కదా!





**భావ వివరణ:**

ఓ అఖిలలోకైక నాథా! (లోకములన్నింటికీ ఒకే ఒక నాయకుడవైన శ్రీహరీ!) నేనునీ, అడియను అడియను అయ్యా! (దాసానుదాసుడను తండ్రీ!) నాకు తడతాకులు (తత్తరపాటు) కలిగించే తాపత్రయములను మాన్పుటకు నీకు మ్రొక్కెదను.

ఓ సర్వేశ్వరా! నిన్ను శరణుచొచ్చెదను. నా మరణభయముల నెల్ల (నశింపజేయు శంకలనన్నీ) మాన్పుటకు శరణు వేడెదను. ఓ ముకుందా! మాధవా! నా దురితములన్నింటినీ (పాపములన్నీ) తొలగించుటకు మొరపెట్టుచున్నాను.

ఓ దైవశిఖామణీ! (దేవతలందరిలో తలమానికమైన స్వామీ!) పండియుపండని నామతి (పరిపక్వము అయిందీ అనలేము, పరిపక్వము కానిదీ అనలేము - అట్టి నా మనస్సును) పాకముసేయుట కొరకు (పరిపక్వత నొందించుటకు) దండము దండము (అనేక నమస్కారములు), అండనే (నిన్నాశ్రయించి) నీకు దాస్యము చేయువాడనైతిని. నీ కరుణ నాపై నింపి నన్ను అనుగ్రహించుటకు నీదాసుడనైతినయ్యా!

ఓ శ్రీ ఆదినారాయణా! నా ఉభయ కర్మములను (సంచిత కర్మలు ప్రారబ్ధ కర్మలు అనే రెండు రకముల కర్మలను) వూడుచుటకు (తొలగిపోవునట్లు చేయుటకు) నీ అభయమును వేడెదను. నాకు అభయమునిమ్ము. ఓ శ్రీవేంకటపతీ! నిన్ను వినుతి చేసెదనయ్యా! (ప్రార్థించెదను ప్రభూ!) మాకు శుభములన్నింటినీ చూపుటకు నిన్ను యెల్లవేళలా ప్రార్థించెదను తండ్రీ!

సంపుటి: 3 కీర్తన : చేకొని కొలువరో శ్రీనరసింహము
సంఖ్య : 567 పుట : 381 రాగం: సాళంగనాట

## సాళంగనాట

19 చేకొని కొలువరో శ్రీనరసింహము
శ్రీకరమగు నిదె శ్రీనరసింహము ॥ పల్లవి॥

వెడలేటివూర్పుల వేఁడిమి చల్లీ
చిడుముడికోపపు శ్రీనరసింహము
గడగడవడఁకేటిగండస్థలములు
జెడలు గదలిచీ శ్రీనరసింహము ॥చేకొ॥

వంకరగోళ్లవైపులు వెదకీ
చింకచూపులను శ్రీనరసింహము
హుంకారంబుల నుదధులు గలఁచీ-
నంకెల శ్రీపతియగు నరసింహము ॥చేకొ॥

వదనము దిప్పుచు వడి నసురమేను
చిద్రుపలు చేసెను శ్రీనరసింహము
అదివో శ్రీవేంకటాద్రి యెక్కి యిటు
చెదరక నిలిచెను శ్రీనరసింహము, ॥చేకొ॥567

**అవతారిక:**

అన్నమాచార్యులవారికి భజన అంటే ప్రత్యేకమైన ప్రీతి అని నా నమ్మకం. ఉగ్రనరసింహునిపై వారు చెప్పిన ఈ భజన మీ మనస్సులను ప్రక్షాళన చేస్తుంది. నిశితమైన వర్ణన అంటే (మైన్యూట్ డిస్క్రిప్షన్) అది యెలావుంటుందో ఇది వింటే తెలుస్తుంది. తన ప్రియభక్తుడైన ప్రహ్లాదుని చిత్రహింసలు పెట్టి ఈ స్తంభములో వాడిని (శ్రీహరిని) చూపించకపోతే స్వయంగా, తనే ప్రహ్లాదుని చంపేస్తానన్నాడు హిరణ్యకశిపుడు. ఆవేశం





కట్టలు తెంచుకొని, పగిలిన స్తంభంలోంచి వెడలివచ్చిన ఆ శ్రీనరసింహుడు యెలావున్నాడయ్యా! అంటే... "శరణు శరణు సురేంద్ర సన్నుత శరణు) శ్రీసతివల్లభా"! అని ప్రార్థించండి.

**భావ వివరణ:**

ఓ భక్తులారా! ఇదే శ్రీనరసింహము. ఈ దేవదేవుని చేకొని (పూనుకొని) కొలువరే (మ్రొక్కి సేవించండి). ఈ నరసింహము మనకు శ్రీకరుడు (శు భములనొసగు మహానుభావుడు).

ఈ శ్రీనరసింహము చిడుముడికోపమువాడు (తొట్రుపాటు కలుగజేసే కోపధారి). చూడండి తన కోపము చేత వెడలేటివూర్పుల (బయల్వెడలు ఉచ్ఛ్వాస నిస్వాసములతో) వేడిసెగల నెట్లా వెదజల్లుతున్నాడో గమనించండి. ఆయన గండస్థలము (రెండు చెక్కిళ్ళూ) ఉద్రేకంతో గడగడమని వణుకుతున్నాయి. అందుచేత ఈ శ్రీనరసింహము యొక్క జడలు (జూలు) పైకి క్రిందికి కదలుచున్నది.

ఈ శ్రీనరసింహము వంకరలు తిరిగిన పంజాగోళ్ళతో వాటివైపు చూసుకొంటూ (రక్తం అంటినదోలేదోనని) చింక చూపులు (భీతహరిణేక్షణములతో) చూస్తున్నాడు. ఈ శ్రీనరసింహము యొక్క హూంకారమునకు, వుదధులు (సాగరములు అన్నియును) కలచీ (కల్లోలమైపోతున్నాయి.) ఈ స్వామి అంకెల శ్రీపతి (తన ప్రియసతి శ్రీలక్ష్మిని తన తొడపైననే కూర్చుండబెట్టిన శ్రీనాథుడు.

ఈస్వామి తనతొడపైనున్న హిరణ్యకశిపుని మేను (శరీరాన్ని) తన వదనము వడి తిప్పుచూ (తన మొగమును వేగంగా అటూ ఇటూ కదలించుచూ) చిద్రుపలు చేసెను. (చిన్న చిన్న ఖండములుగా చేసినాడు). ఇంత ఘోర భీభత్సం చేసిన ఈ శ్రీనరసింహము చెదరక (ఏమాత్రమూ చలించక) అదివో శ్రీవేంకటాద్రినెక్కి యిటు (ఈవిధముగా) శ్రీవేంకటేశ్వరుడై నిలిచియుండి, మనబోంట్లను అనుగ్రహిస్తున్నాడు.

సంపుటి: 3 కీర్తన: రామకృష్ణ నీవు నందే రాజ్యమేలుచుండుదువు
సంఖ్య : 432 పుట : 291 రాగం: లలిత

**లలిత**

20 రామకృష్ణ నీవు నందే రాజ్య మేలుచుండుదువు
యేమిసేసే విక్కడ నీ యిరవుకే పదవే ॥ పల్లవి॥

లంక విభీషణు నుంచ లక్ష్మణుని నంపినట్టు
అంకె సుగ్రీవుఁ గిష్కింధ కంపినయట్టు
వంకకు సంజీవి దేను వాయుజుని నంపినట్టు
వేంకటాద్రిపొంతనుండ వేగ మమ్ము నంపవే ॥రామ॥

ఘనకిరీటము దేను గరుడని నంపినట్టు
అనుఁగుఁగపుల నిండ్ల కంపినట్టు
వొనర గోపికలొద్ది కుద్ధవుని నంపినట్టు
నునుపు శేషాద్రినుండ నన్ను నంపవే. ॥రామ॥

పెండిలికిఁ బరుషలఁ బిలువఁగ నంపినట్టు
అండనే ముందరఁ గంత కంపినయట్టు
వెండియు శ్రీవేంకటేశ వేఁట వచ్చి మరలితి-
వుండ(డు?) చోటనుండి నన్ను వూడిగాన కంపవే. ॥రామ॥432

**అవతారిక:**

ఓ శ్రీరామా! శ్రీకృష్ణా! నీవూ నీవు అక్కడ క్షేమంగా ప్రజలనేలుకోండయ్యా! ఇక్కడ ఈ కలియుగంలో మీరేం చేస్తారు? మీ మీ చోట్లకి (అయోధ్యకీ ద్వారకకీ) పదవే... అని చమత్కరిస్తున్నారు అన్నమయ్య. మీరు అక్కడకు పోయి, నన్ను మాత్రం వేంకటాద్రికీ, శేషాద్రికీ శ్రీవేంకటేశ్వరుని వూడిగం చేయమని కాస్త అనుగ్రహంతో పంపండయ్యా! విభీషణుణ్ణి, సుగ్రీవునీ, హనుమంతుని, గరుత్మంతుని,





ఉద్ధవుని, వానరసేనను యెక్కడికెక్కడికో పంపారు కదా! అట్లాగే నన్నూ తిరుమలలో వుండరా అని పంపించండి అంటున్నారు. "అండనే ముందర కంత కంపినయట్లు" – అంటే యేమిటి? చదవక తప్పదు... భావవివరణ.

**భావ వివరణ:**

ఓ శ్రీరామా! శ్రీకృష్ణా! నీవున్ అందే రాజ్యమేలుచుండుదువు (నీవూ నీవూ అక్కడే ప్రజారంకముగా రాజ్యమేలుచుందువు). ఇక్కడ యేమిసేసేవు? నీ ఇరవుకు (మీమీ స్థానాలకు) నీవు అయోధ్యకు నీవు ద్వారకకు, పదవే (వెడలుడయ్యా!)

లంకలో విభీషణుని వద్దకు లక్ష్మణుని పంపి పట్టాభిషిక్తుని చేయించినట్లున్నూ, సుగ్రీవునికి కిష్కింద నేలుటకు పంపినట్లున్నూ, వాయునందనుడైన హనుమంతుని సంజీవని తెచ్చుటకు పంపినట్లున్నూ, మమ్మల్ని కూడా వేంకటాద్రి పొంతనుండి (దాపున నుండుటకు) నియోగించరాదా ప్రభూ!

నీ కిరీటమును తెమ్మని ఆనాడు గరుత్మంతుని పంపినట్లున్నూ, పట్టాభిషేకానంతరము అయోధ్య నుండి వానరసేనను తిరిగి కిష్కింధకు పంపివేసినట్లున్నూ, వేదన చెందుచున్న గోపికలవద్దకు ఓదార్చి హితబోధ చేసిరమ్మని నందవ్రజమునకు ఉద్ధవుని పంపించినట్లున్నూ, అనుపు శేషాద్రి నుండి (శేషాద్రినుండమని ఆనతీయుచూ) నన్ను కూడా పంపించరాదా తండ్రీ!

నీ పెండ్లి పద్మావతితో జరుగుతుంది చూచుటకు విచ్చేయుడని పరుషలను (నీ భక్తులను) పిలువనంపినట్లున్నూ, అండనే కంతకు అంపినట్లు ముందరే నన్ను కూడా పంపించు స్వామీ! (పెండ్లిలో ఉప్పు పప్పు బియ్యమూ ఒక పెట్టెలో పెట్టి తీసికొనిపోయి మగపెండ్లివారికి అందిస్తారు. ఆ పనికి ఆంతరంగికులను నియోగిస్తారు. దాన్ని కంతకు పంపడం అంటారు.) వెండియు (మరియు) ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు వేటకు వెళ్తే తిరుమలను చూసుకోవటానికి నీవూడిగపువాడిగా నన్ను వుంచుకోరాదా తండ్రీ!

సంపుటి: 3 కీర్తన : ఆదివిష్ణు వీతఁడే యటరమ్మా.
సంఖ్య : 193 పుట : 130 రాగం: లలిత

**లలిత**

21 ఆదివిష్ణు వీతఁడే యటరమ్మా
ఆదిగొని భూభార మణఁచీనోయమ్మా. ॥ పల్లవి॥

చందురునుదయవేళ సవరేతిరి కాడ
కందువ దేవకి బిడ్డఁ గనెనమ్మా
పొందుగ బ్రహ్మాదులు పురుఁటింటి వాకిటను
చెంది బాలుని నుతులు సేసేరోయమ్మా. ॥ఆది॥

వసుదేవునియెదుట వైకుంఠనాథుఁడు
సిసువై యవతరించి చెలఁగీ నమ్మా
ముసిముసినవ్వులతో మునులకు ఋషులకు
యిసుమంతవాఁ డభయమిచ్చీనమ్మా. ॥ఆది॥

కన్నతల్లిదండ్రులకు కర్మపాశము లూడిచి
అన్నిటా రాకాసిమూఁక అణఁచీనమ్మా
వున్నతి శ్రీవేంకటాద్రినుండి లక్ష్మీదేవితొడ
పన్ని నిచ్చకల్యాణాలఁ బరిగీనమ్మా. ॥ఆది॥ 193

**అవతారిక:**

భూభారాన్ని తగ్గించడానికి భువిపై అవతరించిన ఆదివిష్ణువే ఈ కృష్ణుడు అని ఆ అవతార విశిష్టతను కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు.

సవరేతిరి అంటే అర్ధరాత్రి అని అర్థం. సిసువు అంటే శిశువు అని అర్థం. కన్నతల్లిదండ్రుల కర్మబంధాలను పటాపంచలు చేశాడట ఆయన. రాకాసి మూకలు అంటే రాక్షసులగుంపు అని అర్థం. ఈ కృష్ణయ్యే కలియుగంలో శ్రీవేంకటాద్రిపై అలమేల్మంగమ్మతో వెలసి నిత్యకళ్యాణాల





చక్రవర్తియై శోభలీనుతున్నాడు అంటున్నారు. 'ఆదికొనుట' అంటే కన్నువేయటం అని అర్థం.

**భావ వివరణ:**

ఓ అమ్మలారా! ఈతడే ఆదివిష్ణువట. ఈ మహానుభావుడు, ఆదిగొని (కన్నువేసి... అంటే... నిశ్చయించుకొని) భూభారము నణచినాడమ్మా!

చందురునుదయవేళ (చంద్రుడు వుదయించుచున్న సమయమున) సవరేతిరి కాడ (అర్ధరాత్రి తరుణమున) దేవకీదేవి, కందువ బిడ్డ గనెనమ్మా! (సామర్థ్యముగల శిశువునకు జన్మనిచ్చింది. బ్రహ్మాది దేవతలు అప్పుడు పొందుగా (ఉద్ధతితో) ఆ పురిటింటి గుమ్మంలో నిలబడి ఆ బాలుని స్తోత్రించినారోయమ్మా!

అనంతరం వైకుంఠనాథుడైన శ్రీమన్నారాయణుడు వసుదేవుని యెదుట సిసువుగ (శిశువుగా) అవతరించి చెలగీనమ్మా (కనువిందుజేయు చున్నాడమ్మా!) అప్పుడు ఆ యిసుమంత శిశువు ముసిముసినవ్వులు విరజిమ్ముతూ తనను చూడవచ్చిన మునీశ్వరులకు ఇకపై భయమువలదు అని వారికి అభయమునొసగినాడు ఓయమా! ఏమి ఆశ్చర్యము!!

అప్పుడా శిశువు తన కన్నతల్లిదండ్రులకు వారి గతజన్మల పుణ్య విశేషమును వివరించి తను వారి గర్భమున జన్మించిననూ వారి కర్మఫలము వలన తన బాల్యమును జూచు అదృష్టము వారికి లేదనీ, తిరిగి తను పెద్దవాడయ్యాక జీవితాంతము తనతోనే గడుపుదురని వివరించి వారికి కర్మపాశము నుండి విముక్తి కలిగించెను. ఆ బాలుడే అన్ని విధములైన రాకాసి మూకలను చీల్చి చెండాడినాడు. నేడు ఆతడే శ్రీవేంకటాద్రిపై లక్ష్మీదేవితో నుండి, వున్నతముగా పూని నిత్యకళ్యాణములు జరుపుకొంటూ, పరగీనమ్మా! (వెలయుచున్నాడమ్మా!).

సంపుటి: 3 కీర్తన : జగములేలేవాడవు జనార్దనుడవు
సంఖ్య : 229 పుట : 153 రాగం: ముఖారి

**ముఖారి**

22 జగము లేవాఁడవు జనార్దనుఁడవు
తగ నీవారమై (మే?) నేము ధర నెట్టుండినాను, ॥ పల్లవి॥

గతి నీవు మతి నీవు కాణాచిచోటు నీవు
సతమై యన్నిటికిని సాక్షివి నీవు
చతురత వలసితే జరతుము కొలుతుము
తతి నేము సేసినతప్పులు లోఁగొనవే. ॥జగ॥

తల్లియుఁ దండ్రివి నీవు దాత దైవమవు నీవు
యెల్లవారికిఁ బరము నిహము నీవు
మల్లడి నొక్కొకవేళ మఱతుము తలఁతుము
చల్లఁగా మానేరములు సైరించుకొనవే. ॥జగ॥

దరి నీవు దాపు నీవు దయామూర్తివి నీవు
పరగ శ్రీవేంకటేశ పతివి నీవు
విరివిగా నేమైనా వేఁడుదుము నుతింతుము
శరణుచొచ్చితి మిఁక క్షమియించుకొనవే. ॥జగ॥229

**అవతారిక:**

జనుల 'అర్దన' (వేడికోలు) వినేవాడు జనార్దనుడు. "దేవా! నీవు జనార్దనుడవై జగము లేలుతుంటే, మేము నీవారమై, నీదాసులమై ఈలోకంలో పూనికతో వుంటామయ్యా!" అని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. మా తల్లియు దండ్రియును దాతయునూ నీవే ప్రభూ! "అన్యధా శరణం నాస్తి" అని నిన్ను ఆశ్రయించినాము. మాకు నీవే దిక్కు. అసలు సంగతి యేమిటంటే, అవతారికలో కనుపించినంత తేలిక కాదు, దీని భావము. అంతు చిక్కని, చిక్కుముళ్ళు చాలావున్నాయి, అంటే నన్ను నమ్మండి. "కాణాచి" అంటే





యేమిటో? చదవండి. రెండేళ్ళ క్రితం ఇదే కీర్తన నేను చేయలేకపోయాను, నేడు చేయగలుగుతున్నాను. ఇదే స్వామి 'దయ' అంటే.

**భావ వివరణ:**

ఓ జనార్దనా! నీవు జగములు (పదినాలుగు భువనములను) పరిపాలించు బ్రహ్మాండనాయకుడవు. నేము (మేము) ఈ ధరన్ (భూమిపై) తగన్ (తగినట్లు) నీవారమై (నీ పరివార భృత్యులమై) నెట్టుండినాము (పూనికతోయున్నాము).

ప్రభూ! నీవే మాకు గతివి (దిక్కైన ఆధారానివి). నీవే మాకు మతివి (మంచీ చెడు విచక్షణ కలిగించే మేధస్సువి). నీవే మాకు కాణాచియైన చోటువు (చిరకాలవాసస్థానమైనవాడవు... అందుచేతనే మన ఆత్మలన్నింటికీ ఆ పరమాత్మ చిరంతనుడు). అన్నిటికీ నీవే సతమైన (శాశ్వతమైన) సాక్షివి (ఆయన నిష్పక్షపాతమైన సాక్షీభూతుడు). మాకు అప్పుడప్పుడు చతురత వలసితే (తెలివితేటలు అతి అయిపోయి) నిన్ను జరతుము (నిందించెదము). తరువాత నీవే దిక్కని కొలుతము (కాళ్ళు పట్టుకొంటుంటాం). తతి (అసాధారణంగా) మేము చేయుచున్న తప్పులను మన్నించుము తండ్రీ!

ఓ దేవా! నీవే మాకు తల్లివి, తండ్రివీ నీవే. మా ప్రాణదాతవు పరమాత్మవూ నీవే. నీవు ఆత్మరూపువవైననూ అందరికీ నివాసస్థానమైన వాడవు. మాకు ఇహమున కోర్కెలు దీర్చి, పరమున మోక్షమునిచ్చేవాడవు నీవే. మల్లడి (నీతో పోట్లాడి) ఒక్కొక్కవేళ నిన్ను మఱచిపోయి తలుచుకోను కూడా తలుచుకోము. మా నేరములను చల్లగా (నెమ్మదిగా) సైరించి కొనవే (క్షమించి మమ్మల్ని కాపాడవయ్యా!)

ఓ జగన్నాథా! నీవు మా దరిదాపువు (సమీపములోనే వున్న గమ్యానివి). అంతులేని దయాస్వరూపుడవు. నీవు విలసిల్లిన శ్రీవేంకటపతివి. ఏదియేమైనా మేము నిన్ను విరివిగా (విస్తృతముగా) వేడుకొని నుతించెదము. నిన్ను శరణుచొచ్చితిమి. ఇక క్షమించుకొనవే (మమ్మల్ని క్షమించి అనుగ్రహించుము తండ్రీ!

సంపుటి: 3 కీర్తన : వీఁడివో లక్ష్మిపతి వీఁడివో సర్వేశుఁడు
సంఖ్య : 402 పుట : 271 రాగం: రామక్రియ

**రామక్రియ**

23 వీఁడివో లక్ష్మీపతి వీఁడివో సర్వేశుఁడు
వీఁడివో కోనేటిదండవిహరించేదేవుఁడు. ॥ పల్లవి॥

కొండ గొడగుగ నెత్తి గోవులఁ గాచె నాఁడు
కొండవంటిదానవునిఁ గోరి చించెను
కొండ శ్రీవేంకట మెక్కి కొలు వున్నాఁ డప్పటిని
కొండవంటి దేవుఁ డిదే కోనేటికఱుతను. ॥వీఁడి॥

మాఁకులమద్దులు దొబ్బి మరి కల్పభూజమనే-
మాఁకు వెరికి తెచ్చెను మహిమీఁదికి
మాఁకుమీఁద నెక్కి గొల్లమగువలచీర లిచ్చి
మాఁకులకోనేటిదండ మరిగినాఁ డిదివో. ॥వీఁడి॥

శేషునిపడగెనీడఁ జేరి యశోదయింటికి
శేషజాతి కాళింగుఁ జిక్కించి కాచె
శేషాచలమనేటి శ్రీవేంకటాద్రిపై
శేషమై కోనేటిదండఁ జెలఁగీని దేవుఁడు. ॥వీఁడ॥402

**అవతారిక:**

తాళ్ళపాకలో వెలసిన 'కోనేటిరాయనిపై' చక్కటి కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. వీడివో (వీడే) లక్ష్మీపతి, వీడే సర్వేశ్వరుడు అని కీర్తిస్తున్నారు. భావ వివరణనంతా చదివాక మీకు అంతులేని ఆనందం కలుగుతుందని నాకు ప్రగాఢ విశ్వాసము. శేషాచలమనేటి శ్రీవేంకటాద్రిపై శేషమై కోనేటిదండ చెలగీని దేవుడు - అంటే యెన్నైనా అర్థములు చెప్పవచ్చును. ఈ స్వామి తీయటి నీటి బావి. తోడుకున్న వారికి తోడుకొన్నన్ని నీళ్ళు. అవునా?





**భావ వివరణ:**

ఓ ప్రజలారా! వీడివో (ఈతడే) లక్ష్మీపతి, వీడివో సర్వేశుడు (సర్వమునకు ప్రభువు), ఈతడే ఈ కోనేటి ఒడ్డున విహరించే దేవదేవుడు. ఈయన ఘన కార్యములనాకర్ణించండి.

పూర్వం ఈయన కొండను గొడుగుగనెత్తి (నంద వ్రజమున గోవర్ధన పర్వతమును తన చిటికిన వ్రేలిపై గొడుగువలె యెత్తి గోకులమును రక్షించినాడు). కోరి, కొండవంటి దానవుని (శకటాసురుని) చించెను (ముక్కలు ముక్కలు చేశాడు). అప్పటిని (మరల) ఈ కలియుగంలో శ్రీవేంకటగిరి అనే కొండనెక్కి కొలువు దీరియున్నాడు. నిజముగా ఈ స్వామి ఇదే ఈ కోనేటి కఱుతను (ఒడ్డున... అని... భావిస్తున్నాను) కొండవంటి అండయైయున్నాడు.

పూర్వం ఈయన మద్దిమాకులను (రేపల్లెలో నందుని ప్రాంగణమున వున్న రెండు మద్ది చెట్లను) దొబ్బి (త్రోసివేసి) కూల్చినాడు (మద్దిచెట్లవలెనున్న గంధర్వులకు శాపవిమోచనం కలిగించాడు). ఈ శ్రీకృష్ణుడే స్వర్గలోకంనుండి కల్పవృక్షము అను మాకును (దేవవృక్షమును) వెరికి (పెకలించి) మహిమీదకు (భూలోకానికి) తెచ్చెను. ఈయనే గొల్లమగువల చీరలెత్తుకొనిపోయి మాకుమీదనెక్కి (యమునానది ఒడ్డునవున్న చెట్టునెక్కి వారు శరణన్న తరువాత తిరిగి ఇచ్చినాడు. ఇదిగో నేడు ఈ కోనేటి ఒడ్డున మాకుల మధ్య మరిగినాడు (పరిచితమవుచున్నాడు).

వసుదేవుడు బాలకృష్ణుని యమునానది దాటిస్తుంటే కుండపోతగా వానవచ్చింది. అప్పుడు శేషుడు తన పడిగెలను గొడుగులాకప్పినాడు. స్వామి ఆ పడిగెల నీడలో యశోద ఇంటికి చేరినాడు. శేషజాతి సర్పమైన కాళింగు శిరసుల ద్రొక్కి రక్తం కక్కించి అతను శరణన్నాక కరుణించి విడిచిపెట్టాడు. ఇదే దేవుడు శేషాచలము అనే శ్రీవేంకటాద్రిపైనున్న కోనేటిదండ (కోనేటి ఒడ్డున) చెలగీనీ దేవుడు (శ్రీవేంకటేశ్వరుడై శోభిల్లుతున్నాడు).

సంపుటి: 6 కీర్తన : కరేణ కిం మాం గృహీతుం తే
సంఖ్య : 171 పుట : 123 రాగం: ఆహిరి

**ఆహిరి**

24 కరేణ కిం మాం గృహీతుం తే
హరే ఫణిశయ్యా సంభోగ ॥ పల్లవి॥

జలే తవ సంచరణ మిహాధస్
స్థలే భవనం తవ సంతతం
బలే రూప ప్రకటన మతులా
చలే స్థానం చల చల రమణా ॥కరేణ॥

పదే భువన ప్రామాణ్యం తవ
హ్రదే ప్రచురణవిహరణ మిదం
ముదేమునీనాం మోహనం తనుం
మదే తవ నర్మ చ మాం విసృజ. ॥కరేణ॥

స్మరే విజయ స్తవ విమలతురగ
ఖురే రతిసంకుల రచన
పురే తవ విస్ఫురణం వేంకట
గిరే:పతే తే ఖేలాఘటిత. ॥కరేణ॥ 171

**అవతారిక:**

సరస శృంగార కీర్తన గీర్వాణిలో వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. నా అదృష్టం కొద్దీ ఇది శ్రీమన్నారాయణుని దశావతార కీర్తన. అక్కడక్కడా ప్రతిపదార్ధమునకు గాక భావార్ధమునకు ప్రాముఖ్యతనివ్వడం జరిగింది. నేను తెలుగు దశావతార కీర్తన వివరిస్తే ప్రతిపదార్ధ వివరణకే ప్రాముఖ్యతనిస్తాను. కానీ సంస్కృతంలో ప్రతి పదార్ధ





వివరణ నా శక్తికి మించినపని. ఎందుకంటే గీర్వాణిలో నా పాండిత్యం అమావాస్యనాటి చంద్రుడు. అదండీ సంగతి. "ఓ శ్రీహరీ! ఫణీంద్రశయ్యపై సంభోగానందమందుకొనే నీ కరములు నన్ను అనుగ్రహించకుండుట యెందులకు?" – ఇది పల్లవి మరిదింతే...

**భావ వివరణ:**

ఓ శ్రీహరీ! ఫణిశయ్యా సంభోగా! (ఫణీశుడైన ఆదిశేషుడు శయ్య (పడక) అయి వుండగా, ఆ శయ్యపై సంభోగించుటకు ఆయత్తమైనవాడా!) నీ కరములు నన్ను అనుగ్రహించకుండా యుండుటెందులకు ప్రభూ!

సముద్రమునందు నీయొక్క సంచలన మిట్టిది (మత్స్యావతారము); నీవు అడుగున నీపైన భువనములు వున్నవి (కూర్మావతారము); ఉన్నతమైన బలప్రకటన జరపురూపమొప్పినది (వరాహావతారము); కొండగుహలలో చరించు సింహముఖరూపివి (నరసింహావతరాము);

నీపదములతో భువన ప్రమాణములను కొలిచితివి (వామనావతరాము); గొప్ప మడుగులో (తీర్ధములలో) నీయొక్క ప్రసిద్ధమైన విహారములు (యాత్రలు) జేసితివి (పరుశురామావతారం); మునులకు సైతం ఆనందమునిచ్చు మోహన రూపుదైతివి (శ్రీరామావతారము); నీయొక్క ఔన్నత్యమునకు నన్ను విడనాడితివి (బుద్ధుని అవతారము).

నీయొక్క విజయ చిహ్నమైన తెల్లని గుఱ్ఱపు గిట్టల నడక రతి సల్లాప సంకేతములైనవి (కల్కి అవతారము); ఓ శ్రీవేంకటగిరినాథా! సృష్టిలో నీ ప్రకాశముతో నీయొక్క ఆట నాడించు నీ కరములతో నన్నేల పరిగ్రహించవు తండ్రీ!

సంపుటి: 6 కీర్తన : చిఱునవ్వు మెఱుఁగారు సిగ్గుల మోముతోడ
సంఖ్య : 54 పుట : 46 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

25 చిఱునవ్వు మెఱుఁగారు సిగ్గుల మోముతోడ
మరగె నిన్నలమే ్మంగ నాచారి. ॥ పల్లవి॥

నిలువుఁదురుము మీఁది నెమలిపాదపుడాలు
తొలి మెఱుఁగుల మించి దొలఁకఁగాను
అలరుచు నినుఁ జూచి అప్పుడె వెరగువడి
మలయుచు నలమేలుమంగ నాచారి. ॥చిఱు॥

పరగునీమెడ సరపణులవుయ్యాలలో
ఉరుటు మురిపమున నూఁగుచును
గిరికొన్న తమకాన కిందుమీఁదెఱుఁగక
మరచె మే నలమేలు మంగనాచారి. ॥చిఱు॥

కంచము గని మోవి కమ్మఁదేనే లారగించి
లంచముగఁగస్తూరి లప్పలు రాల
యెంచఁగఁ దిరువేంకటేశుఁడు నీ పాఁపసజ్జ
మంచమెక్కె నలమేల్మంగనాచారి. ॥చిఱు॥

**అవతారిక:**

అలమేల్మంగ నాంచారి మీద అన్నమాచార్యులవారు చెప్పిన సరస శృంగార కీర్తన నాస్వాదించండి. వైష్ణవుల పరిభాషలో దేవిని నాంచారి అంటారు. నాచారి అని కూడా అంటారు. అందులో అమ్మవారి కొన్ని ఆభరణాల పేర్లను గానంచేస్తున్నారు. నెమలిపాదపుడాలు, సరపణలవుయ్యాలలు, మంచమున కలంకరించిన పాపసజ్జలు- ఇత్యాదివి నేటి కాలంలో లేనందువల్ల కొన్ని మన వూహాతీతం. ఊంజల్‌సేవ





సందర్భంగా పాడిన కీర్తన అయివుంటుంది. “సిగ్గులు చిందించే చిరునవ్వు మెఱుపులొలికే మోముగల, ఈ అలమేల్మంగనాచారి నిన్ను మరగెనయ్యా తిరుమలేశా!” అంటున్నారు. నేటితరం వారికి ఈ భాషే ఒక తమాషా జాగ్రత్తగా చదవండి.

**భావ వివరణ:**

ఓదేవదేవా! నీ దేవేరి అలమేల్మంగ నాచారి నిన్ను మరగె (ఆశించుచున్నది). మనోహరమైన ఆ నాచారి (దేవి) సిగ్గుల చిరునవ్వు మెఱుగార (మెరపులు కురిపిస్తున్న) మోముతో (వదనముతో) శోభిల్లుచున్నది.

ఆమె, నిట్టనిలువుగానున్న తురుము (సిగకొప్పు) మీద “నెమలి పాదపుడాలు” ధరించినది. అది తళతళ మెరుగులను మించి (అధికముగా) దొలకె (చిందించుచున్నది). ఆ దేవి వెరగువడి (అత్యధికమైన ఆశ్చర్యముతో మలయుచున్నది (నీకొరకు ఆరాటపడుచున్నది). ఆమె జగజ్జననియైన అలమేల్మంగనాచారి.

ప్రభూ! నీ మెడలో “సరపణులు” వుయ్యాలలూగుచున్నవి. ఉదటు మురిపెమున (గొప్ప మురిపెముతో) వూగుచున్న వాటిని, గిరికొన్న తమకాన (తారా స్థాయికి చేరిన పారవశ్యముతో) కింద మీదెరుగక (ఆశగా చూడవచ్చునో చూడ కూడదో తేల్చుకోలేక) ఆ అలమేల్మంగ నాచారి, మేను మరచె (తన తనువును తానే మరచినది స్వామీ!)

దేవా! కంచము మోవిగని (తేనెలూరు మధురాధరమును) గాంచి లంచముగా కమ్మని తేనెలారగించితివి. అప్పుడు దేవి అలదుకున్న కస్తూరిలప్పెలుగా రాలిపడినది. ఆపైన ఓ శృంగారరాయా! యెంచగా తిరువేంకటేశుడైన నీవు అలమేల్మంగ నాచారితో నీ “పాపసజ్జ మంచమునెక్కి” ఆదేవిని నీ సరసశృంగారముల నలరించితివి. (ఓ జగద్రక్షకా! భావాతీతమైన మిమ్ముభావించుట బావిలో కప్పవంటి నా తరమా!! నా అశక్తతకు అజ్ఞానానికి మన్నించి నీవు అలా నవ్వుతూనే వుండు ప్రభూ!)

సంపుటి: 6 కీర్తన: ఉప్పవడము గావయ్యా ఉయ్యాలమంచముమీద
సంఖ్య : 102 పుట : 74 రాగం: కాంబోధి

**కాంబోధి**

26 ఉప్పవడము గావయ్యా ఉయ్యాలమంచముమీఁద
గొప్ప గొప్ప కన్నుల గోవిందరాజా. ॥ పల్లవి॥

పవ్వళించే వీడ వచ్చి పాయనినీయలపెల్ల
ముప్వంకమేనితోడ ముచ్చట దీఱ
నవ్వేటి శ్రీసతిచూపు నాటినచిత్తపుమేన
క్రువ్వనికలువదండై గోవిందరాజా. ॥ఉప్ప॥

నిద్దిరించే వీడ వచ్చి నిలుచున్నయలపెల్ల
ప్రొద్దువొద్దునకుఁ దీర భోగీంద్రుపై
యిద్దరుసతులు నీకు నేచినతాళగతుల
గుద్దేటిపాదములతో గోవిందరాజా. ॥ఉప్ప॥

మెండుగ మేలికొంటివి మించిన కౌఁగిటిలోన
కొండుకపాయపుసిరి కోపించంగా
ఉండవయ్యా సుఖలీల నుడివోనిప్రియముతో
కొండలకోనేటిరాయ గోవిందరాజా. ॥లలల॥

**అవతారిక:**

'ఉప్పవడము' అవటం అంటే రాజీకి రావడం అన్నమాట. ఉయ్యాలమంచం మీద నీకు నీ దేవేరుల మాట వినక తప్పదు. గొప్ప గొప్ప కన్నులున్న గోవిందరాజువి నీవు. అయినా సరే, అంటున్నారు అన్నమాచార్యులవారు. ఈ కీర్తనలో వేంకట మకుటం లేకపోవటం విశేషమే.

ఇటువంటి శృంగార కీర్తనల భావవివరణలో చిక్కేమిటంటే "యద్భావం





తద్భవతి" – అంటే నీ భావన నీ భావానుగుణ్యంగానే వుంటుంది. కొండల కోనేటిరాయుడే ఈ గోవిందరాజు అంటున్నారు. కొండుకపాయపుసిరి అంటే చిన్నపిల్లవంటి శ్రీదేవి, కోపించిందట స్వామిపైన... యెందుకో? జాగ్రత్తగా చదివి భావించి పరవశించండి.

**భావ వివరణ:**

ఓ గోవిందరాజా! నీ విప్పారిన గొప్ప గొప్ప నయనాలు నీ భావములను తెలుపుతూనే వున్నాయి. నీవు ఈ ఉయ్యాలమంచము మీద భూదేవి, శ్రీదేవి సమేతుడవై వూగుచున్నావు. ఇప్పుడైనా, ఉప్పవడము గావయ్య (రాజీ మార్గానికి రావయ్యా!)

ఓ గోవిందరాజా! ఈ వైపునకు వచ్చి నీ అలసట దీరునట్లు ముచ్చట దీరగా, ముప్వంకమేనితో (మూడు అవస్థలను పొందుతున్న దేహముతో) నిదురించవయ్యా! చిరునవ్వులొలుకు శ్రీసతి చూపులు నీ చిత్తముపై నాటుకొంటుండగా నీ వామె మెడలో క్రువ్వని కలువదండైనావు (వాడని కలువపూలహారమైనావు స్వామీ!)

ఈడ వచ్చి ప్రొద్దు వొద్దునకు (పూట పూటకు) నిలుచున్న అలుపెల్లదీర (అలసట యంతయు దీరునట్లు) భోగీంద్రునిపై (ఆదిశేషునిపై) విశ్రాంతిగా నిదురించవయ్యా! నీకు భూదేవి, శ్రీదేవి అను ఇద్దరు భార్యలు, యేచిన తాళగతుల (అతిశయించిన తాళానుగుణముగా) గుద్దేటి పాదములతో తన సతులను తనపాదములతో తేలికపాటి తాడనములిచ్చుచున్నాడు. ఈ గోవిందరాజస్వామి చిలిపి చేష్టలేమని వర్ణింతుము?

ప్రభూ! నీవు మెండుగా (మేలుగా) మేలుకొనినది కూడా, కొండొక ప్రాయపుసిరి కౌగిటిలోననే (లేత్రాయపు చిన్నదైన శ్రీదేవిని గాఢాలింగనముననే) ఆమె నిదుర చెడి ఆమె నీపై కోపించినదాయెను. అయినదేమో అయినదని ఆమెను వూరడించి ఉడివోని ప్రియమున (తరగని అనురాగముతో) సుఖలీల (సుఖముగా) వుండవయ్యా! ఓ గోవిందరాజా! నీవే కొండలకోనేటిరాయుడవు.

సంపుటి: 6 కీర్తన : నాలం వా తవ నయవచనం

సంఖ్య : 157 పుట : 113 రాగం: రీతిగౌళ

## రీతిగౌళ

27 నాలం వా తవ నయవచనం
చేలం త్యజ తే చేటీ భవామి ॥ పల్లవి॥

చల చల మమ సంసర్ఘటనే కిం
కులిశహృదయ బహుగుణవిభవ
పులకిత తనుసంభృత వేదనయా
మలినం వహామి మదం త్యజామి. ॥నాలం॥

భజ భజ తే ప్రియాభామాం సతతం
సుజన స్వం నిజసుఖ నిలయ
భుజ రేఖా రతి భోగిభవసికిం
విజయీభవ మద్విధిం వదామి. ॥నాలం॥

నయ నయ మా మనునయనవిధం తే
ప్రియకాంతాయాం ప్రేమభవమ్
భయహార వేంకటపతే త్వం మ-
త్ప్రియో భవసి శోభితా భవామి. ॥నాలం॥

**అవతారిక:**

జయదేవకవి స్ఫూర్తితో చాలామంది గీర్వాణలో శృంగార కీర్తనలు రచించారు. అన్నమాచార్యులవారు సాళ్వ నరసింహరాయలు కొలువులో వున్నప్పుడూ అసంఖ్యాకమైన సరసశృంగార కీర్తనలు చెప్పారు వేంకట మకుటంతో రాజుగారి ఆస్థానంలో విద్వత్ గోష్ఠులు జరిగే తరుణంలో పాండితీ ప్రదర్శనకు కవులు సంస్కృతంలో కవిత్వం చెప్పేవారేమో





అనిపిస్తుంది. ఈ కీర్తనలో నిందాస్తుతిని ఇతివృత్తంగా యెన్నుకొన్నారు. నాయిక విరహోత్కంఠితయై స్వామిని నిందిస్తున్నది. దెప్పి పొడుస్తున్నది. చివరికి రాజీకి రాక తప్పలేదు. నీవు నా ప్రియుడివైతే నేనూ శోభిస్తాను కదయ్యా! అంటున్నది.

**భావ వివరణ:**

నీయొక్క నయవంచనతో కూడిన మాటలు ఇక చాలించవయ్యా! ముందు నా పైట కొంగును విడిచిపెట్టు. నీదాసినౌదునులే. నన్ను వదలిపెట్టు.

ఓ కులిశహృదయా! (కఠినహృదయుడా!) నీకు నాతో పొత్తు యెందులకు? చాలు చాలు. పో పొమ్ము. ఓ బహుగుణ విభవా! (అనేక గుణములు పుణికి పుచ్చుకున్నవాడా!) చాలు చాలు పో పో. నేను పులకించిన గాత్రము (శరీరం) వలన పొందిన వేదన యొక్క మాలిన్యమును ధరించియున్నాను. ఇక నా అహమును విడనాడి నీకు వశమైతిని.

నీవు యెల్లప్పుడూ నీ వలపుకత్తెనే స్మరిస్తుంటావు. నీవు గొప్పవాడివి కదా! గొప్పవాళ్ళకి స్త్రీ వ్యసనం సహజమేలే. పైగా నీవు బ్రహ్మానందానికి నిలయుడవట కదా! నీ భుజములపై రతికూటముల చిహ్నములు కొట్టవచ్చినట్లు కనబడుతూనే వున్నాయి కదా! పోనీలే. నీకు అంతా విజయమేలే. నా తిప్పలు నీకెందుకు పట్టాయి గనుకా!

నన్ను బుజ్జగించే విధానమును కూడా కాస్త నీవు తెలుసుకోకూడదటయ్యా! నీ ప్రియకాంతకే నీవలపులనందించుకో. మధ్యలో నిన్ను కాదన్న వాళ్ళెవరు? నాకేమి పట్టింది? భయహరుడవైన ఓ శ్రీవేంకటేశ్వరా! నీవు నా ప్రియుడవైనచో నేను కూడా శోభించెదను కదా! స్వామీ!

సంపుటి: 6 కీర్తన : చక్కని సరసపు శిశువు
సంఖ్య : 151 పుట : 109 రాగం: కన్నడగౌళ

## కన్నడగౌళ

28 చక్కని సరసపు శిశువు
పెక్కుమాయల పెనుశిశువు ॥ పల్లవి॥

చిమ్మెడి విషములు చేఁపినరొమ్ములు
కొమ్మని యిచ్చినఁ గుడిచేని
బొమ్మరపోవఁడు పూతకిఁ బొరిగొని
అమ్మరో గయ్యాళి శిశువు ॥చక్కని॥

చుట్టమువలెనే సుడిగాలినిఁ గని
బెట్టుగఁ గౌఁగిట బిగించేని
పుట్టఁడు వొడమఁడు బూమెలే చేసీ
పట్టరే పసి బాల శిశువు. ॥చక్కని॥

పాదము చాఁచటు బండి జాతురకు
ఆదిగొనుచు తా నలరీని
వేదవేద్యుఁడగు వేంకటగిరిపై
మోద మందిన మున్నిటిశిశువు ॥చక్కని ॥

**అవతారిక:**

పెక్కు మాయలపెను శిశువు అని శ్రీకృష్ణ పరమాత్మను కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. పల్లవి తేలికగా వుంటే చరణాలు మరణాలే అన్నమయ్య కీర్తనలలో. స్వామి మున్నిటి శిశువుట అంటే అనాదియైన శిశువు. బొమ్మర పోవడు అంటే దిమ్మతిరిగేట్లు చేయడమన్నమాట. "పుట్టడు వొడమడు బూమెలే చేసీ" అంటే ఏమిటి? తేలికగా కనిపించే అతి క్లిష్టమైన కీర్తన ఇది. సాధ్యమైనంత పొందికగా దీని భావవివరణ కూర్చాను.





**భావ వివరణ:**

ఓ ప్రజలారా! శిశువు (పొత్తిళ్ళ బాలుని) వలె వున్న ఇతడు చక్కని, సరసమైన (లలితమైన) వాడు. చాలా మాయలు నేర్చిన గొప్ప శిశువు ఈతడు. ఈయన లీలలు వినండి.

ఒకనాడు పూతకి అనే రాక్షసి అందమైన యువతి వలెవచ్చి విషములు చిమ్మెడి రొమ్ములలో పాలు చేపిన (చేపినవని) కొమ్మని (త్రాగునాయనా!) అని ఇచ్చిన వెనువెంటనే, కుడిచేని (పీల్చినాడు). బొమ్మరపోవడు (దిమ్మదిరగిన) ఆ రాక్షసి పొరిగొనినది (నశించినది). అమ్మరో! (అయ్యబాబోయ్) వీడు గయ్యాళి శిశువు (రండగొండి పిల్లవాడు).

ఒకనాడు తృణావర్తుడు అనే రాక్షసుడు సుడిగాలి రూపంలో చుట్టపు చూపుగా అనుకోకుండా వున్నట్లుండి వచ్చాడు. వచ్చి, బెట్టుగ కౌగిట బిగించేని (అతిశయించి కౌగిటిలో బిగించినట్లు చుట్టేశాడు). అప్పుడు వీడు మాత్రం తక్కువవాడా? బూమెలే చేసీ (మోసాన్ని మోసంతోనే వంచాడు). పైగా వాడు పుట్టడు వొడమడు (పుట్టుకే లేని మగాడు). (పసిబాల శిశువుగా) వున్నంతమాత్రాన పట్టరే! (వీనిని పట్టుట సాధ్యమా?)

ఒకనాడు శకటాసురుడు అనే రాక్షసుడు 'బండి' రూపంలో వీడిని చంపాలని వచ్చాడు. అప్పుడు, ఆదిగొని (వాడిపై కన్నువేసి) తాను (ఆ శిశువు) అటు పాదము చాచి, జాతురకు నలరీని (మిక్కిలి చాతుర్యంతో అతిశయించి) బండిని ఒక్కతన్ను తన్ని ముక్కలు ముక్కలు చేసి శకటాసురుని చంపేశాడు. ఎందుకంటే ఆ శిశువు యెవ్వరనుకొన్నారు? వేదవేద్యుడు (వేదముల చేతనే తెలియశక్యమైన) దేవదేవుడు. శ్రీవేంకటాద్రి మీద సంతోషంగా వున్న శ్రీవేంకటేశ్వరుడే ఈ మున్నిటి శిశువు (అనాదియైన మఱ్ఱియాకు శిశువు).

సంపుటి: 6 కీర్తన : లంపుగుబ్బ గొల్లెతల లంజకాఁడ నీ
సంఖ్య : 127 పుట : 92 రాగం: ఆహిరి

**ఆహిరి**

29 లంపుగుబ్బ గొల్లెతల లంజకాఁడ నీ
యింపులే వెదకంబట్టీ నెట్లరా వోరి! ॥ పల్లవి॥

చెప్పరానివేడుకల సిగ్గులనే నిన్నాళ్లు
ఉప్పతిల్లుం గోరికల నుంటిం గాని
ఇప్పు డింతనిలువలే నేమిసేతు నీచిత్త
మెప్పుడు గాని రాదో యెట్లరా వోరి ॥లంపు॥

చిల్లర సింగారాలు చెలులు సేయఁగ నేను
వొల్లనని యిన్నాళ్లు నుంటిం గాని
మల్లెపూవువంటి నన్ను మాసినచీరతోడ
నిల్లు వెళ్లకుండఁ జేసి తెట్లరా వోరి! ॥లంపు॥

కమ్మనిపానుపున నీకౌఁగిటిలో నిన్నాళ్లు
ఉమ్మగింపుమేనితో నుంటిం గాని
దిమ్మరిసేఁతలతోడి తిరువేంకటేశ! నీ
యెమ్మె లింకా మానలే వెట్లరా వోరి. ॥లంపు॥

**అవతారిక:**

జానపద బాణీలో సాగే గొల్లెతల సరస శృంగార కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. అతిశయించిన మమకారంతో నాయిక నిందిస్తుంటుంది, చనువుగా. అన్నమయ్య కాలంలో జానపదులు వాడిన కొన్ని మాటలు నేటి నిఘంటువులలో లభించుటలేదు. ఉదాహరణకి "లంపు గుబ్బ గొల్లెత" "లంపు" అంటే "దొంగమేత", "గుబ్బలు" అంటే స్తనములు. దీనికి సమన్వయమెట్లా సాధ్యం. 600 ఏళ్ళక్రితం జానపదుల వాడుక భాషలో





"లంబము" అనే మాటను "లంపు" అనేవారేమో. ఆ మాటకు దీర్ఘమైన లేక పొడవాటి అని అర్థం. అదండీ సంగతి 'లంజకాదు' అంటే 'విటుడు' అని ప్రతిపదార్థ వివరణ కావాలనే త్యజించుట క్షంతవ్యము.

**భావ వివరణ:**

ఓరీ!! (ఔరా!) లంపు గుబ్బ గొల్లెతల (ఉన్నత స్తన గిరులున్న గొల్ల భామల) లంజకాడ! (విటుడా!) నీ ఇంపులెల్లా (నీకు వేటిమీద మోజుయెక్కువో) వెదకంబట్టె (తెలిసిపోయింది) యెట్టరా? (ఇట్లా అయితే ఎట్లాగునరా!)

ఓరీ!! చెప్పశక్యంకాని కోరికలు ఉప్పతిల్లినా (చెలరేగినా) నేను సిగ్గుచే చితికియున్నాను. కాని ఇప్పుడింక నిలువరింపనసాధ్యమై పోవుచున్నది. నేనేమి సేయ గలనురా? నీకు నాపై మనస్సెప్పుడు పుడుతుందో చెప్పలేం. ఇట్లా అయితే యెట్టారా? (యెలాగునరా!)

ఓరీ!! నా చెలికత్తెలు ఇంతకాలమూ నేను నీ కంటికి నదురుగా వుండాలని యేవేవో చిల్లర సింగారాలు (సామాన్యమైన అలంకరణలు) చేసేవారు. నేను కూడా వాటిని వొల్లనని (వద్దని) తిరస్కరించేదాన్ని. కానీ నీకోసం పడిగాపులు కాసీ కాసీ, మల్లెపూవువంటి నన్ను మాసిన చీరెతో ఇంటికి అంటిపెట్టుకొని పోయేట్లు చేశావు కదరా! ఇట్లా అయితే యెట్లారా?

ఓరీ! నీ కమ్మని పాన్పుపై (మధురమైన శయ్యపై) నీ సందిట, వుమ్మగింపుమేనితో (త్రెళ్ళు దేహంతో) వున్నాను. కానీ ఓ తిరుమల నాయకా! నీ దిమ్మర సేతల (మత్తులో ముంచే నీ చిలిపి సేతలతో) నీ యెమ్మెలు మానవు (విలాసవంతమైన సయ్యాటలను వదలవు). నీతో యెట్టారా?

సంపుటి: 6 కీర్తన : యెన్ని మారులు యిట్టె నీపనులు
సంఖ్య : 58 పుట : 43 రాగం: సామంతం

## సామంతం

30 యెన్ని మారులు యిట్టె నీపనులు
ఇన్ని మాయలు నన్ను నేఁచనేఁటికిరా. ॥ పల్లవి॥

నీళ్లే నమలేవు నీలోనె సన్నల
వేళ్లే చూపేవు వెలుపలికి
పేళ్లె తప్పేవు బిరుసుగ, నింతేసి
గోళ్ల రాచేవు కోపమేఁటికిరా. ॥యెన్ని॥

మేనె దాఁచేవు మెస్తిర గొడ్డలి
నానం బెట్టేవు నయముననే
పోని తెరువుల పోకులఁ బోయేవు
కానిరా యేటివంకలు తిద్దవశమా. ॥యెన్ని॥

చేరి కపటాలె చేసేవు యిఁకనైనా
సారెం బరువులు చాలించరా
ధీరుండవుగాన తిరువేంకటపతి
కూరి మెఱఁగి నన్నుఁ గూడితి విపుడూ. ॥యెన్ని॥ 58

**అవతారిక:**

ఇదికూడా జానపదుల శైలిలో కొనసాగే దశావతార కీర్తన. నా అభిప్రాయంలో ఇది బహుక్లిష్టమైనది. ఎందుకంటే కొన్ని మాటలకు యే నిఘంటువులోనూ అర్ధ వివరణ సూచన ప్రాయంగా కూడా లభించలేదు. అది ఏ అవతార వివరణో వూహించగలుగుట వలన భావసమన్వయం ఆవశ్యకమైనది. అంటే. ఉదాహరణకి "పెళ్లె తప్పేవు బిరుసుగ" అంటే వరాహవతారంతో సమన్వయపరచుటెట్లు సాధ్యం. యేటివంకలు తిద్దవశమా?



అంతయు నీవే హరిపుండరీకాక్ష

అంటే కృష్ణావతారంతో యెట్లా ముడిపెట్టాలి? దీని అర్థం ఏమిటో ఎలా తెలుస్తుంది? ఓ దేవదేవా! అన్నమయ్య ఈ కీర్తన పల్లవిలో అన్నమాట నిజం చేస్తున్నావు కదటయ్యా! "ఇన్ని మాయల నన్ను నేచనేటికిరా". అంటే ఏమిటో తెలియాలంటే ఏమిటి చేయాలి? మీకు తెలుసునని నాకు తెలుసు.

**భావ వివరణ:**

నీ పనులు (నీవు చేసే లీలలు) యెన్ని మారులు? (ఎన్ని విధములో) చెప్పుట యెట్లు సాధ్యము? నన్ను ఇన్ని మాయలతోన్ చేయనేటికిరా? (అతిశయించుట యెందులకయ్యా?)

ఒకసారి నీలోనే నీళ్ళు నములుతుంటావు (మత్స్యావతారము); ఇంకొకసారి వెలుపలికి వచ్చి సన్నల (సైగలతో) వేళ్ళను చూపింతువు (కూర్మావతారము); ఇంకొకసారి, బిరుసుగ పేళ్లె తప్పేవు (కాఠిన్యంతో వేగిపోతూ తపించిపోయేవు)... అనగా (వరాహావతారం). ఇంకొకసారి, ఇంతేసి గోళ్ళ రాచేవు (ఇంతింత పొడుగువున్న గోళ్ళతో చీరివేసెదవు. కోపమేటికిరా? కోపమెందులకయ్యా? (నరసింహావతారం).

ఒకసారి, మేనెదాచేవు (చూడటానికి పొట్టి పిల్లవాడిలావున్నా, భూనభాంతరములు నిండిపోగల శరీరాన్ని దాచివుంచినావు)... అనగా (వామనావతారం).; మెస్తిర గొడ్డలి నయముననే నానం బెట్టేవు (బాగా పదునైన పరశువును బాగా రక్తంలో నానబెట్టినావు)... అనగా (పరశురామావతారము); పోని తెరువుల పోకల బోయేవు (చొరరాని కీకారణ్యములబట్టి పోయేవు)... అనగా (శ్రీరామవతారం); కానిరా, యేటివంకలు తిద్దవశమా (కానీయవయ్యా! వంకరటింకరగా పోయే ఏరుయొక్క మార్గాన్ని కట్టడి చెయ్యగలమా? ... అనగా (శ్రీకృష్ణావతారపు గోపీలోలత్వం).

ఒకసారి, చేరి కపటాలే చేసేవు (పురసతులను మోసగించినావు)... అనగా (బుద్ధావతారము). ఇకనైనా సారెం పరువులు చాలించరా (ఇప్పటికైనా, మాటిమాటికీ పరుగులు తీసే అలవాటు మానుకోవయ్యా!)... అనగా (కల్కి అవతారము); ధీరోదాత్తుడవు కావున ఓ తిరువేంకటేశ్వరా! కూరిమి యెరిగి నన్ను కూడితివి. ఇప్పుడు నీమాయలను మెచ్చక యెలా వుండగలను ప్రభూ!.

సంపుటి: 4 కీర్తన : మేలుకొనవే
సంఖ్య : 21 పుట : 375 రాగం: భూపాలం

## భూపాలం

31 మేలుకొనవే
భూలలనాధిప భోగిశయన ॥ పల్లవి॥

లేదు వేదవిధి లేశమును
మేదిని భరమై మించినది
పాదుపడదు చూపరకు భువి
గాదిలిసుతుపై గనలె జనకుఁడు ॥మేలు॥

కనకము చవి చెడెఁ గడుఁగడును
ఘనన్నపబాధలు గదిమినవి
దనుజుల కతివలు దలఁకెదరు
ఎనయ బలాధికులెవ్వరు లేరు ॥మేలు॥

అసుర సతుల పుణ్యము ఘనము
కస (సి?) మసఁగెడి కలికాలమహిమ
పసగల వేంకటపతి యిఁకను
వసుధలోని నెవ్వగలుడుపఁగను ॥మేలు॥21

**అవతారిక:**

అన్నమాచార్యులవారు చెప్పిన ఒక మేలుకొలుపు కీర్తననాస్వాదించండి. 600 సంవత్సరాల క్రితం పరిస్థితి ఇంత ఘోరంగావుంటే నేడు యెవరికివారే యమునాతీరే అనే రోజుల సంగతి చెప్పేదేముంది? కన్నకొడుకులపై తండ్రి కక్షకడుతున్నాడు. బంగారం బంధువైపోయింది. ఆడది అసురులవంటి వారి చేతిలో అల్లాడిపోతుంది. "కసిమసగెడి కలికాలం" మహిమ యేం చెప్పగలం? ఒక్క శ్రీవేంకటేశుడే వసుధలోని





పగను నెవ్వగలడు అంటున్నారు. భావవివరణతో పరిస్థితి ఇంకా బాగా అర్థమవుతుంది. అవునా?

**భావ వివరణ:**

ఓ భూలలనాధిప! (భూసతీరమణా!) భోగిశయనా! (శేషతల్పశాయీ!) మేలుకొనవే. (నీవు సృష్టించిన ఈలోకం యెంత ఘోరంగా వున్నదో ఒకసారి పరికింపుము).

వేదువిధి లేశమును లేదు (ఎవ్వడూ వేద విధానములను పాటించుట లేదు). భూమి మీద భరమై మించినది (అతిశయము యెక్కువైపోయింది). చూపరులకు భువిపాదుపడదు (కాళ్ళకింద భూమి కనపడదు. అంటే అంత పొగరుబట్టి వుంటారు). ప్రేమించవలసిన కన్నకొడుకుపైన తండ్రే కనలె (మండిపడుతుంటాడు).

కనకము చవిచెడెన్ కడునేకడున్ (బంగారమునకు వుండవలసిన నిబద్ధతతో కూడిన మక్కువ వుండదు. అనగా ప్రతివాడూ బంగారం కోసం వెంపర్లాడుతుంటాడు). గొప్పవాళ్ళయిన నృపుల (పరిపాలకుల) బాధలు గదిమినవి (భయపెడుతునవి). దనుజులకు (రాక్షసులవంటి మగవారి దౌర్జన్యాలకు) అతివలు (స్త్రీలు) తలకెదరు (భయపడుతుంటారు). లోకంలో ఈ పరిస్థితిని ఎనయు బలాఢ్యులు (సవరించగల దిట్టలు) యెవ్వరూ లేరు.

కాని అసురసతులు (దుర్మార్గుల భార్యలు) ఘనమైన పుణ్యములు చేస్తుంటారు. కలికాల మహిమ (కలియుగ ప్రభావముచేత) కసమసగెడి (పాపము విజృంభిస్తుంటుంది). హతవిధీ!! ఇక గత్యంతరం యేమిటి? పసగలవేంకటపతి (సర్వ సమర్థుడైన శ్రీవేంకటేశ్వరుడు) ఇకను (ఇకపై) వసుధలోని పగను, నెవ్వగలడు (ఆపద తప్పించగలడు.)

సంపుటి: 4 కీర్తన : హరి నీవే సర్వాత్మకుడవు
సంఖ్య : 441 పుట : 297 రాగం: దేశి

**దేశి**

32 హరి నీవే సర్వాత్మకుడవు
యిరవగు భావన యియ్యగదే ॥ ॥ పల్లవి॥

చూడక మానవు చూచేటి కన్నులు
యేడనేవైనా యితరములు
నీడల నింతా నీ రూపములని
యీడువడని తెలి వియ్యగదే ॥ ॥హరి॥

పారక మానదు పాపపు మనసిది
యీరసములతో నెందైనా
నీరజాక్షయిది నీమయమేయని
యీ రీతుల తల పియ్యగదే ॥ ॥హరి॥

కలుగక మానవు కాయపు సుఖములు
యిలలోపలగల వెన్నైనా
అలరిన శ్రీవేంకటాధిప నీకే
యిలనర్పితమను యిహమియ్యగదే ॥ ॥హరి॥441

**అవతారిక:**

మనం వేరు, పరులు వేరు అనే భావనవుండటం వల్లనే మనం కొందరిని ప్రేమిస్తాం, కొందరిని ద్వేషిస్తాము. కానీ శరీరాలు వేర్వేరైనా ఆత్మలన్నిటికి మూలకారణం పరమాత్మ అనే తత్త్వం తెలిసినవాడు సర్వాత్మకుడైనవాడు శ్రీహరి ఒక్కడే అని తెలిసికొని ఎవ్వరినీ ద్వేషించడు. ఓ దేవదేవా నాకు కూడా అటువంటి భావనే ఇయ్యవయ్యా! అంటున్నారు అన్నమాచార్యులవారు. ఈ ప్రపంచంలోవున్నవన్నీ నీ అర్పణ కొరకే





స్వామీ! అంటున్నారు. ఈ భావవివరణ వ్రాసేటప్పుడు నాకు కలిగిన తృప్తి నేను మాటలలో వర్ణించలేను.

**భావ వివరణ:**

ఓ శ్రీహరీ! నీవే సర్వాత్మకుడవు (అన్ని ఆత్మలకు మూలమైనవాడవు). నాకునూ అట్టి నీవే అన్ని ఆత్మలలోగలవని ఇరవగు భావన (సుస్థిరమైన అభిప్రాయమును) ఇయ్యగదే (ఈయవయ్యా!)

నాకు చూడాలనే కోరిక కలిగితే చాలు నా కన్నులు దేన్ని పడితే దాన్ని చూస్తాయి. ఇతరములు (అనవసరమైన ఇతర విషయములన్నింటినీ, యేడ నేవైన (యెక్కడైనా యేమైనా) చూస్తాయి. అవి చూడటం మానవు. నీడలన్ (నీ ఆశ్రయంలో) అన్నీ నీ ప్రతిరూపాలే అనునట్టి, ఈడువడని (చెడిపోని) తెలివి (జ్ఞానమును) ఈయగదే (ఇమ్ము ప్రభూ!).

నేను నాకళ్లుమూసుకున్నా నన్ను చెడగొట్టే ఇంకొకటుంది. అదే నా మనస్సు. పాపచింతనతో కూడిన నా మనస్సు అనవసరమైన వాటిమీద పారక మానదు (ప్రసరించక వదలదు). ఈ రసములతో యెందైనా యెవరికైనా యెన్నో పాపపు ఆలోచనలే వస్తాయి. ఓ నీరజాక్షా! ఈ రసములు కూడా నీమాయలే (నీవలననే కలిగినవి) అనునట్టి తలపును ఇయ్యగదే (ఈయరాదటయ్యా!)

ప్రభూ! నా కళ్ళూ మనస్సు ఒక్కసారి విజృంభించాయంటే, నా కాయము (దేహము) వున్నదే అది తగులుకొంటుంది. దానికెప్పుడూ సుఖం కావాలి. దానికి ఒక సుఖం చాలదు. ఎన్నయినా కావాలి కావాలి అనే అంటుంటుంది. దానికి ఈ ప్రపంచమంతా ఇచ్చినా చాలదు. అలరిన శ్రీవేంకటాధిప (ఏడు కొండలపై శోభించుచున్న) ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ ప్రపంచంలో వున్నవన్నీ నీకు అర్పితమైనవే అనే ఇహము (ఈ ప్రాపంచిక జ్ఞానమును) ఇయ్యవయ్యా తండ్రీ!.

సంపుటి: 2 కీర్తన : కేశవదాసి నతి గెలిచితి నన్నిటాను
సంఖ్య : 432 పుట : 325 రాగం: సింధుభైరవి

## సింధుభైరవి

33 కేశవదాసి నైతి గెలిచితి నన్నిటాను
యీ శరీరపు నేరాలికనేల వెదక ॥ ॥ పల్లవి॥

నిచ్చలు కోరికలియ్య నీనామమే చాలు
తెచ్చి పునీతుచేయ నీతీర్థమే చాలు
పచ్చిపాపాలణచ నీ ప్రసాదమేచాలు
యెచ్చు కొందు వుపాయాలు ఇకనేల వెదక ॥ ॥కేశవ॥

ఘనుని చేయగను నీ కైంకర్యమే చాలు
మొనసి రక్షించను నీ ముద్రలే చాలు
మనిషి కావగ తిరుమణి లాంఛనమే చాలు
మెనసెను దిక్కుదెస ఇకనేల వెదక ॥ ॥కేశవ॥

నెలవైన సుఖమియ్య నీ ధ్యానమేచాలు
అల దాపుదండకు నీ యర్చనే చాలు
యిలపై శ్రీవేంకటేశ యిన్నిటా మాకు కలవు
యెలమి నితరములు యికనేల వెదక ॥ ॥కేశవ॥

**అవతారిక:**

తనని తాను కేశవునికి 'దాసి' వలె భావించుకొని అన్నమాచార్యులవారు పాడుతున్న చక్కటి కీర్తననాస్వాదించండి. స్వామీ నేను నీవే దిక్కని నమ్మిన దాసిని. నాలో లోపాలు లేవని నేరాలు లేవని నేనను. కానీ అవన్నీ నేను ఈ మానవశరీరం ధరించటం చేత దేహానికి ప్రకృతి సిద్ధమైన నేరాలు. వాటిని ఈనాడు యెంచినందువలన వుపయోగమేమి వుంటుంది? నేను నీ నామ సంకీర్తనతో బ్రతుకుతున్నాను, నీ అర్చన, దాస్యము, కైంకర్యములతో



అంతయు నీవే హరిపుండరీకాక్ష

వైష్ణవ దీక్షలో బ్రతుకుతున్నాను నాకు ఇతరములేవీ వద్దు, వద్దు, వద్దు. అంతే... అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ కేశవా! నేను నీదాసినైతిని. అందుచేత అన్నిటా (ఇహపరములు రెంటినీ) గెలిచితి (సాధించగలిగాను). నేను, నాలో లోపాలు లేవని కాని నేరాలు చేయని వాడిని అనిగాని అనలేను. కాని అవి యీ శరీరపు నేరాలు నేను మానవ శరీరధారినైనందువలన దానికి సహజమైన నేరాలు. ఇక వాటిని వెదకనేల? అయినా వాటిని యెదుర్కొనటానికి నా ప్రయత్నాలు నేనూ చేస్తున్నాను.

నేను సదా నీ నామస్మరణతోనే బ్రతుకుతాను. నా కోరికలు తీర్చుటకు అది చాలదా? నీ తీర్థమైన చోటునే వుంటాను. నన్ను నిర్మలుని చేయటానికి అది చాలదా? నేను చేసే పచ్చిపాపాలు బాహాటంగా కనిపిస్తున్న పాపకర్మలు. అణగద్రొక్కుటకు నీ ప్రసాదము చాలదా? ఎచ్చుకొందు వుపాయాలు (ఎక్కువ తక్కువ కిటుకులు) అవసరమా? అక్కర్లేదు నిన్ను నమ్మితే చాలు.

నీకైంకర్యము (శరణాగతి) చాలు నేను ఘనుడను అనిపించుకొంటాను. నీ ముద్రలు (రెండు భుజములపైన ధరించే శంఖ చక్రముద్రలు) చాలును. మొనసి (పూని) అవే నీ ఆయుధాలవలెనే నన్ను రక్షిస్తాయి. మనిషి కావగ (రక్షించి కాపాడుటకు) నేను నానొసట ధరించే నీ తిరుమని లాంఛనము (పంగనామాలు) చాలును వాటితోనే నా మార్గము వెలుగులీనుతున్నది.

ఓ ప్రభూ! నీ దాస్యము నెలవైన (సుప్రతిష్టమైన) సుఖమునిస్తుంది. అలదాపుదండకు (ఆపైన తోడు నీడై కాపాడుటకు) నేను చేసే నీ అర్చనయే చాలును. ఓ శ్రీవేంకటేశ్వరా! ఇన్నిటా (ఇన్ని విధములైన) నీసేవలు మాకు వున్నవి కదా!) ఎలమి (మా వికాసమునకు) ఇలపై అన్యములైన వుపాయముల వెదకుటెందులకు? నీవు మాకు చాలును తండ్రీ!

సంపుటి: 1 కీర్తన : నాపాలి ఘన నిధానమవు నీవే నన్ను
సంఖ్య : 108 పుట : 74 రాగం: శుద్ధ సావేరి

## శుద్ధసావేరి

34 నాపాలి ఘన నిధానమవు నీవే నన్ను
నీపాల నిడుకొంటి నీవే నీవే ॥ పల్లవి॥

ఒలసి నన్నేలే దేవుడవు నీవే యెందు
తొలగని నిజబంధుడవు నీవే
పలుసుఖమిచ్చే సంపదవు నీవే, యిట్టే
వెలయ నిన్నియును నీవే నీవే ॥నాపాలి॥

పొదిగి పాయని యాప్తుడవు నీవే, నాకు-
నదన తోడగు దేహమవు నీవే
మదమువాపెడినా మతియు నీవే, నాకు
వెదక నన్నియును నీవే నీవే ॥నాపాలి॥

యింకా లోకములకు నెప్పుడు నీవే యీ
పంకజభవాది దేవపతివి నీవే
అంకిలి వాపగ నంతకు నీవే, తిరు
వేంకటేశ్వరుడవు నీవే నీవే ॥నాపాలి॥

**అవతారిక:**

నిధానము అంటే పాతరలో దాచివుంచిన సొమ్ము. "నాయందు నిధానమువలె సమయానికి, నీపాల (పట్ల) వుంచుకొని ఆదుకొంటావు. నా దిక్కూ మొక్కూ వేరెవరున్నారు తండ్రీ! నీవే నీవే" అని ఏడుకొండలూ దిగి స్వయంగా శ్రీనివాసుడే దిగివచ్చేలా ఆలాపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఆపదలో ఆదుకునేవాడే నిజమైన బంధువు. ఆ విధంగా చూస్తే బంధువులు బండ్ల కొద్దీ వుంటారు కాని నిజబంధువు ఆ





స్వామి తప్ప యెవ్వరూ వుండరు. అంకిలి వాపగ (ఆపద తొలగించ) నంతయు నీవే నీవే అంటున్నారు. మన అదృష్టం కొద్దీ ఈ అమృతధారలో తడిసే భాగ్యం కలుగుతున్నది. అవునా?

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నాపాలి (నాకు లభించిన) గొప్ప నిధానమవు నీవే (పెద్దలు దాచివుంచిన పాతర నీవే). అందుకనే నిన్ను నాపాలన్ ఇడుకొంటి (నా పక్షాన అట్టేపెట్టుకొన్నాను). నీవే నీవే నాకు ఇంకెవ్వరూ వద్దు ప్రభూ!

ఒలసి (చేరి) నన్ను యేలునట్టి దైవము నీవే. నా బంధువులందరూ నా కష్టంలో నన్ను వదిలేశారు. కానీ నన్ను విడువని నిజమైన బంధువు నీవే. సంపదలనాసించేది సుఖమునిస్తాయని. కాని మా సంపదలు అనేక ఇబ్బందులనిస్తాయి. కాని నీవు మాత్రం అనేక సుఖములనిచ్చే సంపదవు. ఈ విధంగా ఇన్ని రకములైన భాగ్యముల నిచ్చే వాడవు నీవే నీవే.

ఆప్తుడు అంటే ఐశ్వర్యము వలె అదుకొనే సన్నిహితుడు. అయితే ఐశ్వర్యమునకుండే దుర్గుణమేమంటే అది యెప్పుడు విడిచిపెట్టి పోతుందో యెవ్వరికీ తెలియదు. కానీ ఓ శ్రీహరీ! నీవు పొదిగినట్లుగా యెన్నడూ వదలిపెట్టని ఆప్తుడవు. నేను చచ్చేదాకా నాతోడువుండే దేహములాగ నీవూ అదనతోడవు (అవసరమైన తోడువు). స్వామీ! నా మదము (అహంకారమును) బాపెడి మతియు (వివేకము) నీవే. పరికించి చూసే సర్వస్వమూ నీవే, నీవే నయ్యా!

ఇంకా చెప్పాలంటే... నాకే కాదు, ఈ లోకముల కన్నింటికీ యెప్పుడూ ఆధారము నీవే. (ఇన్ని లక్షల అంతరిక్షగాముల్లో ఒక్కటి తగిలినా మన 'భూమి' గతేమిటో చెప్పండి.) సృష్టి స్థితిలయలు పర్యవేక్షించే బ్రహ్మాదిదేవతల పతియు (యేలికవూ) నీవే. మాకు అడుగడుగునా అంకిలియే (ఆపదలే). దానిని తొలగించాలంటే ఇతరులకు సాధ్యమా? ఓ తిరువేంకటేశ్వరా! నీవేనయ్యా! నీవే సమర్థుడివి. ఇంకెవ్వరివల్లా కాదు తండ్రీ!

సంపుటి: 2 కీర్తన: తగు మునులు ఋషులు తపముల సేయగ
సంఖ్య : 315 పుట : 213 రాగం: ధన్యాసి

## ధన్యాసి

35 తగు మునులు ఋషులు తపములు సేయఁగ
గగనము మోచియుఁ గర్మము దెగదా. ॥ పల్లవి॥

ధరణీధర ముందరధర నగధర
చిరకౌస్తుభధర శ్రీధరా
కరిఁ గాచితి కాకముఁ గాచితి నీ-
కరుణకుఁ బాత్రము గలదిదియా. ॥తగు॥

భవహర మురహర భక్తిపాపహర
భువన భారహర పురహరా
కవిసినవురుతనుగద్దను మెచ్చితి-
వివల నీదయకు నివియా గురుతు. ॥తగు॥

శ్రీవేంకటపతి శేషగరుడపతి
భూవనితాపతి భూతపతి
గోవుల నేలితి కోఁతుల నేలితి
పావనపుఁగృపకుఁ బాత్రము లివియా. ॥తగు॥315

**అవతారిక:**

ముల్లోకాలలోను శ్రీహరిని వేడని వారెవరు? ఎంతోమంది ఋషులు, మునులు యెన్నెన్నో తపములు చేశారు ఆకాశాన్ని అందుకొనేంత కీర్తిని సంపాదించారు. కాని వారి కర్మములు పరిపక్వంచెంది తెగితేకాని వారికి నీ కృప కలుగదు. నీకృప వారికి యేజన్మలోనైనా యేక్షణాననైనా కలుగవచ్చును. అజ్ఞానంతో వారు నీకు అపకారం చేసినా వారు యెంత హీనస్థితిలోవున్నా పరిగెత్తి వారిని చేరి వారిని అక్కున చేర్చుకొంటావు. అన్నీ నీ అభయానికి పాత్రములే. కరిగాని, కాకిగాని, వుడతగాని, గద్దగాని, ఆవులుగాని, కోతులుగాని.. ఒక్కటనేమిటి యేదయినా నీ సంతతే, నీదే అనే కరుణ





చూపిస్తావు. అందుకే నీవు జగత్పితవు అంటున్నారు అన్నమాచార్యులవారు. సాధ్యమైనంత వివరించటానికి ప్రయత్నించాను.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! అనేకమంది ఋషులు, మునులు తగిన విధములుగా నీకోసం తపములనాచరించారు. కాని అందరికీ నీకృప కలిగిందా? ఆకాశాన్ని కొనే కీర్తి సంపాదించవచ్చు గాక! కాని కర్మము దీరక (పరిపక్వముకాక) నీకృప సిద్ధిస్తుందా?

ఓ భూరమణా! మందరగిరిధరా! నగధరా! (గోవర్ధనధారీ); ప్రఖ్యాతి చెందిన కౌస్తుభమణిని ధరించినవాడా! శ్రీధరా! (శ్రీకాంతా!) నీలీలలనేమని వర్ణించను ప్రభూ! అలనాడు కరిని రక్షించావు (గజేంద్ర వరదుడు), కాకిని రక్షించావు (కాకాసురుని శిక్షింపబూనియు శరణంటే రక్షించాడు శ్రీరాముడు). నీ కరుణకు పాత్రులవ్వాలంటే హీనాధికములైన యేదైనా అర్హమే.

ఓ భవహరా! (పుట్టుక లేక చేయగల దేవా!) మురహర! (ముర అను అసురుని నిర్జించిన దేవా!) భక్త పాపహరా, ప్రపంచమున పాపుల భారమును నివారించువాడా! పురహరా! (త్రిపురాసురులను హరించినవాడా!) నీ దయకు అర్హత యెవ్వరికైనా కలుగవచ్చును. ఆనాడు నీ రామావతారంలో, కవిసిన వుడుతకు (పరుగులు పెట్టి తన శరీరానికి ఇసుకను అంటించుకొని సేతువుపై విదిలించి సేతు నిర్మాణానికి తనదవంతు కృషి చేసిన ఒక చిన్ని ఉడుతకు మోక్షమిచ్చావు). గద్దయైన గరుత్మంతుని నీవాహనం చేసికొని గరుడ గమనుడవయ్యావు. వాటిని మెచ్చావు. అవల (ఆవిధంగా) వాటి జాతి మొత్తం ఈనాటికీ నీ గుర్తులను తమ శరీరంపై ధరించియున్నాయి.

ఓ శ్రీవేంకటాచలపతీ! శేషాద్రివాసా! గరుడాద్రివాసా! భూధరా! భూతపతీ! (సర్వ భూతముల ఆధారా!) నీ పావనమైన కృపకు పాత్రాపాత్ర భేదము లేదు. అందరికీ జీవనాధారమైన గోవులను కాచి గోవిందుడివైనట్లే, నిరుపయోగమైన కోతులకు కూడా క్రమశిక్షణ నేర్పి రామదండు చేశావు. ఎనలేని కీర్తినిచ్చావు. కరుణామూర్తీ! ఇంతకంటే యే నిరూపణలు కావాలి తండ్రీ, నీవు కరుణాంతరంగుడవు.

సంపుటి: 2 కీర్తన : ఎవ్వరుఁ గానని వాఁడు యశోద గనె నట్టె
సంఖ్య : 316 పుట : 213 రాగం: శంకరాభరణం

## శంకరాభరణం

36 ఎవ్వరుఁ గాననివాఁడు యశోద గనె నట్టె
పవ్వళించే బ్రహ్మతండ్రి బాలుఁడయ్యె నట్టె ॥ పల్లవి॥

ఘనయోగీంద్రులమతిఁ గట్టువడనట్టివాఁడు
పనిలేక రోలఁ గట్టువడినాఁడట్టె
తనియ సురలకు పాదము చూపనట్టివాఁడు
మొనసి బండిమీఁద మోపినాఁ డట్టె. ॥ఎవ్వ॥

అమృతము చేతఁ దచ్చి అందరికిచ్చినవాఁడు
తమితో వెన్న దొంగిలెఁ దానె యట్టె
గుమ్మరై దేవదానవకోటికిఁ జిక్కనివాఁడు
భ్రమసి గోపికలపాలఁ జిక్కినాఁ డట్టె. ॥ఎవ్వ॥

యిందుఁ గలఁ డిందులేఁడనెంచి చూపరానివాఁడు
అందమై రేపల్లెవాడ నాడీనట్టె
అంది కృష్ణావతారముయినట్టిదేవుఁడే
యిందున శ్రీవేంకటాద్రి యెక్కి నిలిచె నట్టె. ॥ఎవ్వ॥316

**అవతారిక:**

ఒకరోజు యశోదకు కృష్ణయ్య అల్లరి వినిపించడం లేదేమిటబ్బా! అని కొడుకును రహస్యంగా చూద్దామని మెల్లిగా నక్కి చూసిందట. అక్కడ పడుకొన్నది ఆవిడ కొడుకా? ఆయన, పరమేష్ఠితండ్రి, ఆదినారాయణుడు. కొంచెం తెరుచుకొనియున్న ఆస్వామినోట్లోంచి లోకాలన్నీ కనిపిస్తున్నాయట. దిమ్మతిరిగి పోయిందావిడకి. ఆయన ఎవ్వరూచూడలేని శ్రీమన్నారాయణుడు. భయంతో చేతులు జోడించిందా గొల్లది. చటుక్కున లేచి "అమ్మా"! అన్నాడు.





అంతా కలలాగా మరచిపోయింది ఆ వెఱ్ఱితల్లి. అన్నమాచార్యులవారి ఈ అద్వితీయ కీర్తనకి ఈ పిట్టకథే మూలభూతి. దీనిని భావించి తరించండి.

**భావ వివరణ:**

ఆహా! ఏమి ఈ యశోద భాగ్యము! ఎవ్వరూ గాననివాడు (అగోచరుడై యెవ్వరికీ కనుపించని పరమాత్మ) ఈమె పొత్తిళ్ళలో పవ్వళించినాడే!! ఈ దేవదేవుడే, పితామహుడైన బ్రహ్మకే కన్నతండ్రియా? అట్టె (అతిసులువుగా) బాలుడయ్యెను. ఏమి ఆశ్చర్యము.

ఘనులైన యోగీశ్వరుల మదిలోకూడా కట్టుబడనివాడు, ఓహో! ఈనాడు రేపల్లెలో ఒక పనిలేని రోటికి కట్టబడినాడే!! సుకుమారమైన ఆయన పాదములెలావుంటాయో చూడాలని తహతహలాడే దేవతలకు తన అరిపాదములను చూపనట్టిదేవుడు ఈరోజు రేపల్లెలో ఒక కొయ్య బండికి చూపించి సూటిగా తన్నాడే!! ఏమి ఆ శకటాసురుని అదృష్టము!!

అమృతము కొరకై క్షీరసాగరమును చిలికించి, నిస్వార్థంగా దేవతలందరికీ పంచిపెట్టించిన పురుషోత్తముడు, తానే తమితో (ఆసక్తితో) గోపికల ఇండ్లలో వెన్నదొంగిలించుచున్నాడే!! గుమ్మరై (గుమిగూడిన) దేవదానవ కోట్లకు కూడా చిక్కని శ్రీమన్నారాయణుడు, నేడు బృందావనమున గొల్లభామలకు భ్రమకలిగినవానిలా చిక్కినాడే!! ఏమివింత!

ఇందుగలడు, ఇందులేడు అని ఇదమిద్ధంగా యెంచి చూపశక్యముకాని సర్వాంతర్యామి ఈ రేపల్లెవాడలలో యెంత అందముగా ఆడుచున్నాడో చూడండి. ఆనాడు (ద్వాపరయుగమున) కృష్ణావతారమునంది పైలీలలన్నీ చేసినట్లే నేటి కలియుగంలో, యిందున (ఈ తిరుమలలో) శ్రీవేంకటాద్రి నెక్కి శ్రీవేంకటేశ్వరుడై నిలిచియున్నాడే!! ధన్యోస్మి తండ్రీ!

సంపుటి: 2 కీర్తన : అభయదాయకుడ వదెనీవే గతి

సంఖ్య : 420 పుట : 283 రాగం: బౌళిరామక్రియ

## బౌళిరామక్రియ

37 అభయదాయకుఁడ వదె నీవే గతి
యిభరక్షక నను నిపుడు గావవే ॥ పల్లవి॥

భయహర దైతేయభంజన కేశవ
జయ జయ నృసింహ సర్వేశ్వరా
నియతము మాకిదె నీపాదములే గతి
క్రియగా మమ్మేలి కింక లుడుపవే. ॥అభ॥

బంధవిమోచన పాపవినాశన
సింధురవరదా శ్రితరక్ష
కంధరవర్ణుఁడ గతి నీనామమె
అంధకారముల నణఁచి మనుపవే. ॥అభ॥

దైవశిఖామణి తతచక్రాయుధ
శ్రీవేంకటగిరి శ్రీరమణా
సావధాన నీశరణ్యమే గతి
వేవేలకు నావిన్నప మిదియే. ॥అభ॥420

**అవతారిక:**

శ్రీమన్నారాయణునిపై శ్రావ్యమైన కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. సర్వులకు అభయప్రదాతవైన ఓ గజేంద్రవరదా! నీవే నాకు దిక్కు. ఇప్పుడు నన్ను రక్షించరాదా స్వామీ! అని వేడుకొంటున్నారు. “కింకలుడపవే” – అంటే కినుకదూరం చేయవయ్యా అని అర్థం. కోపము అనే





వ్యాధిని పోగొట్టమని భావన. కంధరవర్ణుడు అంటే నీలమేఘశ్యాముడని అర్థం. తతచక్రాయుధము అంటే వ్యాపించే స్వభావంగల సుదర్శన చక్రం ఆయుధముగాగలవాడని అర్థం. ఇట్లా అడుగడుగునా అర్థాలు తెలియని మధురమైన కీర్తన ఇది. సావధానుడు – అంటే యేమిటో వూహించండి.

**భావ వివరణ:**

ఓ ఇభరక్షకా! (గజేంద్రవరదా!) ఇపుడు నన్ను రక్షించగా నీవే దిక్కు. నీవు అభయప్రదాతవు. దీనజనోద్ధారకుడవు. నన్ను కాపాడుము తండ్రీ! ఓ భయహరా! నీవు దైతేయభంజనుడవు (అసురాంతకుడవు); కేశియను రాక్షసాంతకుడవు. సర్వేశ్వరుడవైన ఓ నృసింహా! జయము జయము. మీకు ఇదే నియతము (నియమము). నీచరణములే గతి. క్రియగా (అదేపనిగా) మమ్ము పరిపాలించి మా కింకలుడపవే (మానవులమైన మాకుండే దుర్గుణమైన కోపమును నిర్మూలింపుము ప్రభూ! తన కోపమె తన శత్రువన్నారు కదా!

భవ బంధములను సడలించు పాపవినాశనా! నీవు సింధురవరదుడవు (గజేంద్రవరదుడవు) శ్రీతరక్షకుడవు (ఆశ్రయించినవారిని రక్షించే వాడవు). కంధరవర్ణుడవు (నీమేఘశ్యాముడవు). ఓదేవదేవా! అట్టి నీనామమే మాగతి మా అజ్ఞానాంధకారమును అణచి మనుపవే (రక్షించవయ్యా!)

ఓ దైవశిఖామణీ! తతచక్రాయుధ (వ్యాపించు శక్తిగల చక్రాయుధా!) శ్రీవేంకటేశ్వరా! సావధానుడవైన (హెచ్చరికతోవుండె) నీ శరణ్యమే మాగతి. వేవేల విధములైన నా విన్నపములు ఇవియే ప్రభూ!

సంపుటి: 3 కీర్తన : హరి కృష్ణ మేలుకొను ఆదిపురుషా
సంఖ్య : 543 పుట : 365 రాగం: భూపాళం

**భూపాళం**

38 హరి కృష్ణ మేలుకొను ఆదిపురుషా
తరవాత నా మోము తప్పకిటు చూడు. ॥ పల్లవి॥

మేలుకొను నాయన్న మెల్లనే నీతోడి
బాలులదె పిలిచేరు బడి నాడను
చాలు నిఁక నిద్దురలు చద్దికూళ్ళపొద్దు-
వేళాయ నాతండ్రి వేగ లేవే, ॥హరి॥

కను దెరవు నాతండ్రి కమలాప్తుఁ డుదయించె
వనిత మొకమజ్జనము వడిఁ దెచ్చెను
మొనసి మీతండ్రి యిదె ముద్దాడఁ జెలఁగీని
దనుజాంతకుండ యిఁకఁ దగ మేలుకోవే. ॥హరి॥

లేవె నాతండ్రి నీలీలలటు వొగడేరు
శ్రీ వేంకటాద్రిపతి శ్రీరమణుఁడా
దేవతలు మునులుఁ జెందిననారదాదులు
ఆవలనుఁ బాడేరు ఆకసమునందు. ॥హరి॥543

**అవతారిక:**

మధురాతి మధురమైన మేలుకొలుపు కీర్తన నాస్వాదించి తరించండి. అన్నమాచార్యులవారి ఋణం తీరదని అనిపిస్తున్నది కదా! నా తండ్రి మేలుకోరా నా అన్న మేలుకో అని యెన్నిసార్లు బ్రతిమిలాడుతున్నారో చూడండి. జన్మకి ఇట్లాంటికీర్తన ఒక్కటి చాలదా? కొసమెఱుపు యేమిటంటే "వనిత మొకమజ్జనము వడిదెచ్చెను" అనే చరణం నందగోపుడు రేపల్లె గొల్లవారికి యేలిక కదా! వాళ్ళ పనిమనిషి వాళ్ళ





అబ్బాయి పళ్ళుతోముకోవడానికి గోరువెచ్చని నీళ్ళు తెచ్చి సిద్ధంగా వున్నదట. మొకమజ్జనము అంటే ముఖమును నీళ్ళతో కడుగుకొనుట.

**భావ వివరణ:**

ఓ ఆదిపురుషా! హరీ! కృష్ణా 'మేలుకో నాన్నా! తరువాత తప్పకుండా నా మోము (ముఖమును) ఇటుచూడు. (నా మాట విను తండ్రీ!)

నా యన్న మేలుకొనరా! బడినాడను (నీతో కూడి ఆడుకొందామని) అదే నీతోడి బాలలు మెల్లనే (మన వసారాలో) నిలుచుని నిన్ను పిలిచేరు. లే తండ్రీ! ఇక నిద్దురలు చాలును కన్నా! చద్దికూళ్ళ పొద్దువేళాయె (చద్ది యన్నం తినే వేళయింది నాన్నా!) నా తండ్రీ! వేగ లేవే (తొందరగా లేచిరావయ్యా!)

అదిగోచూడు... కమలాప్తుడుదయించె (కమలబాంధవుడైన సూర్యభగవానుడు ఉదయించినాడు) నా తండ్రీ! కన్నులు తెరువమయ్యా! మొకమజ్జనకు (నీ ముఖము కడుగుకొనుటకు నీళ్ళను) వనిత (పనిపిల్ల) వడి దెచ్చెను (శ్రీఘ్రముగా తీసికొచ్చింది). ఇవే నీతండ్రి నందగోపుడు, మొనసి (పూనుకొని) చెలగి ముద్దాడ (గబగబా ముద్దులు పెట్టుకొందామని) యెదురు చూస్తున్నాడయ్యా! ఓ దనుజాంతకా! (పూతన వంటి రాక్షసులను అంతమొందించినవాడా!) ఇక మేలుకోవయ్యా!

నా తండ్రీ! నీవు చేసిన నీ లీలలన్నింటినీ వొగడేరు (పొగడుచున్నారయ్యా!) లేవె (లేచిరావయ్యా!) ఇప్పుడు నీవు ఈ తిరుమల వేంకటకృష్ణయ్యవు, శ్రీదేవీ వల్లభుడవు. అదిగో చూడవయ్యా! ఆవలను (నీవాకిటి బయట) దేవతలు, మునులు, నారదాది భక్తులు సుప్రభాతమును పాడుచున్నారు. ఆకాశములో యెంత గుంపువున్నదో చూడు తండ్రీ! ఇంతమందికి నీ దర్శనం కావాలంటే యెంత సమయం పడుతుంది? లే నాన్నా!

సంపుటి: 3 కీర్తన : సీతాసమేత రామ శ్రీరామ
సంఖ్య : 516 పుట : 347 రాగం: సాళంగనాట

## సాళంగనాట

39 సీతాసమేత రామ శ్రీరామ
రాతి నాతిఁజేసిన శ్రీరామ రామ. ॥ పల్లవి॥

ఆదిత్యకులమునందు నవతరించినరామ
కోదండభంజన రఘుకులరామ
ఆదరించి విశ్వామిత్రుయాగము గాచినరామ
వేదవేదాంతములలో వెలసినరామ. ॥సీతా॥

బలిమి సుగ్రీవునిపాలినిధానమ రామ
యిల మునుల కభయమిచ్చినరామ
జలధి నమ్ము మొనను సాధించినరామ
అలరు రావణదర్పహరణ రామ. ॥సీతా॥

లాలించి విభీషణుని లంకయేలించినరామ
చాలి శరణాగతరక్షక రామ
మేలిమి శ్రీవేంకటాద్రిమీఁద వెలసినరామ
తాలిమితో వెలయు ప్రతాపపురామ. ॥సీతా॥516

**అవతారిక:**

శ్రీరామచంద్రమూర్తిపై చక్కటి భజననందిస్తున్న అన్నమాచార్యులవారి ఈ కీర్తన నాస్వాదించండి. బహు సులభమైన దీనిలో ఒకే ఒక్క మెలిక 'ఆదరించి విశ్వామిత్రుయాగము గాచిన రామా' అనే చోట వున్నది. ఇక్కడ ఆదరించడం అంటే సమున్నతమైన గౌరవం అన్నమాట. శ్రీరాముడు పరమాత్మే కదా! ఆయనకి తెలియనిదొక్కటీ వుండదు. అయినా ఏమీ తెలియని అమాయకుడిలా విశ్వామిత్రునికి గురుస్థానం ఇచ్చి ఆయన చెప్పినదంతావిని ఆయన





యాగరక్షణ చేసి 'రాముడు మంచి బాలుడు' అనిపించుకొన్నాడు. ఇది బహుశా వావిలిపాడు వీరరాఘవునిపై చెప్పిన కీర్తన కావచ్చును.

**భావ వివరణ:**

సీతాసమేతుడవు (సీతాదేవితో ఒకే సింహాసనమును అధిష్టించియున్న) రాముడవు అయిన శ్రీరామా! శిలవలె అచేతనస్థితిలోవున్న నాతి అహల్యకు చేతనత్వము ప్రసాదించిన రామచంద్రమూర్తివి నీవే.

ఓ శ్రీరామా? నీవు ఆదిత్య కులమున (సూర్యవంశమున) అవతరించినవాడవు; కోదండ భంజనుడవు (శివ ధనస్సును విరిచిన రఘురాముడవు). విశ్వామిత్రునకు నీ గురుస్థానమును ప్రసాదించి, వినయశీలివైన శిష్యుడవై అనేక అస్త్రములను విద్యలను స్వీకరించి ఆయన యాగరక్షణ నెపమున దానవ దమనకు పునాది వేసితివి. వేదవేదాంతముల మూలపురుషుడవైన తారకరాముడవుగా వెలసిన శ్రీరామబ్రహ్మం నీవే.

ఓ శ్రీరామా! అలనాడు నీ బలమేమిటో సుగ్రీవుని కన్నులకు కట్టించి వానిని తిరిగి నిలబెట్టినవానిపాలి నిధానమవు (ఐశ్వర్యమైతివి); రాక్షసులచే వేధించబడుచున్న మునులకు జనస్థానమున అభయమిచ్చి రాక్షసుల పీడ తొలగించితివి. సేతువును నిర్మించదలచి నయమున నీకు లొంగని సాగరుని అమ్ము మొనకుదెచ్చి వానిని సాధించితివి. దర్పముతో (గర్వముతో) కన్నుమిన్ను గానని రావణుని గర్వమును హరించిన రామభద్రుడవైతివి.

అన్న మరణమునకు తానే కారణమని రోదించుచున్న విభీషణుని ఓదార్చి లంకకు యేలికను చేసితివి. కావలసినవారికి కావలసినంత శరణ్యమునొసగి రక్షించితివి. నేడు బంగారు శిఖరముల బోలిన తిరుమల శిఖరములపై శ్రీవేంకటేశ్వరుడవై చేరితివి. నీవే తాలిమితో (అనుపమ క్షమను ప్రదర్శించు) ప్రతాపపు రాముడవై (వీరరాఘవుడవై) వెలసితివి. నీవే రాజారాముడవు తండ్రీ!

సంపుటి: 3 కీర్తన : వేదవట్టి యిక నేమి వెదకేరు చదివేరు
సంఖ్య : 535 పుట : 359 రాగం: సాళంగనాట

## సాళంగనాట

40 వేదవట్టి యిఁక నేమి వెదకేరు చదివేరు
వేదాంతవేద్యుఁడైన విష్ణుని నెఱఁగరా. ॥ పల్లవి॥

తోలె నదె గరుడనిఁ దొడఁగి బాణునిమీఁద
వాలెను కంసునిమీఁద వడి నెగసి
కేలుచాఁచి చక్రమునఁ గెడపె శిశుపాలు
వేలుపుల రాయఁడైన విష్ణుని నెఱఁగరా. ॥వేద॥

తొక్కెను బలీంద్రునిఁ దొల్లి పాతాళానఁ గుంగ
మొక్కలాన జల ధమ్ము మొనకుఁ దెచ్చె
పక్కన బ్రహ్మాండము పగులించెఁ బెనువేల
వెక్కసపుదైవమైన విష్ణుని నెఱఁగరా. ॥వేద॥

భేదించె రావణాదిభీకరదైత్యులనెల్ల
నాదించె శంఖమున నున్నతజయము
సేదదేర నిపుడును శ్రీవేంకటాద్రిమీఁద
వీది వీది మెరసేటి విష్ణుని నెఱఁగరా. ॥వేద॥535

**అవతారిక:**

"వేదవట్టు" అంటే వేద ప్రవచనము చేయటం. ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు వేదము తెలిసిన పండితులతో అంటున్నారు 'ఇంకా యేమి వేదప్రవచనాలు చేస్తారు? యేమి వెదుకుతారు? యేమేమి చదువుతారయ్యా! మీకీ మాత్రం తెలియదా? వేదాంత వేద్యుడు విష్ణువుగాక వేరెవరున్నారు?'. ఈ కీర్తనలో జలధమ్ము అంటే 'జలధియమ్ము' అని భావించాలి. పెనువేలు అంటే బొటనవ్రేలని అర్థం.





అనంతకోటి బ్రహ్మాండాలను తన బొటన వేలికింద నొక్కివేయగలడట ఈ విశ్వరూపుడు మరేమనుకొన్నారు?

**భావ వివరణ:**

ఓ అయ్యలారా! యిక వేదవట్టి (వేదప్రవచనములు చేసి) యేమి వెదకెదరయ్యా! యేమి చదివేరు? వేదాంతము ద్వారా, వేద్యుడు (తెలియదగినవాడు) యెవరు? విష్ణువే కదా! ఈ సంగతినెరుగరా? ఏమి వింత!!

మీరు ఆయన కృష్ణావతారం గురించి వినలేదా? ఆ శ్రీకృష్ణుడు అదె గరుత్మంతునిపైనెక్కి తోలె (వెడలినాడు). బాణాసురనెదుర్కొని చిత్తుచేశాడు. వడి (వేగముగా) కంసునిపై నెగసి (దండెత్తి) వాలెను (మీదపడ్డాడు). కేలుచాచి (చేయిచాచి) చక్రాయుధాన్ని అందుకొని శిశుపాలుని కెడపె (పడవేసెను). అట్టి లీలలు చేసిన వేలుపులరాయుడు (దైవశిఖామణి) యైన విష్ణువునెరుగరా? ఏమి ఆశ్చర్యము!

ఈయన తొల్లి (కృతయుగంలో) బలీంద్రుని (బలి అను దానవేంద్రుని) పాతాళమునకు క్రుంగునట్లు తలపై కాలుంచి త్రొక్కెను. ఈయన త్రేతాయుగములో మొక్కలాన (శౌర్యముతో) జలధిని (సాగరమును) అమ్ముమొనకు దెచ్చే (బాణముయొక్క మొనకు) తెచ్చి శరణాగతుని చేసెను. పక్కన భవిష్యత్తులో ఈయన తన పెనువేల (బ్రొటనవేలితో) బ్రహ్మాండమునే పగులించె బ్రద్దలు కొడతాడు. ఓ అయ్యలారా! వెక్కసపు దైవమైన (సర్వాధికుడైన దేవుడు) విష్ణువునెరుగరా?

ఈయనే శ్రీరాముడై రావణుడు మొదలైన భయంకర దైత్యులను సంహరించాడు. తన పాంచజన్యశంఖమును వున్నతముగ పూరించి జయధ్వానములు చేసెను. యుగయుగాలలో ఇవన్నీ చేసి అలసిన శ్రీమహావిష్ణువు ఈ కలియుగంలో సేదతీరుటకు (విశ్రాంతికి) శ్రీవేంకటాద్రిమీద శ్రీ వేంకటేశ్వరుడై నిలిచినాడు. అదిగో తిరు వీధులలో మెరసేటి (కాంతులు వెదజల్లుతున్న) ఈ విష్ణుదేవుని ఎరుగరా? ఏమి విచిత్రం!!

సంపుటి: 3 కీర్తన : దేవనీపక్షపాతమో తిరిగేలోకులవెల్తో
సంఖ్య : 422 పుట : 284 రాగం: నారాయణి

**నారాయణి**

41 దేవ నీపక్షపాతమో తిరిగేలోకులవెల్తో
శ్రీవిభుఁడ నీవేకాదా చిత్తములోనయ్యా. ॥ పల్లవి॥

దివములు సరియే దినరాత్రులును సరే
యివల సుఖదు:ఖాలు హెచ్చుకుందులేలయ్యా
భవములు సరియే ప్రాణములు సరియే
భువిఁ బుణ్యపాపముల భోగము వేరేలయ్యా. ॥దేవ॥

విని కిందరి కొకటే విషయాలు నొకరీతే
మునిఁగేటిజాతిభేదములివేలయ్యా
అనయముఁ జూపొక్కటే ఆఁకలియు నొకటే
పెనఁగేటిగుణముల పెక్కు జాడ లేలయ్యా. ॥దేవ॥

అంతరాత్మ నీవొక్కడ వన్నిటా శ్రీవేంకటేశ
చింతలు వేవేలైన సిలుగేలయ్యా
యింక సేసీ నీమాయ లిందుకే నీశరణంటే
కాంతుఁడ న న్నిందుకే కాచితివి నేఁడయ్యా. ॥దేవ॥422

**అవతారిక:**

అన్నమాచార్యులవారి కీర్తనలలో పల్లవి చాల చిక్కులు తెచ్చిపెడుతుంటుంది. "ఓ దేవదేవా! శ్రీకాంతుడా! పైకి చూడటానికి జరిగేవన్నీ నీకు పక్షపాత బుద్ధి వున్నదా అనే భ్రమ కలిగిస్తాయి. లేకపోతే అనుక్షణం భ్రమల లోనే వుండే ఈ లోకులలోని 'వెల్తి' (తక్కువ భాగ్యమో, యెక్కువ భాగ్యమో) యెందుకు కలుగుతున్నాయి? మరి మా అందరి చిత్తములో అంతర్యామివి నీవొక్కడివే అయితే ఈ హెచ్చుతగ్గులెందుకు వస్తున్నాయి?" మా శారీరక ధర్మాలు ఒక్కటే శారీర దారుఢ్యాలు వేరు,





వినేది ఒకటే అర్థమయ్యేది వేర్వేరు, ఆకలి వొకటే అరుగుదల వేర్వేరు. ఒకడిది మంచి గుణం ఒకడిది చెడ్డగుణం యెందుకిలా? యేమిటి నీ మాయ?

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీ పక్షపాత వైఖరియో లేక తిరిగేలోకుల వెల్తియో (భ్రమలకు లోనయ్యే లోకుల యొక్క భాగ్యప్రాప్తిలోని విభేదమో) తెలియకుండా వున్నది. మా అందరి చిత్తములో అంతర్యామిగా నీవే వుండగా ఓ శ్రీవిభుడా! ఇలా యెందుకు ఒకరు గొప్ప ఒకరు తక్కువ అవుతున్నారు?

దేవా! ప్రపంచంలో మానవులందరికీ రేయింబవళ్ళు ఒక్కలాగే వుంటాయి కదా? మరి వారి సుఖదు:ఖాలు ఒకేలా యెందుకుండటంలేదు? హెచ్చుతగ్గులెందుకు? అన్ని జీవుల భవము (పుట్టుక) ప్రాణములు ఒక్కటే కదా? మరి లోకంలో పాపపుణ్యములనుభవించడంలో తేడా యెందుకు వస్తున్నది?

ప్రభూ! అందరి వినికి (వినేశక్తి) ఒక్కటే... విషయాలు (విషయములపై ఆసక్తీ) ఒక్కటే, మరి, మునిగేటి (అంతులేని) జాతిభేదము యెందుకు కలుగుతున్నది. అనయము (నిరంతరం) మన చూచే శక్తి ఒక్కటే... ఆకలిదప్పులూ ఒక్కటే కాని మనలో పెనవేసుకొన్న గుణాలలో తేడాలన్నీ యెందుకు వుంటున్నవి?

ఓ శ్రీవేంకటేశ్వరా! మా అందరిలోనూ అంతర్యామిగా చరించేది నీవొక్కడివే, మరి మాకు వేర్వేరు చింతలు, వేర్వేరు చిలుగులు (ఉపద్రవములు) యెందుకు కలుగుతున్నాయి? ఏమిటి నామాయ? ఏమిటీ విచిత్రం? అందుకే నీకు శరణు అంటున్నాను. ఓ అయ్యా! అందుకే నీవు నన్ను నిరంతరం కాపాడుతున్నావు తండ్రీ!

సంపుటి: 3 కీర్తన : ఒకరిగానగ నొడబడదు మనసు
సంఖ్య : 534 పుట : 359 రాగం: సాళంగనాట

**సాళంగనాట**

42 ఒకరిఁ గానఁగ నొడఁబడదు మనసు
సకలముహరియని సరిఁదోఁచీని. ॥ పల్లవి॥

అంతరాత్మ శ్రీహరి యతఁ డొకఁడే
జంతువులన్నియు సమములే
బంతులఁ బాత్రాపాత్రము వెదకిన
అంతట హరిదాస్యమేపో ఘనము. ॥ఒక॥

జగమును నొకటే చైతన్య మొకటే
తగినపంచభూతము లొకటే
నగుతా నెదిరిని నన్నును నెంచిన
మొగి నాపై హరిముద్రలె ఘనము. ॥ఒక॥

కారు స్వతంత్రులు కడపట నొకరును
యీరీతి నౌఁగాము లిఁక నేలా
శ్రీరమణీపతి శ్రీవేంకటేశుఁడే
కారణము శరణాగతియే ఘనము. ॥ఒక॥534

**అవతారిక:**

హరిహరుల మధ్య అంతరం యెలా సాధ్యం? రెండూ పరమాత్మ రూపాలే. రక్షణ భారం హరిదైతే లయం చేసే బాధ్యత హరుడిది. ఇది పురాణాలు నొక్కి వక్కాణిస్తున్నా, కొందరు అజ్ఞానులు హరిహరదూషణ చేసి పాపం మూట కట్టుకుంటున్నారు. జగమున నున్నది చైతన్యమొక్కటే అని హితబోధ జేస్తున్న అన్నమాచార్యులవారిని ఆలకించండి. 'సకలము హరిమయమని సరిదోచీని' అంటున్నారు. ఈసృష్టిలో ఆపరాత్పరుడు తప్ప యెవ్వరూ స్వతంత్రులు కారు. అందరూ ఆయన ఆజ్ఞానువర్తనులే. ఇక ఔగాములేల అంటున్నారు. అంటే





మేలుచేసేదెవడు? కీడుచేసేదెవడు అన్నీ ఆ నామాలవాడే, మనిషి మానవత్వంలేకపోతే జంతువే కదా! రెండుకాళ్ళ జంతువు.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! నా మనస్సు ఒకరిన్ (వేరే ఇంకొకరిని) కానగ (దర్శించుటకు) ఒడబడదు (అంగీకరించదు). నాకు సకలము హరియని సరిదోచీని (సరిగా అనిపిస్తున్నది). అయినా సత్యమేమిటో వినండి.

మన అందరిలో అంతరాత్మ రూపంలో వున్న శ్రీహరి ఒక్కడే. జంతువులు అన్నియూ సమానమే. మనస్సు అనేది ఒకటి వుండుటచేత మనిషి మేలైన జంతువయ్యాడు. తన మనస్సులో శ్రీహరిని నిలపగలిగితే పాత్రత (యోగ్యత) కలుగుతుంది. లేకపోతే వాడూ యోగ్యతలేని ద్విపాదపశువే కదా! వంతుల (పంతముతో) వెదకితే అపాత్రుడైన ద్విపాదపశువును పాత్రుడైన ఘనుని చేయగలిగిన దేమిటి? హరిదాస్యమే..పో. (కేవలం శ్రీహరిదాసునిగా జీవించటమే).

ఈ జగత్తంతా ఒక్కటే. ఇందులో వుండే చైతన్యము (కదిలేశక్తి) కూడా ఒక్కటే. పంచభూతములు (భూమి, నీరు, కాంతి, గాలి మరియు ఆకాశము) ఏదో ఒక రూపంలో ప్రతిదాంట్లో వున్నాయి. వుండాలి కూడా. కాబట్టి అవి కూడా ఒక్కటే. మరి అటువంటి పాంచభౌతిక శరీరధారినైన నన్ను ఘనుని చేసిందెవరు? నాపైన వున్న ఈ హరిముద్రలే (శంఖ చక్ర ముద్రలు, తిరునామము). నగుతా (నవ్వుతూ) యెదురుగా అవి లేకుంటే నాలో లెక్కించుటకు ఇంకా యేమున్నది?

ఒకసారి ఆలోచించండి. మనం కావాలనుకొని పుట్టామా? కావలసినప్పుడు కావలసినచోట కావలసిన విధంగా చావగలమా? కడపట (చివరికి) ఒక్కడికైనా ఆ స్వాతంత్రం (ఛాయిస్) వున్నదా? మరి ఇంతోటి దానికి "ఔగాము" లేల? (మేలైనదేమిటి కీడైనదేమిటి?) మనకి మేలు జరిగినా హరివల్లనే, కీడు జరిగినా హరివల్లనే. అన్నిటికీ కారణం శ్రీపతియైన వేంకటేశ్వరుడే. మరి అలాంటప్పుడు ఈ పగయెందుకు? ద్వేషమెందుకు? ఆయనను శరణంటే అదే ఘనము కదా!

సంపుటి: 4 కీర్తన : ఈడనిందరికి నేలికైవున్నాడు
సంఖ్య : 289 పుట : 194 రాగం: శుద్ధవసంతం

## శుద్ధవసంతం

43 ఈడ నిందరికి నేలికై వున్నాఁడు
వాడల రేపల్లె వాఁడా వీఁడు ॥ పల్లవి॥

భారపువుట్లపాలుఁ బెరుగులు
వారలు వట్టినవాఁడా వీఁడు
కోరి గొల్లెతల కొలనిలోపల
చీరలు దీసిన శిశువా వీఁడు ॥ఈడు॥

ఆవులఁ బేయల నందరియిండ్ల
వావిరిఁ గాచిన వాఁడా వీఁడు
వావు లొక్కటిగా వనితలఁ గూడి
వేవేలు నేర్చిన విటుఁడా వీఁడు ॥ఈడు॥

అరుదై శ్రీవేంకటాద్రిమీఁద నుండి
వరము లిచ్చేటి వాఁడా వీఁడు
మరిగెనలమేల్మంగతో మమ్మేలె
సరసుఁడై వుండే జాణా వీఁడు ॥ఈడు॥

**అవతారిక:**

ఈ తిరుమలలో అందరికీ యేలికయైవున్న ఈ భగవానుడూ అలనాడు రేపల్లె వాడలలో అల్లరి కిట్టయ్య ఒక్కరేనా? వాడా వీడు!! అని ఆశ్చర్యపోతున్నారు అన్నమాచార్యులవారు. అలవాటు ప్రకారం (రామకథ - కృష్ణ కథ- దశావతారాల కథ చెప్పటం ఆయన మానుకోలేని అలవాటు) కృష్ణ లీలలు గానం చేస్తున్నారు. ఆ రేపల్లె చిత్‌చోరుడే ఈ





అలమేల్మంగపతి కూడా. అవునా? ఆ జాణా వీడు... అంటున్నారు. ఎన్నిసార్లు పాడినా తనివి తీరని కృష్ణగానామృతం వినండి.

**భావ వివరణ:**

ఈడు ఇందరికి యేలిక (ప్రభువై) వున్నాడే. ఆనాడు వాడల రేపల్లె వీధులలో తిరిగిన వాడే (ఆ గొల్లపిల్లవాడే), వీడా? అదెలా సాధ్యం?

భారపువుట్ల మీద (బరువైన వుట్లలో వున్న) పాలు పెరుగులు వారలు వట్టినవాడు (ధారలుగా కార్పించి యేడిపించిన ఆ కొంటె కోణంగియేనా) వీడు (ఈ శ్రీవేంకటేశ్వరడు), ఏమిచిత్రం!! కోరి కావలెనని (పొరబాటున కాదు) గోపికల చీరెలను కొలను గట్టున దీసి దాచి వాళ్ళ మానం మంట గలిపిన శిశువు గుర్తున్నాడా? వాడా వీడు!!

బ్రహ్మదేవుడు రేపల్లెలోని ఆవులను పెయ్యలను గోపాలురను మాయంచేస్తే తానే అవన్నీ అయిపోయి రేపల్లెలో ఒక్కరికీ తెలియకుండా నడిపి బ్రహ్మకు బుద్ధివచ్చేట్లు చేసినది ఇతడేనా? ఆ తరువాత ఆ పరమేష్టిని మన్నించి వావిరిగాచిన (ఉత్కృష్టుడై రక్షించిన)వాడా, వీడు (ఈ శ్రీనివాసుడు). వావులొక్కటిగా (వావీవరుసా లేకుండా) తల్లీకూతుళ్ళిద్దరినీ తన ప్రియురాండ్రను చేసికొన్న, వేవేలు నేర్చిన (అనేక రతిమర్మాలు నేర్చిన) ఆ విటుడా, వీడు (ఈ వేంకటరమణుడు) ఆహా!!

అరుదైన శ్రీవేంకటాద్రిమీద కొలువై వుండి అనేక వరములొసగే ఆ శ్రీవేంకటేశ్వరుడు వీడా (ఈ శ్రీకృష్ణుడా), వీడేనా? మరిగే (అనురాగంతో తలమునకలయ్యే) అలమేల్మంగతో మమ్ము యేలునట్టి సరసుడై వుండే ఆ జాణా (జగజ్జెట్టియా) వీడు (ఈ శ్రీకృష్ణుడు)?

సంపుటి: 1 కీర్తన : అంగనలాల మనచే నాడించుకొనెగాని
సంఖ్య : 454 పుట : 304 రాగం: శంకరాభరణం

## శంకరాభరణం

44 అంగనలాల మనచే నాడించుకొనెఁ గాని
సంగతెఱిఁగిన నెరజాణఁ డితఁడే ॥ పల్లవి॥

వొడలులేనివాని కొక్కఁడే తండ్రాయఁ గాని
తడయక పురుషోత్తముఁ డితఁడే
బడబాగ్నిజలధికిఁ బాయ కల్లుఁడాయఁ గాని
వెడలించె నమృతము విష్ణుఁ డితఁడే ॥అంగ॥

పులిగూడు దిన్నవాని పొందొక్కటే సేసెఁగాని
నలువంక లక్ష్మీనాథుఁ డితఁడే
చలికిఁ గోవరివానిసరుస బావాయఁ గాని
పలుదేవతల కెల్ల ప్రాణబంధుఁ డితఁడే ॥అంగ॥

యెక్కడో గొల్లసతుల కింటిమగఁ డాయఁ గాని
తక్కక వెదకే పరతత్వ మితఁడే
మిక్కిలి శ్రీవేంకటాద్రిమీఁద మమ్ము నేలెఁ గాని
తక్కక వేదముచెప్పే దైవ మీతఁడే. ॥అంగ॥

**అవతారిక:**

"ఓ అంగనలారా! ఈ పిల్లాడు ఇట్లా మనచేత ఆడింపబడుతున్నాడు కాని అసలు సంగతి తెలుసుకొంటే ఇతడే గొప్ప నెరజాణమ్మా!" అని ఆలాపిస్తున్నారు మన అన్నమాచార్యులవారు. ఇందులో వున్న ప్రహేళికలు (చిక్కు ప్రశ్నలు) జాగ్రత్తగా సమాధానాలు ఆలోచించి భావవివరణతో సరిజూసుకోండి. ఇదొక 'క్విజ్ ప్రోగ్రాం' అన్నమాట. తినబోయేముందు ఇది రుచి చూడండి... పులిగూడు దిన్నవాడెవడు? వాని పొందొక్కటేసేనుగాని..





అంటే యేమిటి? ఆలోచించండి. ఎక్కడో గొల్లసతులకు ఇంటిమగడయ్యిందెవరు? చలికిఁ గోవరివాడెవడు? అనుకున్నంత తేలికకాదు అని తెలుసుకోండి, మరి.

**భావ వివరణ:**

ఓ అంగనలారా (రమణుల్లారా!) ఈనాడు ఈయన మన చేత ఆడించబడుతున్నాడు. కాని, సంగతెరిగిన (అసలు విషయం తెలుసుకొంటే) ఇతడే గొప్ప నెరజాణ (అన్నీ తెలిసిన చతురుడు).

ఒడలు లేనివానికి (శరీరం లేనివాడికి) ఒక్కడే, తండ్రియైన వాడు (ఎవరు? (మన్మథుని తండ్రియైన శ్రీహరి). తడయక ఆలస్యములేక రక్షించే పురుషోత్తముడు కూడా ఇతడే. బడబాగ్నిని తనలో దాచుకున్న సముద్రునికి, పాయక (కోరి) అల్లుడైన వాడే, కాని అమృతాన్ని అందించినవాడు. ఈయనే విష్ణువు.

ఈయన పులిగూడుతిన్నవాని పొందొక్కటే చేశాడు (భిక్షాటన చేసి ఆ భిక్ష భుజించేవాని స్నేహం చేసేవాడు)... అంటే (పరమశివుని మిత్రుడైన శ్రీహరి). అయినా ఈయన భిక్ష యెత్తడండీ. ఎందుకంటే అష్టైశ్వర్యములున్న లక్ష్మీదేవికి మగడండీ ఈయన. ఈయన చలికిన్ కోవరి వాని బావ. అంటే చల్లదనాన్నిచ్చే చంద్రునికి బావగారు అయిన శ్రీకాంతుడు. అంతేకాదు దేవతలందరికీ ప్రాణబంధువు.

ఎక్కడో రేపల్లెలో వున్న గొల్లపడుచులకి "ఇంటి మగడు" ఒకే ఇంటిపేరుండేట్లు చేసిన మగడు. యోగులందరూ తక్కక (వెనుదీయక) వెదకే పరతత్వము (పరబ్రహ్మ) ఇతడే. ఇవన్నీ అటుంచి శ్రీవేంకటాద్రి మీద వెలసి మమ్మల్ని యేలే దేవుడు ఈయనే. కానీ వేదాలన్నీ శ్లాఘించే పరాత్మరుడు కూడా ఈ దేవుడే.

సంపుటి: 3 కీర్తన : ఈతని నెఱగకుంటేనిల
సంఖ్య : 536 పుట : 360 రాగం: లలిత

**లలిత**

45 ఈతని నెఱఁగకుంటే నిల స్వామిద్రోహము
ఘాతల నేఱు గుడిచి కాలువ పొగడుట. ॥ పల్లవి॥

హరిపాదముననే యడఁగె లోకములెల్ల
హరినాభినే పొడమి రదివో బ్రహ్మాదులు
హరినామము వేదాల కాదియు నంత్యము నాయ
హరిదాసులే వశిష్ఠాదు లిందరును. ॥ఈత॥

విష్ణుఁడే యమృత మిచ్చె విష్ణుఁడే ధరణి మోఁచె
విష్ణువాజ్ఞ నడచేది విశ్వమింతాను
విష్ణుచక్రమున దైత్యవీరులెల్లా నడఁగిరి
విష్ణువుముఖమునందే విప్రులు జనించిరి. ॥ఈత॥

పరమపుశ్రీపతివే భారతరామాయణాలు
పరమాత్ముఁ డితఁడే పలుజీవులయందెల్లా
పరము చేచేతఁ జూపె పట్టి శ్రీవేంకటేశుఁడు
పరమానంద మొసఁగు భక్తులకు నితఁడు. ॥ఈత॥536

**అవతారిక:**

జగద్భర్త నారాయణుడు. మనకు భోజనమిచ్చి అది అరిగేశక్తినిచ్చి పుట్టినదాది తుది శ్వాసదాకా రక్షించేది పురుషోత్తముడే. ఆయన గురించి తెలియకపోవటం కన్న స్వామి ద్రోహం వుంటుందా. లౌకికంగా చూచినా మనకు వుద్యోగం ఇచ్చి, నెలనెలా జీతం ఇచ్చి పోషిస్తున్న మన యజమాని గురించి తెలుసుకోనివాడు ద్రోహియే కదా! అన్నమాచార్యులవారిలో కవి దీనిని నిరసిస్తూ ఏటినీరు తాగి కాలువనీళ్ళను పొగడటం అంటే ఇదే...





అని దెప్పిపొడుస్తున్నారు. ప్రతి జీవిలోనూ అంతర్యామిగా వున్న ఈ శ్రీవేంకటేశుడే పరము చేచేత పట్టి జూపె అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ భక్తులారా! ఈతని (ఈ నారాయణుని) యెరుగకుంటే (తెలియకపోతే) ఇల (భూమిపై) ఇంతకంటే స్వామిద్రోహం మరియొకటుంటుందా? ఘాతల (దెబ్బతిన్నవాడు దీనావస్థలో) నీటినీల్ళ తాగి ప్రాణం నిలబెట్టుకొని, కాలువలో నీళ్ళు బాగుంటాయి అని పొగడటంలాంటిదే... ఇది కూడా అవునా?

విశ్వంలోని పదునాలుగు భువనాలూ ఈ శ్రీహరిపాదం కిందనే వున్నాయి. ఒక్క తొక్కుడుతో అన్నీ చితక్కొట్టగలడు. అంతెందుకు సృష్టికర్త బ్రహ్మ మొదలైన వారంతా ఆయన నాభి (బొడ్డు) లోంచి పుట్టినవారేకదా! అసలు జ్ఞానానికి మూలమైన వేదముపుట్టిందే శ్రీహరి నామములోనుంచి వేదాంతము కూడా ఆయనే కదా! వశిష్ఠుడు మొదలైన సప్తఋషులు యెవ్వరనుకున్నారు? వారంతా హరిదాసులే.

ఆయన మహిమనెంతని పొగడగలం చెప్పండి? దేవతలు అమరులవటానికి కారణమైన అమృతం తెప్పించింది ఆయనే కదా! ఆదివరాహమై ఈ భూమిని మోసినవాడు శ్రీహరే కదా! రోజుకి 24 గంటలు, సంవత్సరానికి 365 రోజులు 6 గంటలు (దాదాపుగా) సమయంపట్టేట్లు ఈ భూమి ఒక గొప్ప సమయపాలన గతి నిర్దేవంతో నడుస్తున్నదే అదెవరివల్ల జరుగుతున్నది? రాక్షసులనందరినీ సుదర్శన చక్రంతో అడ్డగించినదెవరు? నేటికీ వేదవిజ్ఞానం విస్తరింపచేస్తున్న విప్రులు జన్మించింది కూడా ఆయన ముఖంలోనుంచే కదా!

భారత రామాయణాది పురాణవాఙ్మయం పుట్టిందే శ్రీహరి కథామృమును విస్తరింపజేయుటకు కదా! సర్వ జీవులయందున్న పరమాత్ముడు అంతర్యామీ ఈ దేవదేవుడే కదా! నేడు శ్రీవేంకటేశుడై పరము (మోక్షమును) చేనేతపట్టి (అభయవరద హస్తాలతో పట్టి) చూపుతూ భక్తులకు పరమానందమునిస్తున్న ఏడుకొండల యేలికయై భక్తులని అనుగ్రహిస్తున్నది ఈతడే కదా!

సంపుటి: 4 కీర్తన : ఎన్నిమహిమలవాడె యీ దేవుడు
సంఖ్య : 177 పుట : 119 రాగం: హిందోళవసంతం

## హిందోళవసంతం

46 ఎన్నిమహిమలవాఁడె యీ దేవుఁడు
కన్నులపండువలెల్లాఁ గదిసిన ట్టుండెను ॥ పల్లవి॥

పోలింప కర్పూరకాపు పురుషోత్తమునికి
యే లీ నుండెనని యెంచి చూచితే
పాలజలనిధిలోనఁ బవళింపఁగా మేన
మేలిమి మీఁగఁడంటిన మెలుపుతో నుండెను ॥ఎన్ని॥

తట్టుపునుఁగుకాపు దైవశిఖామణికి
యెట్టుండె నని మరి చూచితే
చిట్టకాన రేపల్లెలో చీఁకటితప్పు సేయఁగా
అట్టిరాత్రులు మేన నంటిన ట్టుండెను ॥ఎన్ని॥

అలమేలుమంగతోడ నట్టె సొమ్ము ధరించఁగ
యేలమి శ్రీవేంకటేవు నెంచి చూచితే
కలిమిగల యీ కాంత కౌఁగిటఁ బెనఁగఁ గాను
నిలువెల్లా సిరులై నిండిన ట్టుండెను ॥ఎన్ని॥

**అవతారిక:**

ఈ తిరుమలేశుడు యెన్ని మహిమలు గలవాడె! అని ఆశ్చర్యపడుతున్నారు అన్నమాచార్యులవారు. ఆ మహిమలన్నీ కన్నులపండువగా శోభిల్లుతున్నాయని అంటున్నారు. అన్నమయ్యకి ఈ మధురమైన భావలహరియెలా వస్తుందా అనిపించి, ఏడుకొండలవాడే ఆ భావలహరిని ఆయనలో యెగసిపడేలా చేస్తాడు అని సమాధానపడ్డాను. శ్రీమహాలక్ష్మియైన అలమేల్మంగ ఈ స్వామి కౌగిట్లో కరిగే తరుణంలో





ఆవిడ ఒంటిమీద నగలన్నీ ఈయనకు అంటుకున్నాయట. భళి భళీ! నీ వూహ భావాతీతమయ్యా! అన్నమయ్యా!

**భావ వివరణ:**

ఈ దేవదేవుడు యెన్ని మహిమలు కలవాడో యేమని చెప్పగలను? అవి కన్నులపండుగలై అన్నీ నన్ను దగ్గరై అలరించుచున్నవి.

ఈస్వామికి కర్పూరపు వంటిపై మెత్తారు. ఆపలింప (ఆరంగారంగవేసిన) ఆకాపు ఈ పురుషోత్తమునికి ఎలావున్నదంటే... పాలసముద్రములో, పవ్వళించినందున అలల తాకిడికి అంటిన లేతలుంగారు రంగు మీగడ బాగా అంటుకొని మెలపుతో (మెత్తినట్లుగా) వున్నది.

పునుగుపిల్ల నుంచి తీసిన సుగంధద్రవ్యము తట్టుపునుగు. దేవతలందరిలో శిఖామణి (తలమానికమైన) ఈ స్వామికి నిమజ్జనానంతరం తట్టు పునుగు కాపు వేస్తారు (మెత్తుతారు). మరి పరికించి చూచితే అది యెట్లా వుంటుందంటే... చిట్టకాన (శృంగారలీలగా) అలనాడు రేపల్లెలో ఈ శంగారరాయుడు అనేక “చీకటి తప్పులు” సేసినందున ఆ రాత్రులన్నీ ఈయన వంటిపై ఒకదాని తర్వాత ఒకటి అంటుకొని, అందాలమేనిపై ఆ తట్టు పునుగుకాపు ఇంకా అందము పెంచుతున్నది. నేడు అలమేల్మంగతో చేరిన ఈ మహానుభావుడు అట్టె (అదిగో) యెలావున్నాడంటే... కలిమికాంత (శ్రీమహాలక్ష్మియైన) ఆదేవిని ఈ శ్రీవేంకటేశ్వరుడు బిగి కౌగిట జేర్చగా, పెనగులాడెడి, ప్రేయసి ఒంటిపై నగలన్నీ ఈ చిలిపి శ్రీనావాసునికి అటుకొన్నవా అన్నట్లుంది. అందుచేతనే ఈయనకు నిలువెల్లా సిరులై (నగలై) నిండిపోయినవా అన్నట్లుంది. ఇకపై చెప్పే శక్తి నాకు లేదు తండ్రీ!

సంపుటి: 1 కీర్తన : ఏమియునెఱగని పామరులను మమ్ము
సంఖ్య : 162 పుట : 109 రాగం: ఆహిరి

**ఆహిరి**

47 ఏమీ నెఱఁగని మమ్ము నెక్కువసేసి
పామరుల దొడ్డఁజేసె భాష్యకారులు ॥ పల్లవి॥

గతచన్న వేదాలు కమలజునకు నిచ్చి
నాతనికరుణచేత నన్నియుఁ గని
గతిలేకపోయిన కలియుగమున వచ్చి
ప్రతిపాలించఁ గలిగె భాస్యకారులు ॥ఏమీ॥

లోకమెల్ల వెల్లిఁబోఁగా లోననే సురలఁగాచి
ఆకుమీఁదఁ దేలినయతనికృప
కాకరిమతములెల్ల గాలి ఁబుచ్చి పర మిట్టే
పైకొనఁగఁ గరుణించె భాస్యకారులు ॥ఏమీ॥

పంకజపుఁజేయి చాఁచి పాదపుఁబర మిచ్చిన
వేంకటేశుకృపతోడ వెలయఁ దానే
తెంకనే వొడయవరై తిరుమంత్రద్వయాన
పంకమెల్లఁ బోఁగడిగె భాష్యకారులు ॥ఏమీ॥

**అవతారిక:**

భాష్యకారుడు అంటే వ్యాఖ్యానం చేసేవాడు అని అర్థం. భగవంతుని లీలలను గురించి సోదాహరణంగా వ్యాఖ్యానించి, భక్తిని పెంపొందింపజేస్తారు భాష్యకారులు. వైష్ణవ పరిభాషలో రామానుజాచార్యుల బిరుదు అది. అన్నమాచార్యులవారి ఈ కీర్తనలో తన గురువుని కీర్తిస్తూ మా భాస్యకారులు మమ్మల్ని దొడ్డవాడిని చేశారు. నిజానికి మేము పామరులమే. ఏమీ యెఱగని మమ్ము "అన్నమాచార్యులవారి"ని చేసి యెక్కువ చేసి అనుగ్రహించారు





అంటున్నారు. "గతచన్న" అంటే కోల్పోబడిన... లేక... కోల్పోయిన అని అర్థం. ఇట్లా సూటిగ నిఘంటువులో దొరకని చాలామాటలున్నాయి, ఈ కీర్తనలో.

**భావ వివరణ:**

ఈ భాష్యకారులు (రామానుజాచార్యులవారు) ఏమీ యెరుగని పామరులమైన (అజ్ఞానులమైన) మమ్ము ఆచార్యపదవితో దొడ్డవానిని (గొప్పవానిని) చేశారు.

గతచన్న (గతించిపోయిన, లేక, కోల్పోయిన) వేదాలను కమలజునకు (పద్మసంభవుడైన బ్రహ్మకు) తిరిగి ఇచ్చిన ఆతని (శ్రీహరి) దయవలన అన్నియు నెఱిగి, గతిలేని (సక్రమమైన ధర్మ మార్గంలేని) కలియుగంలో వచ్చి (అవతరించి) ప్రతిపాదించగలిగె (నిరూపించగలిగెను... అంటే భగవంతుని సాక్షాత్కరింపజేసెను) ఈ భాష్యకారులు.

లోకమెల్ల (భూలోకమంతా) వెల్లన్‌పోగా (జలప్రవాహంలో మునిగిపోగా) లోననే (తనలోనే) దేవతలకు ఆశ్రయం కల్పించి చిన్నారి శిశువురూపంలో ఒక మఱ్ఱి ఆకుపై తేలియుండిన ఆదినారాయణుని దయనుపొంది, కాకరిమతమ ఉలెల్ల (వ్యర్థమైన మతములను) గాలిబుచ్చి (గాలికెగిరిబోవునట్లు చేసి) ఇట్టే పరము (మోక్షమార్గము) పైకొనగా (కలుగునట్లు) చేసినవారే ఈ భాష్యకారులు.

పంకజపు చేయిజాచి (కమలములవలె కోమలమైన తన చేతులను చాచి) తనపాదములను చూపించి మోక్షమార్గం ఇచ్చిన శ్రీవేంకటేశ్వరుని కరునారసవృష్టితనపై కురియగా, తెంకనే (సుస్థిరముగా) ఉడయవరై వైష్ణవాచార్యుడై అవతరించారు. ఆపైన తరుమంత్రద్వయముతో (పవిత్రమైన రెండు మంత్రములతో) మా పాపపంకిలమునంతా ఈ భాష్యకారులు తొలగించినారు.

సంపుటి: 4 కీర్తన : అన్నిటిపైనున్నట్లు హరిపై నుండదు మతి
సంఖ్య : 124 పుట : 83 రాగం: నారాయణి

**నారాయణి**

48 అన్నిటిపై నున్నట్లు హరిపై నుండదు మతి
కన్నులఁ బ్రహ్లాదువలె కనుఁగొను టరుదా ॥ పల్లవి॥

పులుగు నర్చిం చొకఁడు పూఁచెనాగత మెరిఁగి
వెలసి ఘనుఁడనంటా విఱ్ఱవీఁగీని
జలజాక్షుపాదములు సారె నర్చించేటివారు
ఇలలోనఁ బరమార్థ మెరుఁగుట యరుదా ॥అన్ని॥

మానివోడ నమ్మొకఁడు మహాజలధి దాఁటి
నానార్థములు గూర్చి నటియించీని
శ్రీనాథుపాదములు చేకొని నమ్మినవాఁడు
పూని భవవార్ధి దాఁటి పుణ్యమందు టరుదా ॥అన్ని॥

దీపమువట్టి యొకఁడు తెగనిచీఁకటిఁ బాసి
చూపుల నన్నిటిఁ గని సుఖమందీని
చేపట్టి పరంజ్యోతి శ్రీవేంకటేశు భక్తుఁ
డోపి ముక్తి కడగని వున్నతుఁడౌ టరుదా ॥అన్ని॥

**అవతారిక:**

ప్రహ్లాదునికి అందరిలోనూ హరియే కనుపించేవాడు. అన్నిటిలో వున్నది హరియే అని దృఢముగా నమ్మిన వానికే అది సాధ్యము. వారి వారి అభీష్టాలు నెరవేరుటతో మానవులు రకరకాల సాధనలను చేస్తారు. ప్రాపంచిక విషయాలలో కడతేరటం యేమంతకష్టం కాదు. శ్రీహరి శరణాగతుఉ వైకుంతమ ఏ పొందగలరు; భవసాగరాన్ని సునాయాసంగా





తరించగలరు; ముక్తిని కూడా పొందగలరు, ఎందుకంటే వారు పరంజ్యోతియైన శ్రీవేంకటేశ్వరుని భక్తులు కదా! అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావ వివరణ:**

అయ్యో! మతి (నామనస్సు) అన్నిటిపైన వున్నట్లు హరిపై నుండదు. ఏమి దౌర్భాగ్యము!! భక్త ప్రహ్లాదునివలె ఆ శ్రీహరిని కన్నుల యెదుట ప్రత్యక్షం చేసికొనుట అరుదా (అసంభవమా?) ఏమాత్రమూ కాదు.

ఇదివరలో ఒకడు గరుత్మంతుని అర్చించి ఆయన అనుగ్రహంతో ఆగతము (జరుగబోవునది) తెలిసికొని తానే ఘనుడనని విఱ్ఱవీగినాడు. అతడే అట్లయిన, ఆ గరుత్మంతుని అధిపతియైన జలజాక్షుడు శ్రీహరిపాదముల నర్చించువాడు, ఇలలో పరమార్థము నెరుగుట ఒక గొప్ప విషయమా?

మానివోడ (కొయ్యతో చేసిన ఓడ) నెక్కి మహాసముద్రములను దాటి రకరకములైన సంపదలను పొందుటకు అనేక నటనలు చేస్తాడు ఒకడు. వాడికే అటువంటి విశిష్టత కలిగితే ఇక శ్రీనాథుని పాదముల నాశ్రయించినవాడు భవసాగరమును దాటి పుణుడగుట అరుదా (అసంభవమైన విషయమా?) ఏమాత్రమూ కాదు.

ఒకానొకడు దీపమును తన చేత ధరించి తెగని చీకటి (అంతులేని అంధకారమును) అధిగమించి తన కళ్ళతో అన్నీ చూడగలిగి సుఖములననుభవించాడు. అటువంటప్పుడు పరంజ్యోతి అయిన శ్రీవేంకటేశ్వరుని భక్తుడు, ఓపి (ఓపికతో) ముక్తిని పొంది సర్వోన్నతుడవటం అరుదా (అసంభవమా?) ఏమాత్రం కాదు.

సంపుటి: 15 కీర్తన : శంకమ నీవు సాక్షి చక్రమ నీవు సాక్షి
సంఖ్య : 169 పుట : 112 రాగం: బౌళి

**బౌళి**

49 శంకమ నీవు సాక్షి చక్రమ నీవు సాక్షి
వంకలాడ భుజముల వ్రాసుకొంటి మిమ్మును ॥ పల్లవి॥

నారాయణా యని యిట్టె నరకములు తరించితి
శ్రీరామా అని పొందితి జీవన్ముక్తి
దూరించి గోవిందా యని తోలితి పాపము లెల్ల
ధీరుఁడనై వళుకెల్ల తిద్దుకొంటి నిదిగో ॥శంకమ॥

దామోదరా అని తొల్లి దాటితి దు:ఖము లెల్ల
వామనా అని కర్మములు వంగఁ దొక్కితి
భూమిరమణా యని పుటుగులు గెలిచితి
వేమరు నితరులకు వెరవ నే నింకను ॥శంకమ॥

హరి యచ్చుతా యని ఆపదల నణఁచితి
పురుషోత్తమా యని పుణ్యము లెల్లా మీఱితి
అరుదైనా శ్రీవేంకటేశ యని లోకముల మించితి
తొరలి సంసారపుదూరు చక్కఁబెట్టితి ॥శంకము॥

**అవతారిక:**

"వంకలాడ" అంటే వంకరలు దిద్దగా అని అర్థం. అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో తన భుజములపై వైష్ణవ సాంప్రదాయం ప్రకారం ముద్రింపజేసికొన్న శంఖ చక్రముద్రలతో "మిమ్మల్ని సాక్షులుగా నాభుజములపై వ్రాయించుకొంటిని" అంటున్నారు. ఎట్లా వ్రాయించుకొన్నారంటే "వంకలాడ" వ్రాయించుకొన్నారట. ఆపైన, విష్ణునామ సంకీర్తన మధురాతి మధురంగా చేస్తున్నారు. ఆశ్రీహరి నామ సంకీర్తన "తొరలి సంసారపు దూరు చక్కబెడుతుందట. కీర్తన పాడినవారికి విష్ణునామ పారాయణ పుణ్యం





దక్కుతుందని విడిగా చెప్పనక్కరలేదు కదా! అన్నట్లు వళుకు – అంటే తగవు అని అర్థం.

**భావ వివరణ:**

ఓ శంకమా (పాంచజన్య శంఖమా!) నీవే మాకు సాఓఇ. ఓ చక్రమా! (సుదర్శన చక్రమా!) నీవే మాకు సాక్షి. నేను విష్ణువునకు చెందిన వాడనని మిమ్మును (మిమ్మల్ని) నా భుజములపై వంకలాడ (వంకరలు దిద్దగా) వ్రాయించుకొంటి (కాల్చి వాతలవలె ముద్రింపజేయించుకొంటిని). కనుక మీరే నాకు చెఱపలేని సాక్ష్యము.

నేను మా ఆచార్యుల కృప జేత వైష్ణవుడనై ఎట్లా తరించానో చెప్తాను వినండి. నేను "నారాయణా" అని యెలుగెత్తి అనగానే నరకద్వారములను దాటి నాను. శ్రీరామా అని చెప్పగానే జీవన్ముక్తిని పొందాను. దూరించి (ఉద్యుక్తుడనై) గోవిందా గోవిందా అని గొంతెత్తి యని నేను చేసి కొనిన అశేష పాపాలను తోలివేశాను. ఇదివో నేను ఆ విధంగా ధీరుడనై (విద్వాంసుడనై) వళుకెల్లా (మత్సరమునంతా) దిద్దుకొంటి సవరించుకొంటిని.

దామోదరా అని తనివిదీరా పలికి, నా తొల్లిటి (ఇదివరకు నాకున్న) దు:ఖములను తొలగించుకొంటిని. వేమనా అనే విష్ణు నామమును పలికి నేను చేసిన కర్మల వంగదొక్కితి (అణగద్రొక్కితిని). భూరమణా అనే నామము చెప్పి పుటుగులు (జన్మల చక్రవ్యూహమును) గెలిచితిని. నేను ఇక ఇతరములకు (మానవమాత్రులైన అధిపులకు) వేమరు వెరవను (ప్రతిదానికీ భయపడను).

"హరి అచ్యుతా" అనే నామోచ్చరణతో నేను నా ఆపదలనన్నింటినీ అణచివేశాను. పురుషోత్తమా అని పుణ్యముల నెల్లా మీఱితి (అతిశయించితిని). శ్రీహరి నామాలలో అరుదైన నామము శ్రీవేంకటేశ. ఆ నామము నిరంతరం నా నాలికపై నుండగా లోకముల మించితి (సర్వశ్రేష్ఠుడనైతిని) తొరలి (ఈమారు) సంసారపు దూఱు (ప్రాపంచిక లంపటములను) చక్కబెట్టితి (సరిజేసుకొంటిని). ఇది నా ఘనత కాదు తండ్రీ! నీ అపారమైన కరుణయే కారణము.

సంపుటి: 2 కీర్తన : నీవు జగన్నాథుఁడవు నే నొక జీవుఁడ నింతే

సంఖ్య : 169 పుట : 113 రాగం: భైరవి

## భైరవి

50 నీవు జగన్నాథుఁడవు నే నొక జీవుఁడ నింతే
నీవలె ననుభవించ నే నెంతవాఁడను ॥ పల్లవి॥

వైకుంఠ పదమేడ వడిఁగోర నెంతవాఁడ
యీ కడ నీ దాసుఁడనౌ టిది చాలదా
చేకొని నీ సాకారచింత యేడ నే నేడ
పైకొని నీ డాగుమోచి బ్రదికితిఁ జాలదా ॥నీవు॥

సొంపుల నీ యానందసుఖమేడ నే నేడ
పంపు శ్రీవైష్ణవసల్లాపన చాలదా
నింపుల విజ్ఞాన మేడ నేఁ దెలియ నెంతవాఁడ
యింపుగా నీకథ వినుటిదియే చాలదా ॥నీవు॥

కైవల్యమందు నీతో కాణాచి యాడనాకు
శ్రీవేంకటాద్రిమీఁది సేవ చాలదా
యీవల శ్రీవేంకటేశ నీ విచ్చిన విజ్ఞానమున
భావించి నిన్నుఁ బొగడే భాగ్యమే చాలదా ॥నీవు॥

**అవతారిక:**

"ప్రభూ! నీవు పరమాత్మవు, జగన్నాథుడవు. మరి నేనో? ఒక జీవుడను. ఈ సృష్టిలో సర్వమూ నీదే. నీవలె అన్నీ అనుభవించే హక్కు నాకెక్కడిదయ్యా!" అని వినమ్రులై కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. నీ కైవల్యం పొందగలిగే అర్హత నాకున్నదా స్వామీ? పోనీలేవయ్యా! ఈ తిరుమలో నీసేవాభాగ్యం దక్కితే చాలు నాకు. నీవు నాకిచ్చిన ఈ కొద్దిపాటి విజ్ఞానంతో నిన్నే భావించి నిన్నే కీర్తిస్తూ బ్రతుకుతాను అది చాలునాకు



అంతయు నీవే హరిపుండరీకాక్ష

అంటున్నారు. ఇక మనమైతే, అట్లాంటి కోరిక కోరుకోవాలనే కోరిక కలుగని కొరగాని కొరకరాని కొయ్యను నేను.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీవు జగన్నాథుడవు. పరమాత్మవు. మరి నేనో, ఒక జీవుడను, నీవు సర్వ భోక్తవు. నీవలె అనుభవించుటకు నేనెంతవాడను ప్రభూ! నీవు వైకుంఠము9నీయగల సమర్థుడవె. కాని నీవు వైకుంఠమెక్కడ నేనెక్కడ? దాన్ని కోరే అర్హత నాకున్నదా? అయితే అయిందిలే స్వామీ! ఇక్కడ నీదాసుడను అనిపించుకొంటే నాకదే పదివేలు. కొంతమంది నిన్ను సాకారంగా ప్రత్యక్షం చేసికొనవలెనని కోరుకుంటారు. కానీ నేనెక్కడ నీసాకార దర్శనమెక్కడ! ఏదో ఈ వైష్ణవదీక్షలో నీతిరునామము, ఒంటిపై శంఖచక్ర చిహ్నములు నాకుచాలునయ్యా! ఇట్లా పైకొని (నా శరీరంపై దాల్చిన) వాటితో బ్రతికితే అది చాలు నాకు.

సొంపైన నీ బ్రహ్మానందానుభవంతో కలిగే సుఖము నాకు సాధ్యమా తండ్రీ! అదెక్కడ నేనెక్కడ? కానీలే- నాకు నీ వైష్ణవ సల్లాపములు (ప్రవచనములు) చాలును. ఇంపైన విజ్ఞానము (భగవంతుని గురించి జ్ఞానము) కోటికొక్కడికి దక్కుతుంది దాన్ని తెలుసుకోవటానికి నేనెంత వాడను ప్రభూ! ఏదో నీకథాశ్రవణంతో నా బ్రతుకును గడిపేస్తాను నాకది చాలును.

కైవల్యము అంటే నీతో వుండిపోయే భాగ్యం పొందటమే. ఆమోక్షస్థానమే చిరకాల వాస స్థానము (కాణాచి) అదెక్కడ, నేనెక్కడ? ఇదిగో నీవేంకటాద్రి మీద నీసేవ నాకుండగా అనవన్నీ నాకెందుకయ్యా? ఓ శ్రీవేంకటేశ్వరా! ఇకపై నీవు ఇచ్చిన ఈ విజ్ఞానంతో భాలించి నిన్ను కీర్తిస్తూ బ్రతికేస్తాను. నాకు ఆ భాగ్యం చాలు. ఇంకేదీ వద్దుగాకవద్దు.

సంపుటి: 2 కీర్తన : వినవమ్మ జానకి నీవిభుడింతేసేసినాడు
సంఖ్య : 462 పుట : 311 రాగం: రామక్రియ

## రామక్రియ

51 వినవమ్మ జానకి నీవిభుఁ డింతసేసినాఁడు
యెనసి యీరఘురాముఁ డిఁక నేమి సేసునో ॥ పల్లవి॥

వానరులదండు గూడి వారధి కొండలఁ గట్టె
ఆని లంక చుట్టిరా నదే విడిసె
కోనలఁ ద్రికూటమెక్కె గొడగులన్నియుఁ జెక్కె
యేనెపాన రఘురాముఁ డిఁక నేమిసేసునో ॥విన॥

కోరి ఇంద్రజిత్తుఁ జంపె కుంబకర్ణు నిర్జించె
గోరదానవులనెల్ల కూలఁగుమ్మెను
మారణహోమము నేనె మతకమింతాఁ జెరిచె
యీరసాన రఘురాముఁ డిఁక నేమిసేసునో ॥విన॥

లావున రావణుఁ జంపె లంక విభీషణు కిచ్చె
చేవల నోసీత నిన్నుఁ జెకొనెను
భావించి శ్రీవేంకటాద్రిఁ బట్టము దాఁ గట్టుకొనె
యీవలనావల నాతఁ డిఁక నేమిసేసునో ॥విన॥462

**అవతారిక:**

ఇటువంటి కీర్తన నభూతో న భవిష్యతి అని గట్టిగా చెప్పగలను. ఎందుకంటే గతంలో "ఓ సీతమ్మ తల్లీ! నను బ్రోవమని చెప్పవే" అని మొరబెట్టిన వారున్నారు. తల్లీ! నీవు సాక్షాత్తు లక్ష్మీదేవివమ్మా! అని కీర్తించినవారున్నారు కాని తానే ఒక రామదూత కపియై శ్రీరాముని శత్రు నిర్మూలనం సీతమ్మకు వర్ణించి వివరించటం యెన్నడూ యెరుగము. అన్నమాచార్యుని కృపచేత ఈ కీర్తన రూపంలో ఆలోటు తీరింది. "ఓ జానకమ్మా! మీ ఆయన యేమి చేశాడో వినవమ్మా! ఈయనగారు తిరుమల కొండలెక్కాడు. ఇకపై యేమిచేస్తాడో తెలియకుండావున్నది"





అంటున్నారు, నభవిష్యతి- అని ఎందుకన్నానంటే ఈ తెలుగు పాండిత్యం వున్న మొనగాడెవడండీ...

**భావ వివరణ:**

ఓ జానకీదేవీ! ఇది వినవమ్మా! నీ విబుదు (నీభర్తయైన శ్రీరాముడు) ఇంసేసినాడు, ఇన్ని వీరోచితకార్యములను చేసినాడు. ఈ రగురాముడు, ఎనసి (పూని) ఇకన్ యేమిసేసునో!! ఇంకా ఏమిచేస్తాడో యేమో!!

నీ భర్త వానరదండు (కపులసేనతో) కూడి కొండలతో వారధిగట్టె (సేతువును నిర్మించినాడమ్మా!) ఆపైన ఈ లంక చుట్టిరా (చుట్టూతా) అదే తన సైన్యంతో విడిసె (విడిది యేర్పరచుకొనినాడు) అదిగో ఆ లోయలవైపునుంచి చిత్రకూట పర్వతమునెక్కినాడు. ఆయనశక్తిసామర్థ్ాల గురించి చెవులు కొరుక్కున్నవారి గొడుగులన్నిటికీ (గొణుక్కోవటాలకన్నింటికీ) చెక్కె (చెక్కినట్లు సమాధానమిచ్చాడు. ఈ రఘురాముడు ఇకపై యేనెపానటేమిసేసునో!! (దేనికోసం యేమిచేస్తాడో చెప్పలేము తల్లీ!)

కోరి ఇంద్రజిత్తుని జంపె (సీతాపరహరణంలో అతని పాత్రయేమీ లేకపోయినా, వాడు రావణుని ఆత్మజుడు కావున లక్ష్మణునితో చంపించాడు). అనేక వానరులను మూకొమ్మడిగాచంపాడని కుంభకర్ణుని తెగవేసినాడు. ఘోరమైన దానవులను కూలగమ్మె (కూలవేసినాడు). మతకమంతా జెరిచి (రాక్షసమాయను పటాపంచెలము చేసెను). రణరంగంలో మారణహోమం (మృత్యుహోమం) చేశాడు ఈ రఘురాముడు, ఈరసానవున్నాడు (కోపముచేత వివశుడైయున్నాడు. ఇంకాయేమిసేసునో!!

ఆపైన రావణాసురుని లావున (ధైర్యముతో) చంపెను. లంకానగరానికి విభీషణుని పట్టాభిషిక్తునిచేశాడు. ఓ సీతా! ఆయన ఇక నిన్న చేవల చేకొనును (వశమై చేపట్టును). భావించి (ఆశ్రీరాముడే ఈ శ్రీవేంకటేశ్వరునిగా యెంచి) తాను శ్రీవేంకటాద్రిని, పట్టము కట్టుకొన్నాడు (పట్టాభిషిక్తుడయ్యాడు). ఈవల నావల (ఇక్కడ తిరుమలలోను అక్కడ అయోధ్యలోను) అతడు ఇక నేమిసేసునో!! ఎవరు చెప్పగలరు?

సంపుటి: 2 కీర్తన : వారివారి భాగ్యములు వ్రాసివున్నవి నొసళ్ల
సంఖ్య : 270 పుట : 181 రాగం: రామక్రియ

## రామక్రియ

52 వారి వారి భాగ్యములు వ్రాసి వున్నవి నొసళ్ల
ధీరతతో నేది మేలో తెలుసుకోరో ॥ పల్లవి॥

అట్టే కొందరు మతము లన్నియు నేకమని
పట్టవర్ధనము నెత్తిఁబెట్టి చూపిరి
జట్టిఁ గొఁదరు జీవులు జంగమే లింగముగాని-
పుట్టుగెల్లా భస్మమని పూసుక చూపిరి ॥వారి॥

కొంద రేమియును లేదు కొట్టఁగొన లయమని
అంది వట్టిలలాటశూన్యము చూపిరి
కందువఁ గొందరు లక్ష్మీకాంతుఁ డంతరాత్మయని
ముందే నామము శ్రీచూర్ణమునుఁ బెట్టి చూపిరి ॥వారి॥

చెలఁగి దిష్ట మిపుడు శ్రీవేంకటేశుఁడు
అలమేలుమంగపతి యై యున్నవాఁడు
యిలవీర నీదాసుల కిట్టిభాగ్య రేఖలు
వలసినవారికెల్లా వ్రాసినాఁ డితఁడు ॥వారి॥270

**అవతారిక:**

"ఎంత మాత్రమున నెవ్వరు తలచిన అంతమాత్రమె నీవు" అనే అన్నమాచార్యుల వారి కీర్తనలో అన్న విషయాన్నే ఈ కీర్తనలోనూ ప్రస్తావిస్తున్నారు. ఎవరి భాగ్యంయెట్లా వుంటుందో వారి నొసటిపై విధాత వ్రాసి భూమిపైకి పంపిస్తాడని పెద్దవాళ్ళు చెబుతారు. ఎవరికేది మేలో ఏమిచెయ్యాలో ఎవరికివారే ధైర్యంతో ఆలోచించి తెలుసుకోవాలి అని అంటున్నారు శ్రీవేంకటేశుని దాసుల భాగ్యరేఖలు మాత్రం వారికెట్లాకావాలో





అట్లా వ్రాస్తాడట.. ఆవిధాత. ఎందుకని? ఆయన దిష్ట అందుకని. దిష్ట అంటే అదృష్ట ప్రదాత అని చెప్పుకోవచ్చును. ఇది జటిలమైన కీర్తన అని విడిగా చెప్పనక్కరలేదు కదా!

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! వారి భాగ్యములు (ఎవ్వరికి ప్రాప్తించెడి భాగ్యములు) వారి నొసళ్ళ (అవ్వారి నుదుటి భాగములలో) వ్రాసివున్నవి, (విధాత చేత పుట్టుకనాడే వ్రాయబడినవి). ఈ విషయాన్ని ధీరతతో తెలుసుకోరో! (ధైర్యంతో తెలుసుకోండయ్యా!) ఈ ప్రపంచంలో వేర్వేరు మతస్థులు వేర్వేరు నమ్మకాలతోవుంటారు.అ ట్టె (అదేవిధంగా) కొందరు మతములన్నియు ఏకమని (ఒక్కటేనని) పట్టవర్ధనము (నొసటిపై ధరించు ఒకరకమైన బొట్టు) నెత్తిబెట్టి (నుదుట ధరించి) చూపిరి. జట్టి (నిర్ణయించి) కొందరు జీవులు, జంగమే (శివుడే) లింగమ రూపంలో వుంటాడని జీవితాంతంలో పుట్టుకలన్నీ బూడిదయ్యేవేనని నమ్మి తమ శరీరమంతా భస్మము వ్రాసుకొని జీవిస్తారు. అది వారి నమ్మకం మనమెలా కాదనగలము? కొందరు శూన్యవాదులున్నారు. వారు పాపపుణ్యాలు రెండూ లేవంటారు. అసలు భగవంతుడే లేడు అంటారు. కొట్టకొనలయము (చిట్టచివరికి చావు తప్పదు కాబట్టి, మంచివాడు చెడ్డవాడు ఇద్దరూ చావక తప్పదు కనుక, ఏమీ అవసరంలేదని, వట్టి లలాటము (బోసిగావున్న నుదురుతో బొట్టులేకుండా శూన్యముగావున్న నొసలు) చూపిరి. కందువ (సామర్థ్యంగల) కొందరు లక్ష్మీపతియైన శ్రీహరియే అంతరాత్ముడని తమ నొసటిపై ఎచూర్ణము (తిరుచూర్ణము, పంగనామాలుగా ధరించి చూపిరి.

ఇప్పుడు శ్రీవేంకటేశ్వరుడు దిష్టము వలె (అదృష్టప్రదాతగా) చెలగి (అతిశయించగా) సిరులరాణియైన అలమేల్మంగమ్మ పతియైయున్నవాడు. అందుకని 'యిల' (ఈలోకంలో) వీర (వీరే... అంటే... అదేవీ ఆవిడ భర్తా) నీదాసులకు (హరిదాసులకు) ఇట్టి భాగ్యరేఖలు, వారికెల్లా వలసిన విధముగా (వారు కోరిన విదముగా) ఇతడు విధాత రూపంలో వారి భాగ్యం వారి నొసళ్ళపై వ్రాస్తాడు.

సంపుటి: 2 కీర్తన : సదానందము సర్వేశ్వర నీ-
సంఖ్య : 369 పుట : 248 రాగం: దేవగాంధారి

**దేవగాంధారి**

53 సదానందము సర్వేశ్వర నీ-
పదారవిందముపై భక్తి ॥ పల్లవి॥

నయనానందము నరులకు సురలకు
జయమగు హరి నీసాకారము
నయమగుశ్రవణానందము వినినను
క్రియగలిగిననీకీర్తనము ॥సదా॥

చెలఁగి యందరికి జిహ్వానందము
పలుమరుఁ గొనునీప్రసాదము
నలుగడ దేహానందము బుధులకు
బలునీపాద ప్రణామములు ॥సదా॥

ధరఁ బరమానందము నీదాస్యము
గరిమల శ్రీవేంకటవిభుఁడా
నరహరి నిత్యానందము నినుఁ దగ-
నరవిరిఁ జేయసమారాధనము ॥సదా॥369

**అవతారిక:**

ప్రతిజీవీ సంతోషం కోసమే జీవిస్తాడు. సంతోషంకోసమే వెంపర్లాడతాడు. అయితే రేయింబవళ్ళలాగా, సంతోషమూ దు:ఖమూ రెండూ సదా (కలకాలంవుండేవి కావు) వస్తుంటాయి పోతుంటాయి. మరి సదానందము (యెప్పుడూ ఆనందాన్నిచ్చే) దేమిటి? ఆ సర్వేశ్వరుడి పాదారవిందములపై భక్తి అని అంటున్నారు అన్నమాచార్యులవారు. నయనాందము, శ్రవణానందము, జిహ్వానందము, దేమానందము,





పరమానందము, నిత్యానందము- యేమిటేమిటో వివరిస్తున్నారు విని తరించండి. జ్ఞానము అంటే ఇదే సుమా!

**భావ వివరణ:**

ఓ సర్వేశ్వరా! నా పదారవిందములపై భక్తి (నీపాదపత్మములపై అచంచలమైన భక్తిప్రపత్తి) సదానందము (సర్వకాలసర్వావస్థలయందు ఆనందమునొసగునది).

నరులకు సురులకు నయనానందమయుయేది? (కన్నులకు ఆనందము నొసగునదేమిటి?) శ్రీహరీ! సర్వులకు జయము నొసగే నీసాకార (ఆకారముతో కూడిన) రూపముకంటే నయనానందకరము మరొకటి లేదు. ఇక వినినను (వినుటకు) నయముగ (స్వాంతనము కలిగించే) శ్రవణానందము (చెవులకు ఆనందకరమైనది) యేది? క్రియగలిగిన (పూనిక గలిగిన) నీ నామసంకీర్తనము మాత్రమే ఆ శ్రవణానందము నీయగలదు.

జిహ్వ (నాలుక) కలిగించే ఆనందమువల్ల నేనరులు దేనినైనా భుజించగలుగుతున్నారు. చెలగి (అతిశయించి) అందరికీ అట్టి జిహ్వానందము కలిగించునది) యేదీ? యెన్నోసార్లు స్వీకరించే ఆస్వామి ప్రసాదమే జిహ్వానందకరము. ఇక లుధులకు (బుద్ధిమంతులకు) దేహమునకు ఆనందము కలిగించునదేది? నలుగడ (అనిచోట్లలో) బలమైన నీపాదములకు జేయు ప్రణామములు (సాష్టాంగవందనములే) దేహానందము గరిమల (మహిమగల) శ్రీవేంకటేశ్వరుడా! ధరలో (భూలోకంలో) పరమానందమునొసగునదేది? నీకు చేసే దాస్యమే (భృత్యునిగా జీవించుటే) ఓనరహరీ! నిత్యానందము (ప్రతిరోజూ ఆనందము) నొసగునదేది? తగునట్లు అరవిరి (వినమృలై ముకుళిత హస్తములతో) జేయు నీసమారాధనమే నిత్యానందములు.

సంపుటి: 2 కీర్తన : కౌసల్యానందనరామ కమలాప్తకులరామ
సంఖ్య : 275 పుట : 185 రాగం: సాళంగనాట

## సాళంగనాట

54 కౌసల్యానందనరామ కమలాప్తకులరామ
భాసురవరద జయపరిపూర్ణ రామ ॥ పల్లవి॥

మునుప దశరథరాముఁడవై తమ్ములు నీవు
జనించి తాటకఁ జంపి జన్నము గాచి
వెనుకొని హరువిల్లు విరిచి సీతఁ బెండ్లాడి
అనుమతి పరశురామునిచేఁ గైకొంటిని ॥కౌస॥

సుప్పనాతి శిక్షించి సొరిది రుషులఁ గాచి
అప్పుడే ఖరదూషణాదులఁ గొట్టి
చొప్పుతో మాయామృగము సోదించి హరియించి
కప్పి హనుమంతు బంటుఁగా నేలుకొంటిని ॥కౌస॥

సొలసి వాలి నడఁచి సుగ్రీవుఁ గూడుక
జలధి బంధించి లంక సాధించి
వెలయ రావణు గెల్చి విభీషణుని మన్నించీ
చెలఁగితి వయోధ్యలో శ్రీవేంకటేశుఁడా ॥కౌస॥275

**అవతారిక:**

కౌసల్యానందనుడైన శ్రీరాముని కీర్తిస్తున్నారు అన్నమాచార్యులవారు. సూర్యవంశతిలకుడైన ఈయన శోభాయమానమైన వరములనిస్తాడట. పరిపూర్ణమైన జయమునిస్తాడట. ఇదివరలో చెప్పినట్లే ఇదికీర్తనే కాక రామాయణ పునశ్చరణ కూడా. అన్నమయ్యకు రామకథ ఆదినుంచి చెప్పటమే అలవాటు. ఈ రాముడు అనుమతి పరశురామునిచేగైకొనెనట. అంటే.. దుష్టశిక్షణకు అనుమతిని పొందాడన్నమాట. నాయనా! నా





అవతార లక్ష్యం పరిసమాప్తమయింది, దుష్ట క్షత్రం నశించి ధర్మరక్షణ క్షాత్రానికి తెరలేచింది, ఇక ధర్మరక్షణ భారం నీదే అని అనుమతినిచ్చాడట రామునికి పరశురాముడు.

**భావ వివరణ:**

కౌసల్యానందనుడవైన (కౌసల్యాదేవికుమారుడవైన) రామా! నీవు కమలాప్తకుల (సూర్యవంశమున జన్మించిన) రామచంద్రుడవు భాసురవరదుడవు (శోభాయమానమైన వరములననుగ్రహించువాడవు). పరిపూర్ణమైన జయమునిచ్చు రామయ్యవు.

మునుపు (ఇదివరలో) నీవు దశరథరాముడవై తమ్ముల ముగ్గురితో జన్మించావు. తాటకను సంహరించి విశ్వామిత్రుని జన్నము (యజ్ఞమును) గాచినావు (రక్షించినావు) వెనుకొని (తదనంతరము) శివధనస్సును విరిచి సీతాదేవిని పెండ్లాడినావు. పరశురామునిచే అనుమతిగైకొని దుష్టశిక్షణకు శ్రీకారం చుట్టితివి. అవతారావిష్కరణకు పూనుకొన్నావు.

చుప్పనాతి అని పేరుగాంచిన శూర్పనఖను శిక్షించి స్త్రీయని వదలినావు. సొరిది (ఆక్రమములో) అనేక మంది ఋషులను రక్షించినావు. ఆవెనుక ఖరదూషణాదులను సంహరించితివి. చొప్పుతో (ఆవిధముగా) మాయామృగమును (మాయలేడిని) సోదించి హరించితివి (వెదకి సంహరించితివి. హనుమంతునికప్పి (బ్రాహ్మణునివలె వచ్చిన హనుమంతుని గుర్తించి బంటుగా నేలుకొంటివి.

సొలసి (పరిక్రమించి) వాలిని అడచితివి (సంహరించితివి) సుగ్రీవుని గూడుక (కూడుకొని) జలధిని బంధించి సేతువును నిర్మించి, లంకను జయించితివి. వెలయ (అతిశయించి) రావణాసురుని గెలిచి విభీషణునికి మన్నింపుతో లంకారాజ్యప్రదానము చేసితివి. ఆపై అయోధ్యలో పట్టాభిషిక్తుడవైనావు. ఓ శ్రీవేంకటేశ్వరా! అదయ్య నీరామ గాథ. ఇది విని తరించామయ్యా!

సంపుటి: 2 కీర్తన : కలశాపురముకాడ గాచుకున్నాడు
సంఖ్య : 216 పుట : 145 రాగం: మాళవి

### మాళవి

55 కలశాపురముకాడఁ గాచుకున్నాఁడు
వలసినవరాలిచ్చీ వాయునందనుఁడు ॥ పల్లవి॥

మాయాబిలముచొచ్చి మగుడి యంబుధిలోని-
చాయాగ్రహముఁ జంపి చయ్యన దాఁటి
ఆయెడ లంకిణిఁ గొట్టి యంతలో జానకిఁగని
వాయువేగానవచ్చిన వాయునందనుఁడు ॥కల॥

కడలిదరినుండిన కపులతోఁ గూడుకొని
వడదీరఁగా మధువనము చొచ్చి
బడి రామునికి సీతాపరిణామమెల్లాఁ జెప్పె
వడిగలవాఁ డితఁడు వాయునందనుఁడు ॥కల॥

రావణాదిరాక్షసుల రామునిచే సాధింపించి
ఆ విభుని సీతఁ గూర్చి అయోధ్యనుంచె
శ్రీవేంకటేశుఁ గొల్చి శిష్టరక్షణమునకై
వావిరి నిలుచున్నాఁడు వాయునందనుఁడు ॥కల॥216

**అవతారిక:**

కలశాపురములో వెలసిన హనుమంతునిపై చక్కటి కీర్తన చెబుతున్నారు అన్నమాచార్యులవారు. వాయుసుతుడైన ఈ హనుమంతుడు తన భక్తులకు కావలసిన వరములనిస్తున్నాడు. ఆయన అందుకోసమే కాచుకొనివున్నాడు అంటున్నారు. ఆ హనుమంతుడు సీతను రామచంద్రుని కలిపి అయోధ్యనుంచే శ్రీవేంకటేశుని గొల్చి శిష్టరక్షణకై వావిరి నిలుచున్నాడట. అంటే 'అధికుడై" నిలుచున్నాడట. పనిలోపనిగా హనుమంతుని ప్రతాపాన్ని వివరించే రామాయణ అంతర్గత కథలను వుటంకిస్తున్నారు.





**భావ వివరణ:**

ఈ వాయునందనుడైన హనుమంతుడు, కలశాపురము వద్ద కాచుకొని యున్నాడు (నిరీక్షించుచున్నాడు). శ్రీరామ భక్తులకు, తనను నమ్మిన భక్తులకు ఆయన లెక్కకు మించిన వరములను అనుగ్రహించుచున్నాడు.

సీతాన్వేషణ సమయంలో మాయాబిలం (గుహ)లో ప్రవేశించిన వానరులు దిక్కుతోచక అల్లాడుతుంటే, ఆపద్బాంధవుడై ఆదుకొన్నదీ హనుమంతుడే. మగుడి (తదనంతరం) అంబుధి దాటే సమయంలో 'సింహిక' నీడ వలె తననాక్రమించి రామకార్య విఘాతమునకు వొడిగడితే దానిని చంపివేశాడు. లంకలో లంకిణిని ఒక్క గుద్దుతో మట్టి కరిపించాడు. అంతలో జగన్మాత జానకీదేవిని అశోకవనంలో చూచి రామకార్యం నెరవేర్చి వాయువేగాన తిరిగివచ్చి కపివర్యుల ప్రాణాలు నిలబెట్టాడు. ఈ వాయునందనుడు జగజ్జెట్టి.

ఆపైన కడలి దరి నుండిన కపులతో (సముద్రం ఒడ్డున తనకోసం నిరీక్షిస్తున్న వానరులతో) గూడుకొని (కలసి) వడదీరగ (అలసటనుపశమించుటకు) మధువనము ప్రవేశించి నానా అల్లరి చేశాడు. అటు పిమ్మట సత్వరమే రామునికి సీతాదేవి పరిణామము (వర్తమానము) నెల్లా వివరించాడు. ఈ వాయునందనుడు వడిగలవాడు (చాలా వేగము కలవాడు).

ఆ వెనుక జరిగిన రామరావణ యుద్ధంలో ఈయన పాత్ర మరువలేనిది. రావణాది రాక్షసులనందరిని రామునిచేత సాధింపించినవాడు (నెగ్గుటకు దోహదపడినవాడు) ఈయనే. ఆ విభునికి (శ్రీరామచంద్రునకు) సీతను గూర్చి (కలిపి) అయోధ్యలోవుంచి (పున: ప్రతిష్ఠించినాడు). నేడు ఈ కలియుగంలో శ్రీవేంకటేశ్వరుడై నిలిచిన తన రాముని గొల్చుచున్నవాడై ఈనాటి ఆవశ్యకతననుసరించి శిష్ట రక్షణకై (సన్మార్గులను సంరక్షించుచూ) ఈ వాయునందనుడు కలశాపురములో వావిరి (అధికుడై) నిలుచునియున్నాడు. ఈ స్వామిని సేవించి తరించండి.

సంపుటి: 2 కీర్తన : సర్వేశ్వరా నీతో సరియెవ్వరు
సంఖ్య : 303 పుట : 203 రాగం: ముఖారి

**ముఖారి**

56 సర్వేశ్వరా నీతో సరి యెవ్వరు
పూర్వపువారు చెప్పఁగాఁ బూఁచి కొలిచిఏఁగాని ॥ పల్లవి॥

చేరి వేదములు నిన్నుఁ జెప్పఁగా వినుటేకాని
నీరూపము దర్శించేవార లెవ్వరు
ధారుణిలో నీ యవతారాలే చూచుట
ధీరత నీమహిమలు తెలిపేవారెవ్వరు ॥సర్వే॥

భూమివాకరిఁ జూచి నిన్నుఁ బూజలు సేయుటగాని
కామించి నీతో మాటాడే ఘను లెవ్వరు
దీమసాన నీదాసుల ద్రిష్ట మెరుఁగుటగాని
యీమేర నీదైవిక మెరిఁగేనా రెవ్వరు ॥సర్వే॥

వరములు నీవియ్యఁగా వచ్చి సేవించుటగాని
కెరలి నీమూర్తి వెదకేవా రెవ్వరు
హరి శ్రీవేంకటేశా నీకరుణవారౌటగాని
ఆరసి నిన్ను సుద్దులడిగేవా రెవ్వరు ॥సర్వే॥

**అవతారిక:**

భూమి మీద ఇంతమంది 'దేవుడు' అని కొలిచే వాడిని చూసిందెవరు? పోనీ ఆ దేవుడి మాటలను విన్నదెవరు? పూర్వము వారు చెప్పగా ఔనేమో అనుకోవడమే కాని ఆయన అనుభవం పొందినవాడెవడు? సర్వేశ్వరుడైన ఆయనతో సరియైనవారు లేరు. ఆయననుంచి ఏవో వరాలు ఆశించి సేవించే వారేగాని ఆయనను తెలుసుకోవాలని వెదకేవారేలేరు అంటున్నారు అన్నమాచార్యులవారు. ఇదికూడా తేలిక అనిపించే అతి





క్లిష్టమైన కీర్తన. ఈ కీర్తన పాడినప్పుడు ఆచార్యులవారి మనోభావాలు సులభగ్రాహ్యం అనిపించుటలేదు. జాగ్రత్తగా పరిశీలిద్దాం.

**భావ వివరణ:**

ఓ సర్వేశ్వరా! నీతో సరియైన వారలెవ్వరు? పూర్వపువారు (మా పెద్దలు) చెప్పగా ఔనేమో నని పూచి (ప్రయత్నపూర్వకంగా) కొలుస్తున్నాను. కానీ నిన్ను తెలుసుకోలేకున్నాను.

ప్రభూ! వేదము నీగురించి వర్ణించగా వినుటయే కాని నీ రూపమును దర్శించినవారలెవ్వరు? ధారుణి (భూలోకంలో) నీయవతారాలను చూచిన వారు ఆయా యుగాలలో వున్నారేమో గాని ధీరతతో (గాఢమైన నమ్మకంతో) నీ మహిమను తెలిసినవారెవ్వరు?

దేవా! ఈ భూమి మీద వున్న మాతోడి మానవులనుచూచి వారుచేసినట్లే నిన్ను పూజిస్తున్నాను. నిజానికి కావాలని ప్రయత్నించి నీతో మాట్లాడిన మానవమాత్రుడెవడు? అంతటి ఘనులెవ్వరైనా ఉన్నారా? దీమసాన (నేర్పుతో) నీదాసులయొక్క ద్రిష్టము (అదృష్టము) యెంతగొప్పదో తెలుసుకోవటమేకాని, యీమేర (వైపున) నీ దైవికము (దివ్యశక్తిని) యెరిగే వారెవరున్నారు? అనుభవేక వేద్యమైన నీ మహిమ తెలియుటెట్లు సాధ్యము?

దేవా! నీవు కోరిన వరములిస్తావనే ఆశతో దూరభారమునెంచక నీవద్దకు వచ్చి సేవించేవారేగాని, కెరలి (అతిశయించి) నీ మూర్తిని (దివ్యమంగళ రూపాన్ని) వెదకే వారెవ్వరున్నారు? ఓ శ్రీహరీ! ఓ శ్రీవేంకటేశ్వరా! అంతా నీ కరుణ పొందాలనుకొనేవారే కాని, నిన్ను అరసి (నీపై దృష్టి సారించి) నీ సుద్దులు (నీపుణ్యకథలు) అడిగేవారెవ్వరు? (వినాలని తహతహలాడేదెవరు?) హతవిధీ! నేటి పరిస్థితి ఇంకా ఘోరంగా వున్నది తండ్రీ!

సంపుటి: 2 కీర్తన :పేరు నారాయణుడవు బెంబాడిచేతలు నీవి
సంఖ్య : 162 పుట : 109 రాగం: సాళంగనాట

## సాళంగనాట

57 పేరు నారాయణుఁడవు బెంబాడిచేఁతలు నీవి
నోరు మూసుకున్నఁ బోదు నున్ననినీసుద్దులు ॥ పల్లవి॥

వేసులు మాకుఁ జెప్పె విన భారతముగాఁగ
మోస నీపాలముచ్చిమి మొదలుగాను
రాసికెక్క శుకుఁడు రవ్వగాఁ బొగడఁజొచ్చె
ఆసలఁ బరకాంతల నంటిననీసుద్దులు ॥పేరు॥

రంతున వాల్మీకి చెప్పె రామాయణముగాను
సంతగాఁ దాటకాదులఁ జంపినదెల్లా
అంతకముందె నారదుఁ డవి దండెమీటి చెప్పె
యింతటా వేఁటాడి జీవహింసలు సేసినది ॥పేరు॥

వేదుక నజుఁడు చెప్పె వేదముగా నీవు దొల్లి
వోడక మీనై కొన్నాళ్ళుండితివంటా
తోడనే సప్తరుషులు తొల్లియునుఁ జెప్పి రదె
యీడనే శ్రీవేంకటాద్రి నిరవైతి వనుచు ॥పేరు॥162

**అవతారిక:**

నారాయణుడు అంటే నరశరీరమును పొందు భగవంతుడు అని అర్థం. ఈయన పేరు నారాయణుడు కాని ఈయన చేతలు మాత్రం బెంబాడి చేతలు. బెంబేలెత్తిపోయే పనులు చేస్తాడట ఆయన. ఆ నున్నని సుద్దులు నోరుమూసుకుంటే మాయమైపోవు. యుగయుగాలుగా అవి ప్రచారమవుతూనే వుంటాయి. భారతం వ్రాసిన వేసులు (వ్యాసులవారు), భాగవతం చెప్పిన శుకుడు, రామాయణ కావ్యకర్త వాల్మీకి, వాటిని అంతకుముందె గానంచేసి నారదుడు శ్రీహరి లీలలు పొగిడారు. సప్తఋషులు కూడా తిరుమలలో





ఆయనను సేవిస్తూనేవున్నారుకదా! నీకథలు యెన్నని చెప్పగలము యెంతని చెప్పగలం, అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావ వివరణ:**

ఓదేవదేవా! నీపేరు నారాయణుడు. అంటే నరరూపం ధరించినవాడవు. కాని నీ చేతలు (పనులు) బెంబాడి చేతలు. (బెంబేలెత్తించే పనులు). నున్నని నీ సుద్దులు (మనోహరమైన నీ కథలు) నోరుమూసుకున్నన్ పోదు (ఇంకొకరికి చెప్పనంతమాత్రాన తెలియకుండాపోవు). ఎందుకంటే యుగానికి ఒకడు పుట్టి వాటిని ప్రచారం చేస్తూనే వుంటాడు.

ద్వాపరయుగంలో వేసులు (వేదవ్యాసులవారు) పుట్టి మాకు వినుటకు భారతగాథను చెప్పినారు. నీవు పాలు వెన్న దొంగిలించటం, మోసంతో యుద్ధంలో పాండవులకు సాయం చేయటం మొదలైన కథలన్నీ చదివాం. రాసికెక్క (ప్రసిద్ధమైన) శుకమహర్షి రవ్వగా (నాణ్యమైన విధమున) ఆసల (వ్యామోహంతో) నీవు పరకాంతలనంటిన సుద్దులు (పరాయిస్త్రీల పొందునాసించితివని కథలు కథలుగా) బొగడ జొచ్చె (కీర్తించాడు). అదే భాగవతమై జగత్ప్రసిద్ధమైనది.

త్రేతాయుగంలో వాల్మీకి మహర్షి సంతగా (వల్లెవేసినట్లు) నీవు రామచంద్రునిగా తాటక మొదలైన రాక్షసులను జంపినదెల్లా రామాయణములో రంతున (పెద్దగా ధ్వనించునట్లు) చెప్పినాడు. (అంతకు ముందే (కృతయుగారంభంలోనే) నారదుడు బ్రహ్మమానసపుత్రుడై అవతరించి దండె మీటి (మహతి అనే తన వీణను మీటుతూ) నీవు వేటాడి జీవహింస (దుష్టసంహారం) చేస్తావని, యింతటా (ఈలోకమంతా) చాటినాడు.

అసలు వేదకాలంలోనే అజుడు (బ్రహ్మ) వేదమువలె నీవు మీనై కొన్నాళ్ళుండితివంటా మత్స్యపురాణంలో నీ చేతలన్నీ వోడక (వదలక) కీర్తించాడు. తోడనే (దానితోపాటే) తొల్లియును (అనాదిగా) సప్తఋషులు, యీడనే ఈ తిరుమల శిఖరాలమీద, ఈ శ్రీవేంకటాద్రిపై ఇరవైతివని (నెలకొంటివని) అనుచూ అదె (ఆ మాటనే) చెప్పిరి. మరి ఈ నాటికీ మేము తెల్లవారింది మొదలు నీపై పాడుతున్నామంటే... అది వారందరి చలువవల్లనే తండ్రీ!

సంపుటి: 2　　కీర్తన : ఇతని కితడేకాక యితరులు సరియా
సంఖ్య : 405　　పుట : 273　　రాగం: నాట

**నాట**

58 ఇతని కితఁడేకాక యితరులు సరియా
మితి లోకా లితనిమేనిలోనేకావా ॥ పల్లవి॥

కమలనాభుని భయంకర కోపముతోడ
రమణ వేరొకరివరంబులు సరియా
తమితోడఁ దల దుంచి తగినవరము లిచ్చె
అమరఁగ నరకాసురాదులకు నితఁడు ॥ఇత॥

కరివరదుని పేరుగలసిన తిట్లతో
పరదేవతలమంత్రపఠనలు సరియా
నిరతి శిశుపాలునినిందకు శిక్షించి
పరలోక మిచ్చినట్టిభావము వినరా ॥ఇత॥

చలిమి శ్రీవేంకటేశు శరణాగతితోడ
బలిమి మించిన బ్రహ్మపట్టము సరియా
నొలిసిన ధ్రువునకు వున్నతలోక మిచ్చె
అలబ్రహ్మలోకమున కదె మీఁ దెఱఁగరా ॥ఇత॥

**అవతారిక:**

అనుగ్రహించుటలో ఇతనికితడే సాటి. లోకాలన్నీ ఈయనలోనే వున్నాయి కనుక ఇతనికి మరొకరు సరియెట్లగుదురు? అంటున్నారు అన్నమాచార్యులవారు. ఈయన కోపగించినా అన్యదేవతల అనుగ్రహంకంటే నయమే; ఈయనకు నిందకూడా పరదేవతల మంత్రపఠనకన్నామేలు చేస్తుంది; ఈయన శరణాగతి బ్రహ్మపట్టముకంటే బలమైనది. ఈ నా మాటలు నోటిమూటలు కావు సాక్ష్యంకూడా వున్నది.





నరకాసురుడు, శిశుపాలుడు, ధ్రువుడు... వీళ్ళంతా సాక్షులే అని తన వాదనను వినిపిస్తున్నారు. అన్నమయ్య వైష్ణవ పక్షపాతి అనిపించినా ఆయనవాదన అమోఘం. హరి మురిసెడి కీర్తనములు అమ్మకుచెల్లా!!

**భావ వివరణ:**

ఓ భక్తులారా! ఇతనికితడే సాటి. ఇతరులు ఈతని సరియౌదురా? పరిమితిలేని లోకములన్నియును ఇతని మేనిలోనివే (దేహంలో వున్నాయి) కావా? (వున్నవి కదా! అని అర్థం)

ఆ పద్మనాభుని భయంకరమైన కోపముతో, అన్యదేవతల వరదానములకంటే మంగళమే జరుగుతుంది. వారి వరములు ఈయన ఆగ్రహంతో సమానం కాదు. ఎందుకంటే నరకాసురుడి విషయంలో యేం జరిగిందో చూడండి. తమితో (ఆసక్తితో) శ్రీకృష్ణుడు నరకుని తల తెగనరికినా ఆయన వరప్రభావముచే నరకచతుర్దశి ఒక పండుగై జగత్ప్రసిద్ధమైనది. కాబట్టి ఈ శ్రీహరి అమరిన ఆగ్రహమే గొప్ప మేలు చేస్తుంది.

కరివరదుడు (గజేంద్రరక్షకుడు) అయిన శ్రీహరి పేరుతో జతకలిసిన వారినిందలే మనకు అధికమైన మేలు కలుగజేస్తాయి. పరదేవతల మంత్ర పఠనం హరినింద చేసే పాటి మేలు కూడా చేయదు. నిరతి (విశేషంగా) శిశుపాలుడు శ్రీకృష్ణుని తిట్టీ తిట్టీ చివరికి మేలే పొందాడు కదా! శిశుపాలుని శిరస్సు సుదర్శన చక్రంతో తెగిక్రిందపడ్డా వాడికి హరిద్వార-పాలకపదవీ వైకుంఠ ప్రాప్తి దక్కాయి కదా!

చలిమి (చల్లని) శ్రీవేంకటేశ్వరుని శరణాగతితో, మించిన (శ్రేష్ఠమైన) బ్రహ్మపట్టము (బ్రహ్మపదవి) కూడా సరిపోదు. ఒలిసిన ధ్రువునకు (తనకు కావలసిన ధ్రువునకు) శ్రీహరి ఉన్నత లోకాలిచ్చాడు. ఎందుకంటే బ్రహ్మలోకముపైనున్న ధ్రువమండలాన్ని స్థిరలోకంగా తన భక్తునికిచ్చాడు ఆ నారాయణుడు. నేటికీ పలువురికి మార్గదర్శకమయ్యాడు ఆ చిన్నారి బాలుడు.

సంపుటి: 2    కీర్తన : విష్ణుడొక్కడే విశ్వాత్మకుడు
సంఖ్య : 345    పుట : 232    రాగం: నాట

**నాట**

59 విష్ణుఁ డొక్కఁడే విశ్వాత్మకుఁడు
వైష్ణవమే సర్వంబును ॥ పల్లవి॥

పరమేష్ఠి సేయు బ్రహ్మాండసృష్టియు
హరునిలోని సంహారశక్తి
పరగఁగ నింద్రుని పరిపాలనమును
అరిసిచూడ శ్రీహరిమహిమ ॥విష్ణుఁ॥

యిలఁబంచభూతములలో గుణములు
అల నవగ్రహవిహారములు
తలకొను కాలత్రయధర్మంబును
అలరఁగ నారాయణునిమహిమలే ॥విష్ణుఁ॥

అంతటఁ గలమాయావిలాసములు
పొంతఁ బరమపదభోగములు
మంతుకునెక్కి నమరిసమస్తమును
యింతయు శ్రీవేంకటేశుమహిమలే ॥విష్ణుఁ॥

**అవతారిక:**

ఈ విశ్వమే తన ఆత్మవలె వున్న సర్వేశ్వరుడు విష్ణువు ఒక్కడే. సృష్టిలో సమస్తమూ ఆయనచే, ఆయన కొఱకు ఆయనదే అయివున్నది. అందుకనే సర్వమూ వైష్ణవమే అంటున్నారు అన్నమాచార్యులవారు. హరుడు, విరించి, సురపతీ... వారివారి బాధ్యతలను శ్రీహరిమహిమవల్లనే నెరవేరుస్తున్నారు. పంచభూతాలు, నవగ్రహాలు, త్రికాలములూ, నారాయణుని మహిమవల్లనే తమ ధర్మం నెరవేరుస్తున్నాయి. ఆఖరికి



అంతయు నీవే హరిపుండరీకాక్ష

పరమపదప్రాప్తి దక్కాలన్నా తిరుమలేశుని దీవెన వుండాల్సిందే. ఇంతయూ శ్రీవేంకటేశుమహిమ అంటున్నారు.

**భావ వివరణ:**

అనంతమైన ఈ విశ్వమంతా, అణురూపుడై ఆత్మరూపుడై విలసిల్లుతున్నది విష్ణువు మాత్రమే. స్థావరజంగములన్నింటిలో అనగా కదలికవున్న వాటిల్లోను కదలిక లేనివాటిల్లోనూ కూడా ఆ విశ్వాత్మకుడే. సర్వమూ వైష్ణవమే (విష్ణువునకు సంబంధించినదే).

పరమేష్ఠి (బ్రహ్మదేవుడు) బ్రహ్మాండమున సృష్ఠి వ్యాపారము చేయుచున్నాడు. హరునిలోని సంహారశక్తి చేత జీవకోటి నశించుచున్నది. పరగగా (ఒప్పుగా) ఇంద్రుడు జగత్పరిపాలనా బాధ్యత చేపట్టినాడు. ఆయన క్రింద వివిధ దేవతలు వివిధ శాఖలను నిర్వహింతురు. హరునికి కూడ కాలుడు, యముడు, నవగ్రహములు, భూతపిశాచగణములు ఇత్యాదివి లయకార్యమున సహకరించును. అరసి చూడ (పరికించి చూడగా) ఈ నియమబద్ధపాలనమెల్లా శ్రీహరి మహిమయే అనుననది సుస్పష్టము.

విశ్వరచనా నిర్వహణములలో పంచభూతములదే (భూమి, గాలి, నీరు, కాంతి, ఆకాశము) ప్రధానపాత్ర. ఆ పంచభూతముల గుణములన్నియు నిబద్ధతతోవున్న కారణము విష్ణువే. నవగ్రహముల విహారము (గమనకు) నియంత్రింపజేయుచున్నదీ విష్ణువే. భూత, వర్తమాన భవిష్కత్కాలములను కాలత్రయమందురు. తలకొను (పూనుకొను) ఆ కాలధర్మములను నియంత్రించుచున్నదీ ఈ నారాయణుని దివ్య మహిమయే.

అంతటగల (ఈజగమునందంతా నెలకొన్న) మాయ విష్ణుమాయ. దాని విలాసము (తీరు) తెలియుట యెవరికీ సాధ్యముకాదు. పరమపదభోగము యెవరికి, యెప్పుడు, యెలాదక్కుతుందో, యే పొఒత (యెక్కడైనా) తెలియలేరు. మంతుకునెక్కిన (ప్రసిద్ధికెక్కిన) సమస్తమూ శ్రీవేంకటేశ్వరుని మహిమవల్లనే ఆస్థితిలో వున్నవని తెలుసుకోండి. దాన్ని తెలుసుకోటానికే ఒక జీవితకాలం చాలదు.

సంపుటి: 2 కీర్తన:చూచి మోహించకుందురా సురలైన నరులైన
సంఖ్య : 403 పుట : 272 రాగం: తెలుగు కాంబోది

**తెలుఁగు కాంబోది**

60 చూచి మోహించకుందురా సురలైన నరులైన
తాచి నీవు ముందరఁ బ్రత్యక్షమైనను ॥ పల్లవి॥

భాగీరథి పుట్టినపాదపద్మములు
భోగపు మరునిజన్మభూమి నీతొడలు
యోగపు నవబ్రహ్మలుండిన నీనాభి
సాగరకన్యకలక్ష్మి సతమైనవురము ॥చూచి॥

అందరి రక్షించేటి అభయహస్తము
కంద నసురలఁజంపే గదాహస్తము
సందడిలోకముల యాజ్ఞాచక్రహస్తము
చెంది ధ్రువు నుతియించఁజేయుశంఖహస్తము ॥చూచి॥

సకలవేదములుండే చక్కనినీమోము
వొక్కటై తులసిదేవివుండేటిశిరసు
ప్రకటనపు మహిమలఁ బాయనినీరూపము
వెకలిశ్రీవేంకటాద్రివిభుఁడ నీభావము ॥చూచి॥

**అవతారిక:**

జగన్మోహనుడైన ఈ వేంకటేశ్వరుడే కళ్ళముందు ప్రత్యక్షమైతే మోహించని వాడెవడన్నావుంటాడా? వాడు నరుడాసురుడా అనే తేడానేవుండదు. అందరూ చేష్టలుడిగి అలా చూస్తూనే వుండిపోతారు... నఖశిఖ పర్యంతం, ఇదిగో ఈ భావమునే అన్నమాచార్యులవారు మధురమైన కీర్తనవలె నావిష్కరిస్తున్నారు. "ప్రకటపు మహిమల బాయని నీరూపము వెకలి శ్రీవేంకటాద్రి విభుడ నీ భావము" - అని అంటున్నారు. ఆయన భావము ఆయన రూపంలోనే పాయని మహిమలను ప్రకటిస్తున్నదని అర్థం. భావాలను వివరించటానికి మాటలక్కరలేదు చూపులు చాలు కదా! జాగ్రత్తగా చదవండి మరి.





**భావ వివరణ:**

ఓ దేవదేవా! తాచి (పూనుకొని) నీవు యెవరికన్నులముందైన ప్రత్యక్షమైతే, నిన్ను చూచి సురులైనా, నరులైన మోహించి తీరుతారు. జగన్మోహనుడవైన నిన్ను చూచి మోహించకుండుట యెట్లు సాధ్యము?

నిన్ను ఆపాదమస్తకం వొకసారి చూచే భాగ్యం దక్కితే ఆ జన్మ తరించదా? అదిగో నీ పాదపద్మాలు... పవిత్రమైన భాగీరథి (గంగాదేవి) పుట్టినిల్లు అదేకదా! అవిగో నీతొడలు.. జీవులకు భోగాసక్తిని కలిగించే మరునికి (మన్మథునికి) జన్మభూమి నీవూరువులే. అదిగో నీ నాభి, చతుర్ముఖుడే కాక యోగమున నిష్ణాతులైన నవబ్రహ్మలకు (భృగువు, పులస్త్యుడు, పులహుడు, అంగీరసుడు, అత్రి, క్రతువు, దక్షుడు, వశిష్ఠుడు, మరీచి - తొమ్మిదిమందిని నవబ్రహ్మలు అంటారు. వీరినుంచి రకరకాల జీవులు సృష్టించబడ్డాయి). ఇక జగద్విఖ్యాతమైన సాగరపుత్రిక లక్ష్మికి సతమైన (శాశ్వతమైన స్థానము నీ పురము (వక్షస్థలము).

ఇక నేడు మా దగ్గరకు వస్తే... అదిగో ఆ నడుముపైనున్న అభయహస్తము నీ శరణాగతులకు భయపడకండి మీకు నేనున్నాను అని అభయమిస్తున్నది. అందరినీ రక్షిస్తున్నది. అసురులను కందునట్లు (తపించునట్లు) చేయు నీగద (కౌమోదకము) నీహస్తములలో కానవచ్చుచున్నది. నీ ఆజ్ఞాచక్రము, నీ ఆజ్ఞపైలోకములను సందడించగల (తత్తరబెట్టగల) నైపుణ్యమున్న దివ్యాయుధము. అది అదిగో నీ కుడిచేతిలోనున్నది. ధ్రువునికి నీ దారి చూపుటకు నినదించిన పాంచజన్య శంఖము, అదే నీ యెడమ చేతనున్నది.

ప్రభూ! సకల వేదములకు నెలవైన నీ ముద్దులొలుకు చక్కని వదనము అదిగో. తులసీదేవికి ఒకేఒక స్థిరనివాసమైన నీ శిరస్సు అదే కన్నులకు విందుజేయుచున్నది. ఆవిధంగా అనేక మహిమలను ప్రకటించుచున్న పాయని (విడువలేని) నీ దివ్యమంగళ విగ్రహము ఏ భావముతో చూస్తే ఆ భావముతో కనబడుతున్నది. వెకలి శ్రీవేంకటేశా! (ఆసక్తిని కలిగించు ఓ ఏడుకొండలవాడా!) శరణాగతులకు చల్లనిచూపులే, కుత్సితులకు క్రూరంగా కనుపిస్తాయి. అదే అత్యద్భుతం తండ్రీ!

సంపుటి: 2 కీర్తన : ఇహమెట్టో పరమెట్టో ఇక నాకు
సంఖ్య : 461 పుట : 311 రాగం: సాళంగనాట

## సాళంగనాట

61 ఇహమెట్టో పరమబెట్టో ఇఁక నాకు
సహజమై హరియే శరణము నాకు ॥ పల్లవి॥

చిత్తమిది యొకటే చింత వేనేలసంఖ్య
పొత్తుల హరిఁదలఁచఁ బొద్దులేదు
జొత్తుల కన్నులు రెండు చూపులైతే ననంతాలు
తత్తరించి హరిరూపు దగ్గరి చూడలేదు ॥ఇహ॥

చేతు లివియు రెండే చేష్టలు లక్షోపలక్ష
యీతల హరిఁ బూజించ నిచ్చ లేదు
జాతి నాలిక వొకటే చవులు కోటానఁగోటి
రీతి హరినామ ముచ్చరించ వేళ లేదు ॥ఇహ॥

వీను లివి రెండే వినికి కొలఁదిలేదు
పూని హరిభక్తి విన బుద్ధి లేదు
యీనటన శ్రీవేంకటేశుఁ డిటు చూచినను
తానే యేలె నిఁకఁ దడఁబాటు లేదు ॥ఇహ॥461

**అవతారిక:**

నాకు ఇహలోకంతోకాని, పరలోకంతోకాని పనిలేదయ్యా! నా సహజగుణం ఒక్కటే. అది హరియే దిక్కని శరణాగతితో జీవితాంతం గడుపుట, అంటున్నారు అన్నమాచార్యులవారు. మానవజీవితం అన్నాక... మనస్సులో చింతలు తప్పవు, అనవసరమైన వాటినుంచి చూపులను మరల్చలేము, చేతులతో ఏవేవో వ్యర్థమైన పనులు చేస్తూనేవుంటాము, దేన్నిపడితే దాన్ని లొట్టలేసుకొని తింటాననే దౌర్భాగ్యపు నా నాలుకవున్నది,



అంతయు నీవే హరిపుండరీకాక్ష

ఉన్నవి రెండే అయినా అంతేలేకుండా అన్నీ వినే చెవులున్నాయి. ఇవన్నీ భ్రష్టు పట్టిస్తూనేవున్నాయి. హరిభక్తి మీద బుద్ధినిలవటం లేదు. ఓ శ్రీవేంకటేశ్వరా! శరణు మహాప్రభో శరణు... అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ మానవులారా! ఇక నాకు ఇహమెట్టో (ఇహలోకంలో ఏమవుతుందో) పరమెట్టో (ఊర్ధ్వలోకాలలో ఏమవుతుందో) పనిలేదు. నాకు సహజమైన (సహజసిద్ధంగా నిజాయితీగల) శరణాగతి హరియే (శ్రీహరి మాత్రమే).

నాది యెంత విచిత్రమైన పరిస్థితి అంటే... నాకున్న చిత్తము (మనస్సు) ఒక్కటే కాని దానికున్న చింతలు మాత్రం వేవేలు (వేలసంఖ్యలో వున్నాయి). నేను పెట్టుకొన్న పొత్తులతో (సంగత్వంతో) హరిని తలచుటకు పొద్దులేదు (తీరికేలేదు), జొత్తులకన్నులు (ఎఱ్ఱబారిన కళ్ళు) రెండే, కాని అవి చూచే చూపులకు అనవసరమైన వ్యాపకాలు మాత్రం అనంతం. కాని తత్తరించి (ఆరాటపడి) హరిని దగ్గరనుంచి చూడాలని మాత్రం వాటికుండదు.

నా ఈ చేతులు చూశారా! నాకున్నవి రెండే చేతులు. కాని ఇవి చేసే చేష్టలున్నాయే, అవి లక్షోపలక్ష (అనేక లక్షలు). కాని ఈతల (ఇటుచూస్తే) శ్రీహరిని పూజించాలంటేమాత్రం ఈ చేతులకి ఇచ్చలేదు (కోరిక పుట్టదు). ఇక, జాతి నాలిక (అతిసామాన్య ఔన్నత్యంగల నాలిక) నాకూ ఒక్కటే వున్నది. కాని దానికి కావలసిన చవులు (రుచులు) మాత్రం కోటానుకోట్లు. కాని రీతి (విధాయకంగా) హరినామాన్ని వుచ్చరించటానికి (అనుటకు) వేళలేదు (సమయం దొరకడంలేదు).

వీనులివి రెండే (నాకున్న చెవులు రెండు మాత్రమే). కాని ఇవి వినాలనుకొనే మాటలకి అంతుపొంతులేదు. వాటికి పూనికతో హరిభక్తి గురించి వినండి అంటే వాటికి బుద్ధిలేదు. ఇట్లాంటి నటన (నడవడితో) వున్న నన్ను శ్రీవేంకటేశుడు, ఇటుచూచి, తానే పోనీలే వీడు అర్భకుడు అని జాలిపడి యేలె నన్ను (స్వీకరించి పాలించాడు). అమ్మయ్య! ఇక తడబాటు (తత్తరబాటు) లేదు. ఆయన రక్షణలో బ్రతికేస్తున్నాను. భయం వదిలేశాను.

సంపుటి: 2 కీర్తన : ఇంతటా హరినేకాని యెందునను గాన నన్ను
సంఖ్య : 463 పుట : 312 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

62 ఇంతటా హరినేకాని యెందునను గాన నన్ను
కొంత నాకుఁ దదెలుపరో గురువులాల ॥ పల్లవి॥

తనువూ హరియే తలఁపూ హరియే
వినికి మనికియును విష్ణుడే
కనుఁగొనుచూపులు కమలనాభుఁడే
యెనసి జీవునిశక్తి యేడనేడ నున్నదో ॥ఇంత॥

లోకమెల్ల మాధవుఁడే లోనెల్లఁ గేశవుఁడే
వాకును కర్మము శ్రీవైకుంఠుఁడే
చేకొని చైతన్యమెల్ల శ్రీనారాయణుఁడే
యీకడ నే నను వాఁడ నేడ నుండువాఁడనో ॥ఇంత॥

వెనకను కృష్ణుఁడే వెస ముం దచ్యుతుఁడే
కొనమొదలు నడుము గోవిందుఁడే
యెనయఁగ శ్రీవేంకటేశుమయ మింతాను
అనుగు నాస్వతంత్ర మది యేడనున్నదో ॥ఇంత॥463

**అవతారిక:**

"అంతయు నీవేహరి పుండరీకాక్ష" అని అన్నమాచార్యులవారు హరి శరణాగతి తెలిపారు. ఇప్పుడీ కీర్తనలోనూ "ఇంతటా హరినే (శ్రీహరియే)... కాని (అంతేకాని) నన్ను యెందుననుగాన" అంటున్నారు. "గురుతుల్యులైన పెద్దలారా! ఇప్పుడు కొంత నాకు దెలుపరో (నాక్కొంచెం వివరంగా చెప్పండయ్యా!)" అంటున్నారు. పుట్టిన దేహానికి పెరుగుట తరుగుట మరణించుట యే శక్తివలన జరుగుతున్నది? ఆ శక్తి యెక్కడుంది? "నేను" అని పిలుచుకుంటున్నవాడు యెక్కడవున్నాడు?





మొదలు, నడుము, కొన - అన్నీ గోవిందుడే. వెనుకా వాడే, ముందునా వాడే అచ్యుతుడు. ఇంతాను (ఇదంతా) శ్రీవేంకటేశుని మయము. ఇక నా స్వతంత్రం యెక్కడుందయ్యా! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ గురువులాల! (గురు పుంగవులారా!) కొంత నాకు దెలుపరో (నాకు కొంచెము వివరించండయ్యా!) ఇంతటా హరినే (ఈ సృష్టిలోని ఇదంతా శ్రీహరియే వున్నాడు). కాని (అంతేకాని) నన్ను యెందునను గానను.

తనువు పుట్టినదాది పెరిగి, ముసలిదై నశిస్తున్నది. దీంట్లో శ్రీహరి వుండకపోతే అది సాధ్యమా? కనుక తనువు హరియే. ఒక క్షణంలో లెక్కించలేనన్ని ఆలోచనలలో హరిలేడనగలమా? కనుక తలమపులోనూ హరియే. వినికి (శ్రవణశక్తి), మనికి (జీవనాధారమూ) విష్ణువే. కనుగొనుచూపులలో కూడా కమలనాభుడైన హరివుండబట్టే అంతగొప్ప దృష్టిజ్ఞానం కలుగుతున్నది. ఎనసి (వ్యాపించు స్వభావముగల) జీవుని శక్తి ఏయేరూపాలలో వుంటుందో యెవరికి తెలుసు?

ఈలోకమంతా మాధవుడే. లోనెల్లా (నాలో అంతా) మాధవుడే, వాకును కర్మము (చేయించిన కర్మయు) వైకుంఠుడే (విష్ణువే). చేకొని (నిర్వహించి) మా చైతన్యము (చేతనాశక్తి) అంతా శ్రీనారాయణ మూర్తియే. ఈకడ (ఇదిట్లయిన) 'నేను' అనేవాడు నాలో యెక్కడున్నాడో కదా! ఎందుకంటే చేతనలేని సుషుప్తి (గాఢనిద్ర)లో నాగురించిన జ్ఞానమే నాకులేదే. మరి అప్పుడు ఆ 'నేను' ఏడీ. ఎవరన్నా తట్టి లేపగానే, నన్నెందుకు లేపావు అంటున్నానే... ఎవడా 'నేను'?

నా వెనుకనున్నదీ కృష్ణుడే. ముందరవున్నదీ కేశవుడే. నామొదలు, మధ్య, తుది గోవిందుడే. ఆ విధంగా నన్నంతా ఆవరించి అచ్యుతుడే అయి వున్నాడు అతిశయించగా, ఇదంతా శ్రీవేంకటేశుని మయమే. ఇటువంటి పరిస్థితుల్లో నేనేం చేసినా, నేనేం ఆలోచించినా, నేనేం మాట్లాడినా నేను కర్తనా? కానే కాదు. నా అనుగు స్వతంత్రము (నాకు ప్రియమైన స్వేచ్ఛ) యేదీ? లేనే లేదు.

సంపుటి: 3 కీర్తన : మా దురితములు వాపి మమ్ము గాచు టరుదా
సంఖ్య : 434 పుట : 292 రాగం: బౌళి

**బౌళి**

63 మా దురితములు వాపి మమ్ము గాచు టరుదా
శ్రీదేవిరమణుడ శ్రీ వేంకటేశ ॥ పల్లవి॥

అంబరీషు పైకొన్న ఆపదలన్నియు బాపి
వెంబడి గాచే నీచే పెనుచక్రము
అంబరాననున్న ధ్రువు నజ్ఞానమెల్ల బాపి
పంబి నీచేతనుండిన పాంచజన్యము ॥మా దురిత॥

పక్కన జరాసంధు బలమెల్ల నుగ్గాడి
నిక్కము మధురనిల్పే నీచే గద
తొక్కి హిరణ్యకశిపు దునిమి ప్రహ్లాదు గాచే
నిక్కి నిక్కి మెరిసేటి నీ ఖడకగము ॥మా దురిత॥

వెడ రావణుని జంపి విభీషణుని గాచే
చిదుముడి పడక నీచే శార్ఙ్గము
యెడమీక శ్రీ వేంకటేశ నేడు నన్ను గాచె
బడిబడి నీ నామపఠన నేడిదిగో ॥మా దురిత॥434

**అవతారిక:**

ఓ శ్రీదేవివల్లభా! శ్రీవేంకటేశ్వరా! నీకు అన్ని ఆయుధాలు వున్నాయి కదా! ప్రభూ! మా పాపములను బద్దలుకొట్టి మమ్మల్ని కాపాడవయ్యా! అంటున్నారు అన్నమాచార్యులవారు. శ్రీహరి సుదర్శన చక్రము, పాంచజన్య శంఖమూ, కౌమోదకి గద నందకము అనే ఖడ్గము, శార్ఙ్గము అనే ధనస్సు యెన్నెన్నో ఘనకార్యాలు చేశాయి ఇదివరలో. ఇప్పుడు ఈ కలియుగంలో మా పాపాలే మా పాలిటి రాక్షసులు. వీళ్ళని నిర్మూలించటానికి నీ ఆయుధాలతో పనిలేదు, నీ నామపఠనం చాలు. అదే బడిబడి (దృఢమైన) దై మమ్మల్ని రక్షిస్తుంది అంటున్నారు. పంబి అంటే అతిశయించి అని అర్థం.





**భావ వివరణ:**

శ్రీదేవీ వల్లభుడవైన ఓ శ్రీవేంకటేశ్వరా! మా దురితములు (పాపములు) వాపి (నిర్మూలించి) మమ్మున్ కాచుట (రక్షించుట) అరుదా? (అంత అపూర్వమైన విషయమా తండ్రీ!)

ఇదిగో నీచే (నీచేతిలోనున్న) ఈ పెనుచక్రము (గొప్ప సుదర్శన చక్రము) నీ భక్తుడు అంబరీష మహారాజుపై ఆగ్రహించిన దుర్వాసమునికి బుద్ధిచెప్పి, పైకొన్న ఆపదలను బాపి వెంటనే రక్షించింది కదా! మరి, నీ వామహస్తముననున్న శంఖము కనిపిస్తున్నదే... దానిపేరు పాంచజన్యము. దానిధ్వని పామరుల అజ్ఞానం మాన్పి నీవైపు త్రోవచూపిస్తుంది. అదిగో అంబరాన (ఆకాశంలో) ధ్రువతారయై కాంతులు జిమ్ముతున్న నీ బాలభక్తుడు ధ్రువుని అజ్ఞానం తొలగించి, నీచేత పంబి (అతిశయించి) వున్నది.

అదిగో నీచేతిలోనున్న “గద” దానిపేరు కౌమోదకము. అది నీ శత్రువులను దంచి నుగ్గాడుతుంది (తుత్తునియలు చేస్తుంది). ఆనాడు నీపక్కలో బల్లెమువలె మాటిమాటికి మధురపై దండెత్తి నీకు చీకాకు కలిగించుచున్న కంసుని మామగారు... జరాసంధుని అనేకసార్లు బలహీనుని చేసిన పిమ్మట నీచేతిలో నిక్కము (స్ఫుటంగా) మెరయుచున్నది. అదిగో నీచేతిలో నిక్కి నిక్కి (తొంగిచూస్తూ) మెరిసే ఖడకగము (ఖడ్గము). దానిపేరు నందకము. ఆనాడు నీవు నృసింహుడవై హిరణ్యకశిపుని చీల్చి సంహరించి ప్రహ్లాదుని కాచినప్పుడు వాని అనుచరులు మూకుమ్మడిగా నీపై బడితే నీనందకం వారిని చీల్చి చెండాడినది. నేడు నీ చేతిలో మెరుస్తున్నది.

అదిగో సమీపమున నీచేత మెరయు నీ ధనస్సు. దానిపేరు శార్ఙ్గము (సారంగము) అదే త్రేతాయుగంలో నీవు శ్రీరామచంద్రమూర్తివైనప్పుడు వెద (వేదించు) రావణాసురుని నిర్జించి నీ భక్తుడు విభీషణుని రక్షించి, చిదుముడి పడక (కలతపడకుండా) చేసినది. ఓ శ్రీవేంకటేశ్వరా! నేడు కలియుగంలో ఇదిగో, యెడమీక (విశ్రాంతికూడా తీసికొనకుండా) నన్ను (నాబోటి ఆర్తులను...) బడిబడి (దృఢముగా) కాపాడుతున్న గొప్ప ఆయుధం. దానిపేరు “ఓం నమో వేంకటేశాయ” – ఆ నామపఠనమే నన్ను అనుక్షణం రక్షిస్తున్నది.

సంపుటి: 2 కీర్తన : ఎవ్వరి భాగ్యంబెట్టున్నదో
సంఖ్య : 43 పుట : 29 రాగం: భైరవి

## భైరవి

64 ఎవ్వరిభాగ్యం బెట్టున్నదో
దవ్వు చేరువకు తానే గురుతు ॥ పల్లవి॥

పరమమంగళము భగవన్నామము
సురులకు నరులకు శుభకరము
యిరవుగ నెఱిగిన యెదుటనె ఉన్నది
వరుసల మఱచిన వారికి మాయ ॥ఎవ్వరి॥

వేదాంత సారము విష్ణుభక్తియిది
ఆదిమునులమత మయినది
సాధించువారికి సర్వసాధనము
కాదని తొలగినకడుశూన్యంబు ॥ఎవ్వరి॥

చేతి నిధానము శ్రీ వేంకటపతి
యేతల జూచిన నిందరికి
నీతియు నిదియే నిజసేవకులకు
పాతకులకు నది భవసాగరము ॥ఎవ్వరి॥

**అవతారిక:**

ఎవరి అదృష్టం యెలావుంటుందో యెవరు చెప్పగలరు? అని పాడుతున్న అన్నమాచార్యులవారిని ఆలకించండి. “దవ్వు చేరువకు తానే గురుతు” అంటే, యెవ్వడు ఆయనకు దూరమైనవాడో, యెవరు దగ్గరవాడో తానే తెలిసినవాడు. ఇంకెవరికీ తెలియదు అని అర్థం. ఆనాడు శిశుపాలుడి తల నరికాడు కాని వాడు ఆయన నమ్మిన ద్వారపాలకుడు. “బావా! యెప్పుడు వచ్చితీవు” అని ధుర్యోధనుణ్ణి ఆప్యాయంగా పలుకరిస్తాడు. కాని తొడలు విరగకొట్టించి





చంపించాడు. మరి మనబోటి వారేం చేయాలి? సత్ప్రవర్తనతో, శరణాగతితో, స్థిరభక్తితో, ఆ ఏడుకొండలవాడిని సేవించడం. అట్లా చేయనివారి గతి యేమిటి? భవసాగరంలో కొట్టుమిట్టాడటమే.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఎవ్వరి భాగ్యం (అదృష్టము) యెట్లా వుంటుందో, యెవ్వరు చెప్పగలరు? “దవ్వు చేరువకు తానే గురుతు” (ఆ సర్వేశ్వరునకు ఎవ్వరు దూరమో? ఎవ్వరు దగ్గరవారో? ఎవరు చెప్పగలరు?)

భగవన్నామసంకీర్తనము పరమమంగళకరమైనది. అది నరులకే కాదు సురులకు (దేవతలకు) కూడా శుభప్రదమైనది. ఇరవుతో నెరిగిన (సమూలంగా తెలిసికొంటే), అది యెదుటనే వున్నది. అంటే దాని ఫలితం ప్రత్యక్షంగా కనబడుతుంటుంది. వరుసల మరచిన (దేవుడెవరు జీవుడెవరు అనే క్రమము మరచినచో) వారికి మాయ (వారు మాయకు లోనై తామే అధికులమని హిరణ్యకశిపునివంటి భ్రష్టులైపోతారు).

వేదము విష్ణువును కీర్తిస్తుంటే... వేదాంతము యొక్క సారము విష్ణు భక్తిని ప్రతిపాదిస్తున్నది. ఆదికాలమునాటి మునులయొక్క మతము కూడా విష్ణుభక్తియే. సాధనతో విష్ణుభక్తిని పెంపొందించుకొంటే వారికి సర్వమూ సాధ్యమవుతాయి. విష్ణుని కాదని తొలగిన (దుర్యోధనుడు తనకి కృష్ణుడు వద్దు, కాని కృష్ణుని యాదవ సేన కావాలని కోరుకున్నాడు) కడు శూన్యము (ఏదీ దక్కదు) మిగులుతుంది.

శ్రీవేంకటేశ్వరుడు చేతిలోవున్న నిధానము (నిధివంటివాడు.) ఏతలజూచిన (ఏవిధంగా చూచినా) ఇందరికి (ఈ జీవకోటికి) నీతియు (ధర్మవంతమైనది) ఆ దేవదేవుని శరణాగతియే. నిజసేవకులకు (అసలైన హరిదాసులకు) ఇదియే దిక్కు. మరి పాతకులకు (పాపాత్ములకు) అది భవసాగరమున (సంసార సాగరంలో) మునక. ఇంతవరకు అందులో మునిగినవాడు తేలలేదు. తేలడు.

సంపుటి: 21 కీర్తన : అంగనకు విరహమే సింగారమాయ
సంఖ్య : 415 పుట : 277 రాగం: చారుకేశి

## చారుకేశి

65 అంగనకు విరహమే సింగారమాయ
చెంగట నీవేయిది చిత్తగించవయ్యా ॥ పల్లవి॥

కలికి నిన్ను తలచి గక్కున లోలో కరగి
జలజల చెమరించి జలకమాడే
బలు తమకాన నీకు పక్కన నెదురువచ్చి
నిలువున కొప్పు వీడి నీలి చీర గప్పెను. ॥అంగన॥

సుదతి నిన్ను చూచి సోయగపు సిగ్గులను
పొదలి చెక్కుల దాకా పూసె గంధము
మదన మంత్రములైన మాటల మర్మము సోకి
ముదురు పులకలను ముత్యాలు గట్టెను. ॥అంగన॥

గక్కన కాగిట నిన్ను కలసి ఈ మానిని
చొక్కి చంద్రాభరణపు సొమ్ములు వెట్టే
అక్కున శ్రీ వేంకటేశ అలిమేలుమంగ నీకు
దక్కి సరసములను తలబాలు వోసెను. ॥అంగన॥

**అవతారిక:**

నీ అంగన (అలిమేల్మంగ)కు విరహతాపమే గొప్ప సింగారమయ్యిందయ్యా శ్రీనివాసా! ఆమెను సమీపించి నీవే యిది గమనించవయ్యా! అని నచ్చచెబుతున్నారు అన్నమాచార్యులవారు. అమలిన శృంగారంతో జగతికి ఆదిదంపతులను కీర్తించటం మధురభక్తి క్రింద పెద్దలు తార్కాణించారు. వారు యౌవన ప్రాంగణంలోని ప్రేయసీ ప్రియులు కాదు, శృంగార సామ్రాజ్యాన్ని యేలే సామ్రాట్టు, సామ్రాజ్ఞి.





అమ్మవారికి ముదురు పులకల ముత్యాల సరాలు పేర్చిన పదకవితాపితామహునికి జోహారు అనకుండా యెలవుండగలము చెప్పండి. శృంగారాన్ని గోప్యత కొంతకప్పాలనే నా ఉద్దేశ్యము కూడా.

**భావ వివరణ:**

ఆహా! ఈ అంగనకు (యువతికి) తను పొందే విరహమే సింగారమై (గొప్ప అలంకరణ వలె) భాసించుచున్నది. ఓ ప్రభూ! చెంగట (ఆమెను చేరి) నీకు నీవే ఇది చిత్తగించవయ్యా (అర్థం చేసికొనుమయ్యా!)

ఈ కలికి (యువతి) లోలో నిన్ను దలచి గక్కున (వెంటనే) కరగి (పరవశించి) జలజల చెమటతో జలకమాడినట్లయినది. నీకు యెదురువచ్చినప్పుడు బలవత్తరమైన తమకాన, నిలువున కొప్పు (నిట్టనిలువుగానున్న సిగకొప్పు) ముడివీడి, నీలిచీరె గప్పెను (నల్లని వస్త్రము వంటికి కప్పినట్లుండెను).

ఈ సుదతి (యువతి) నిన్ను చూచినదే తడవుగా ఎరుపెక్కిన చెక్కిళ్ళను తెలియకుండా దట్టముగా గంధమును పూసినది. మదనమంత్రములవంటి నీ నర్మగర్భమైన మాటల భావము భామ మనస్సును తాకి శరీరము పులకలుదేరినది ఆ పులకల విస్తరింపు ముత్యాల వానవలె దట్టముగా నాక్రమించెను.

అంతలో నీవా మానినిని కౌగిట జేర్చితివి. అలసిన ఆమె నీ మెడలోని చంద్రహారమువలె భాసించినది. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ దేవి అలమేలుమంగ ఆపై నీ అక్కున దక్కి (సందిట జిక్కి) తన సరస సల్లాపములను తలంబ్రాలు పోసి నిన్ను మురిపించి తానునూ మురిసినది.

ఓ జగజ్జననీ జనకులారా! మిమ్మట్లు భావించగల ఆచార్యులవారిదే భాగ్యము. వారి కృపవలన మేమూ ధన్యులమైతిమి కదా!

సంపుటి: 1 కీర్తన : మలసీ చూడరో మగ సింహము
సంఖ్య : 13 పుట : 9 రాగం: హిందోళ

## హిందోళ

66 మలసీ చూడరో మగ సింహము
అలవి మీరిన మాయల సింహము ॥ పల్లవి॥

అదివో చూడరో ఆదిమపురుషుని
పెదయౌభళము మీది పెనుసింహము
వెదకి బ్రహ్మాదులు వేదాంత తతులు
కదిసి కానగలేని ఘనసింహము ॥లలల॥

మెచ్చిమెచ్చి చూడరో మితిమీరినయట్టి
చిచ్చరకంటితోడి జిగి సింహము
తచ్చిన వారధిలోన తరుణి కౌగిట జేర్చి
నచ్చిన గోళ్ళ శ్రీనరసింహము ॥లలల॥

బింకమున చూడరో పిరితియ్యక నేడు
అంకపు దనుజ సంహార సింహము
వేంకటనగముపై వేదాచలముపై
కింక లేక వడి పెరిగిన సింహము ॥లలల॥

**అవతారిక:**

మలసి చూడరో (ఉద్యమించి చూడండయ్యా!) అంటున్నారు అన్నమాచార్యులవారు. ఎవరిని చూడాలి? ఈ మగసింహమును. అది మామూలు మగ సింగము కూడా కాదు అలవి మాలిన మాయల సింగమట. అహోబల నృసింహునిపై చెప్పిన ఈ కీర్తనలో యెన్నో తెలియని విశేషాలున్నాయి. జాగ్రత్తగా చదివి ఆకలనం చేసికొనండి. చిచ్చరకంటితో అంటే అగ్నిని కురిపిస్తున్న కన్నులతో, జిగి సింహము





మెరిసిపోతున్న సింహమట. వేంకటగిరి (తిరుమల) లోనూ వేదాచలంలో (అహోబలం) లోనూ వున్నదొక్కరేనట. ఈయన, కింక లేక (కోపమును విడనాడి) వడి పెరిగిన సింహమట. అంటే యేమిటో!

**భావ వివరణ:**

ఓ భక్తులారా! ఈ మగసింహము (మొండెము మగవాడు, తల సింహపుది అయిన నరసింహుడు) కనువిందు చేయుచున్నాడు. ఈయనను చూడరో (చూడండయ్యా!) ఈయన అలవిమీరిన (అశక్యమైన) మాయల సింహము (లీలలు కలిగిన నరసింహుడు).

అదిగో ఈ ఆదిపురుషుని చూడండయ్యా! ఈయనే నారాయణుడు, ఈయన ఇప్పుడు పెదయౌబళమున (అహోబలమునందు) పెనుసింహము (పెద్ద నరసింహుని) వలెనున్నాడు. బ్రహ్మాది దేవతలుగాని వేదాంత తతులు (వేదవేదాంగములు) గాని, వెదకి (ఆయనకోసం గాలించినా) కదిసి కానలేని (సరిగ్గా కనుగొనలేకపోయిన) నరసింహము.

ఈ జిగిసింహము (కాంతులు వెదజల్లు నృసింహుడు) చిచ్చర కంటితో (అగ్నిశిఖలు వెదజల్లు ఫాలనేత్రముతో వుజ్వలముగా ప్రకాశించుచుండగా మితిమీరియున్నాడు (అతిశయించినాడు). మెచ్చి మెచ్చి (బాగుగా కీర్తించుచూ) చూడరో (ఈ స్వామి దర్శనం చేసికోండి). తచ్చిన (కిక్కిరిసియున్న) వారధిలోన (నది రెండు ఒడ్డులను కలుపు వంతెనలో) నచ్చిన తరుణిని (తన హృదయేశ్వరి అయిన శ్రీలక్ష్మిని) గోళ్ళతో గిలిగింతలిడుచున్న నృసింహుని చూడండి.

ఈయన ఉగ్రనరసింహుడే, కాని భక్తవత్సలుడు. నేడు పిరుదియ్యక (భయపడక) బింకమున చూడరో (ధైర్యంగా చూడండయ్యా!) దనుజుని (హిరణ్యకశిపుని) అంకమున (ఒడిలో) కూర్చొనబెట్టుకొని సంహరించాడు. ఈ నృసింహుని కొలవండి. ఈయన కింకలేక (కోపమును వుపసంహరించుకొని) వడి పెరిగెను (త్వరగా ప్రీతిపాత్రుడైనాడు). తిరుమలవేంకటేశ్వరుడు ఈయనే అహోబల నరసింహుడు ఈ దేవుడే.

సంపుటి: 5 కీర్తన : నిద్దిరించి పాల జలనిధివలెనే
సంఖ్య : 343 పుట : 233 రాగం: మధ్యమావతి

**మధ్యమావతి**

67 నిద్దిరించి పాల జలనిధివలెనే
వొద్దిక శ్రీరమణునికి వొత్తరే పాదములు ॥పల్లవి॥

వేగుదాఁకా చిత్తగించి విద్యలెల్ల నాదరించి
బాగుగా కృపారసము పంచి పంచి
యేగతిఁ బవ్వళించెనో యెట్ల భోగించెనో
యోగీంద్రవరదుని పూఁచరే వుయ్యాలను ॥నిద్ది॥

వాలుఁకన్నుల రెప్పల వడదాఁకి తనుతావి
చాలుకొన్న వూర్పులు చల్లి చల్లి
నీలవర్ణపుగుణము నెరపుచు నొకయింత-
కాలము కన్నులఁ దిప్పక (ప్పిఁగ?) ప్పరే దోమతెర ॥నిద్ది॥

సరుగన యోగనిద్ర చాలించి లోకమెల్లఁ
కరుణించ తలచి వేంకటగిరిపై
అరుదుగ సకలలోకారాధ్యుడయి మించి (చీ?)
విరివి నాలవట్టాలు విసరరే సతులు ॥నిద్ది॥

**అవతారిక:**

పరమాత్ముడైన శ్రీమన్నారాయణునికి వుయ్యాలలూపుతూ మధురమైన కీర్తనతో నిద్రబుచ్చుతున్నారు అన్నమాచార్యులవారు. ఉప్పునీటి సముద్రాలు ఉవ్వెత్తు తరంగాలతో భీకరంగావుంటే క్షీరసాగరం అలలు లేకుండా ప్రశాంతంగా వుంటుందట. ఈ దేవదేవుడు పాలజలనిధి వలెనే నిద్దిరించీ... ఈయనకి ఒద్దికతో పాదాలు ఒత్తండమ్మా! అని శ్రీదేవికి భూదేవికి చెబుతున్నారు. "సకల లోకములచే ఆరాధ్యుడై అతిశయించుచున్న ఈ శ్రీరమణుని ఓ సతులారా ఆలవట్టములు విసరండమ్మా!" అంటున్నారు.





"స్వామి మధ్య మధ్య కళ్ళు తిప్పుతున్నాడు, దోమతెర సరిగా కప్పండి" అంటున్నారు. తినబోతూ రుచియెందుకు? ఆస్వాదించండి.

**భావ వివరణ:**

ఓ తల్లులారా! (శ్రీదేవి, భూదేవి) ఈ శ్రీరమణుడు పాలజలనిధివలెనే (క్షీరసాగరము మాదిరి) ప్రశాంతంగా (వువ్వెత్తు తరంగాలు లేక వున్నట్లు, నిశ్చలంగా నిద్రిస్తున్నాడు). ఈయనకు ఒద్దికతో (అణుకువతో) పాదములను వొత్తండమ్మా!

వేగుచుక్క కనుపించేదాకా ఈయన నిద్రపోదు. మాబోటివారి విద్యలెల్లా ఒకపక్క ఆలకిస్తూనే మమ్మల్ని తరింపజేస్తుంటాడు. మాలోవున్న శరణార్థులపై అమితదయాళువై కృపారసమును పంచిపంచీ ఇంకా అలిసిపోతాడు. పాపం ఎట్లా పడుకొన్నాడో చూడండమ్మా! ఈ యోగీంద్రవరదుడు ఎట్లు భోగించేనోకాని ఆయన వుయ్యాల నెమ్మదిగా వూచరే (వూపండమ్మా!) అప్పుడుగాని ఆయన నిద్రించడు.

స్వామి, వాలు కన్నులరెప్పలు అరమోడ్చి నిద్రిస్తున్నాడు. మీ ఒంటి వేడిమి ఆయన ఒంటికి తాకి నిద్రాభంగం కావచ్చునమ్మా! చూడండి నిద్రలో కూడా చాలుకొన్న వూర్పులు చల్లిచల్లీ (అతిశయించిన నిట్టూర్పులు) యెలా విడుచుచున్నాడో! ఆయన భక్తుల బాధలు యెప్పుడూ వుండేవే. ఈ నీలవర్ణుని గుణం మీకు తెలుసుకదమ్మా!! ఆయనకు నిద్రపట్టదు. కొంచెంసేపు ఆ కళ్ళమీద వెలుతురు పడకుండా దోమతెరకప్పి కళ్ళు తిప్పకుండా జాగ్రత్తపడ్డారంటే నెమ్మదిగా నిద్రపడుతుందమ్మా!

ఇంకాసేపట్లో మళ్లీ సుప్రభాతం అంటూ తగులుకొంటారు. వీళ్ళు వచ్చేలోగా కాస్త నిద్రపట్టితే బాగుండును. ఈ వేంకటగిరిపై సరుగున (వెంటనే) యోగనిద్ర చాలించి లోకాన్నంతా కరుణించాలని ఆయనకెప్పుడూ ఆరాటమే. సకలలోకారాధ్యుడైన ఈ శ్రీవేంకటేశ్వరుడు అరుదుగ మించీ (అపూర్వమైన ఔన్నత్యంకలవాడు) ఓ సతులారా! ఈ స్వామి సుఖంగా నిద్రించుటకు ఆలవట్టుములు (వింజామరలు) విరివి విసరరే (కాస్తగట్టిగా వీయండమ్మా!)

సంపుటి: 10-2 కీర్తన : రారా చిన్నన్నా రారోరి చిన్నవాఁడ
సంఖ్య : 82 పుట : 00 రాగం: ఝుంఝూటి

**ఝుంఝూటి**

68 రారా చిన్నన్నా రారోరి చిన్నవాఁడ
రార ముద్దులాఁడ రారోరి బాలకృష్ణ ॥ పల్లవి॥

కిందిచూపుల గిలిగించి ఆల-
మంద గొల్లెతల మరిగించి
సందడి వలపించి జవరాండ్లవూర
విందవైనయట్టి వేడుకకాఁడ ॥రారా॥

కొదలుమాఁటలనె గొణఁగుచు భూమి
సుదతుల శిగ్గులు చూరాడి
చిదుగుచేఁతలనె చెనకుచుముద్దుఁ
బెదవిచవులు చూపిన జాణకాఁడ ॥రారా॥

కలికితనమునవె కరఁగించి కాచె
చెలుల కాఁగిటనె చెలఁగి
లలనామణియైన లకిమమ్మఁ
గలసుక శ్రీవేంకటనాథుఁడైనవాఁడ ॥రారా॥

**అవతారిక:**

అన్నమయ్య మనుమడు, చినతిరుమలాచార్యులవారు చెప్పిన బాలకృష్ణునిపై మధుర కీర్తన వినండి. ఈయన కీర్తనలు జానపదుల శైలిలో జనప్రియంగా వుంటాయి. గిలిగించి అంటే చక్కిలిగింతపెట్టటం. అయితే, కింద చూపులు చూచే ఆవులమందకు గిలగించడమేమటి? అంటే మనం గిలిగింతలు పెడితే పాపాయిలెలా సంతోషిస్తారో రేపల్లెలో ఆవులు కూడా కృష్ణను చూచి సంతోషంతో పరవశించాయన్నమాట. ఆ





పిల్లాడు కొదలుమాటలు రహస్యంగా గొణుగుతాడట. దానికి ఆడాళ్ళంతా సిగ్గుతో చితికిపోతారట. ఈ చినతిరుమలయ్య అచ్చం తాతగారే. కవిత్వంలోనూ అదే చలాకీతనం. భావ వివరణ చదివి పరవశించండి.

**భావ వివరణ:**

మా చిన్నన్నా!! రారా! ఓ చిన్నవాడా! రారా! ఓరి బాలకృష్ణా! నిన్ను ముద్దాడెదను రారా!

నీ లీలలను యేమని వర్ణించమయ్యా! నువ్వు, కిందిచూపుల ఆలమంద (అలవాటుప్రకారం క్రిందికి చూస్తూవెళ్ళే ఆవులమందకు) గిలిగించేవు (పులకరింపు కలుగచేస్తావు... అంటే... సంతోషపెడతావు). గొల్లెతల మరగించేవు (గోపికలను విరహంతో వేపుతావు). వూర జవరాండ్రను (జవ్వనులైన మీవూరి ప్రియురాండ్రను) బాహాటంగానే వలపు ముగ్గులోకి దింపుతావు. కృష్ణా! నీవు విందవైనయట్టి (సంతోషపరచు) వేడుకాడవు (భోగివి).

కృష్ణా! నీవు కొదలు మాటలనే (లోపభూయిష్టమైన మాటలను) గొణుగుచు (రహస్యంగా పలుకుచూ) సుదతుల శిగ్గులు (స్త్రీల సిగ్గును) చూరాడేవు (చితుకునట్లు చేసెదవు), కొంటె వేషాలు వేస్తూ మధురాధరముల రుచి చూపిన జాణకాడవు (రసిక శేఖరుడవు).

ప్రభూ! నీవు చెలుల కౌగిళ్ళలో చెలగి (అతిశయించి) నీ కలికితనముల (నేర్పరితనమున) పరవశింపజేసెదవు. నేడు ఈ తిరుమల శిఖరాలపై లలనామణియైన లకిమమ్మ (లక్ష్మీదేవి)ని కలిసినవాడవై మా ఆరాధ్యదైవమైన శ్రీవేంకటేశ్వరుడవైనావు.

సంపుటి: 15 కీర్తన : వోవో రాకాసులాల వొద్దు సుండి వైరము
సంఖ్య : 140 పుట : 93 రాగం: గౌళ

### గౌళ

69 వోవో రాకాసులాల వొద్దు సుండి వైరము
దేవుని శరణనరో తెలుసుకోరో ॥ పల్లవి॥

జగములో రాముఁడై జనియించె విష్ణుఁ డిదె
అగపడి లక్ష్మి సీత యయి పుట్టెను
తగు శేషశంకచక్ర దైవసాధనము లెల్ల
తగిలి లక్ష్మణ భరత శత్రుఘ్నులయిరి ॥వోవో॥

సురలు వానరు లైరి సూర్యుఁడు సుగ్రీవుఁడు
మరిగి రుద్రుఁడు హనుమంతుఁడాయెను
సరుస బ్రహ్మదేవుఁడు జాంబవంతుఁడైనాఁడు
వెరవరి నలుఁడే విశ్వకర్మ సుండి ॥వోవో॥

కట్టిరి సేతు వప్పుడే ఘను లెల్లా దాఁటిరి
ముట్టిరి లంకా నగరమును దళము
అట్టి శ్రీవేంకటేశుఁ డాతఁడే యీతఁడై
వొట్టుచు వరము లిచ్చె వొనర దాసులకు ॥వోవో॥

**అవతారిక:**

పెదతిరుమలాచార్యులవారు చెప్పిన ఈ కీర్తనలో రాక్షస స్వభావం కలిగినవారిని హెచ్చరిస్తున్నారు. ఒరే రాకాసుల్లారా! మీకు మాతో వైరము వద్దురా. మేము ఈ ఏడుకొండలవాడిని శరణని హాయిగా వున్నవాళ్ళం. మీరూ అదేపని చేయండి. ఆ నాడు త్రేతాయుగంలో మీ రావణాసురుని చంపటానికి ఆ విష్ణువు తన పరివారంతో సహా భూమ్మీద అవతరించి మిమ్మల్నందరినీ మట్టికరిపించాడు. దుష్ట శిక్షణాకార్యక్రమం పూర్తిచేసికొని





నేడు తన శరణాగతులకు అంతులేని వరములనిస్తున్నాడు. మీరంతా మీ ప్రవర్తన మార్చుకోండిరా! అంటున్నారు.

**భావ వివరణ:**

ఓరోరీ! రాక్షసులారా! సన్మార్గులతో వైరము (శతృత్వం) వద్దు సుండీ (సుమా!) ఈ శ్రీవేంకటేశ్వరుడే దేవుడు (భగవంతుడు). ఈ సంగతి తెలుసుకోండిరా! ఈ దేవదేవుని శరణు అనండిరా!

**(ఈయనే ఆదిదేవుడైన శ్రీమహావిష్ణువు. రావణుడు నరులను వానరులను తన కాలిగోటికి సరిరారని భావించి, బ్రహ్మను వరములడిగేటప్పుడు దేవ, దానవ, యక్ష, కిన్నెర, కింపురుష మొదలైన వారితో తనకు మృత్యువు రాకూడదన్నాడు. వాడిని చంపటానికి విష్ణువు తన పరివారంతో సహా భూమిపై నర వానరులుగా తల్లి కడుపులద్వారా పుట్టి వాడిని నిర్జించాడు. వాళ్ళంతా యెవరెవరు యెలా పుట్టారో తెలుసుకొని ఆనందించండి.)**

ఆ శ్రీమహావిష్ణువు భూమిపై రామునిగా జన్మించాడు. అగపడి (తానూ సిద్ధమై) లక్ష్మీదేవి సీతయై పుట్టింది. ఆయన పరివారమైన ఆదిశేషుడు, సుదర్శన చక్రము, పాంచజన్య శంఖమూ ఆ రాముని సోదరులు లక్ష్మణుడు, భరతుడు మరియు శత్రుఘ్నులవలె జన్మించారు.

ఆ శ్రీహరి పరివారమంతా రాముని పరివారంగా యెలా వానరజన్మలెత్తారో తెలిసి ఆనందించండి. సూర్యుడే సుగ్రీవునిగా అవతరించాడు. రుద్రుడు (శంకరుడు) మహా బుద్ధిమంతుడైన హనుమతుడయ్యాడు. బ్రహ్మదేవుడు భల్లూకపతియైన జాంబవంతునివలె అవతరించాడు. వారధిని నిర్మించిన నలుడే దేవశిల్పి విశ్వకర్మ సుమా!

ఆ తరువాత కథ మీ అందరికీ తెలిసిందే కదా! వారంతా రావణ వధ కోసం ఘనులై అప్పుడే సేతువును కట్టి, దాటి, లంకానగరమును ముట్టిరి (ముట్టడించిరి). ఆ తిరుమల శ్రీవేంకటేశ్వరుడె ఈనాడు, ఇక్కడ శ్రీరామచంద్ర మూర్తిగా వెలసి ఒనర (ఒప్పునట్లుగా) తనదాసులకు ఒట్టుచు (శపథముతో) అనేక వరములిస్తున్నాడు. రాండ్రరా! మీరు వచ్చి ఈయనను ఆశ్రయించండి.

సంపుటి: 2 కీర్తన : శిష్టరక్షణమును దుష్టనిగ్రహమును
సంఖ్య : 258 పుట : 175 రాగం: పాడి

**పాడి**

70 శిష్టరక్షణమును దుష్టనిగ్రహమును
సృష్టించె నొక్కవేళనే శ్రీజయంతినాఁడు. ॥ పల్లవి॥

హరి కృష్ణావతార మందినయంతలోనే
పరమమునుల కెల్ల భయముడిగెను
తెరలి దైత్యులగుండె దిగులుచొచ్చె నత్తరి
సిరులమించినయట్టి శ్రీజయంతినాఁడు. ॥శిష్ట॥

గోవిందుఁడు వసుదేవుకొడుకైనయప్పుడే
గోవులు రంకెలు వేసె గొల్లపల్లెను
నోవితోడఁ గంసునికి నూరునిండెఁ జూడఁగానె
చేవలుమీరినయట్టి శ్రీజయంతినాఁడు ॥శిష్ట॥

నారాయణుఁడు భువి నరుఁడు దాఁ గాఁగానే
మేరఁ బాండవు లెచ్చిరి మేనవావిని
కౌరవులపని దీరె కమ్మి శ్రీవేంకటేశుఁడు
చేరువనే మెరయఁగ శ్రీజయంతినాఁడు. ॥శిష్ట॥258

**అవతారిక:**

ఒకానొక శ్రీకృష్ణ జయంతి సందర్భంగా అన్నమాచార్యులవారు వినిపించిన కీర్తనవాలకించండి. "శిష్టరక్షణమును, దుష్టశిక్షణమును భగవంతుడు శ్రీజయంతినాడు ఒకే సమయంలో సృష్టించె" అంటున్నారు. మునులను రక్షించాడు, దానవులను భక్షించాడు. గోవులను మేపాడు, కంసుని వేపాడు. పాండవులు యెచ్చిరి, కౌరవుల పనిదీరె అని కృష్ణావతారవైశిష్ట్యాన్ని కీర్తిస్తున్నారు. శ్రీవేంకటేశుడు కూడా ఆయన చేరువనే మెరసినాడట. గతంలో ఇటువంటి కీర్తనలు చూచినా దేని మాధుర్యం దానిదే.





**భావ వివరణ:**

ఓ భక్తులారా! ఈ శ్రీజయంతినాడు (శ్రీకృష్ణాష్టమినాడు) ఆ భగవంతుడు, శిష్టరక్షణము (మంచివారిని రక్షించుట), దుష్టనిగ్రహము (చెడ్డవారిని నిరోధించుట) ఒక్కవేళనే (ఒకే సమయంలో) సృష్టించెన్ (సిద్ధింపజేశాడు).

శ్రీహరి కృష్ణావతారమును పొందినప్పుడు పరమ మునీంద్రులకు అందరికీ దానవుల భయము వుడిగెను (అణగిపోయినది). తెరలి (కలతపడిన) దైత్యుల గుండెలు, అత్తరి (అప్పుడు) దిగులుచొచ్చె (దిగులుతో దిగాలుపడ్డాయి). ఈ శ్రీజయంతి సిరులుమించిన (వైభవములతిశయించిన) పండుగ అవటంచేత ఈనాడు అంతా జయమే.

ఆ గోవిందుడు వసుదేవుని కొడుకైనప్పుడే గొల్లపల్లెను (గోకులమునందున్న) గోవులన్నీ సంతోషంతో రంకె వేసినవి. ఎందుకంటే వాటికి భగవంతుడు తమ మూపురాలను ప్రేమగా నిమరటానికి రాబోతున్నాడని తెలిసిపోయింది. అక్కడ మధురలో కంసునికి నోవితోడ (వేదనతో) చూడగానే (యోగమాయ హెచ్చరిక విని జరిగింది చూడగా) భయంతో నూరునిండె (నూరేళ్ళు నిండాయి). ఈ శ్రీజయంతినాడు చేవలు మీరినయట్టి (అందరికీ ధైర్యంకలిగినట్టి ఈరోజున) కంసాదులకు కన్నీళ్ళొచ్చాయి.

నారాయణుడు భువిపై తాన్ నరుడు కాగానే (అవగానే) మేం (క్రమముగా) మేనవావిని (మేనరికపు బంధుత్వమునందు) పాండవులు యెచ్చిరి (బలోపేతులయ్యారు). కౌరవులు (దుష్టరాజసమూహంగల కురుసేన) పనిదీరె (పనిముగిసినది). ఈ శ్రీజయంతినాడు ఆ కృష్ణలీల సంకేతముగా, శ్రీవేంకటేశుడు ఈ తిరుమల శిఖరాలపై కమ్మి మెరయగా (వ్యాపించి మెరిసిపోగా) చేరువనే (ఇక్కడే) పండుగ పరిమళించింది.

సంపుటి: 2 కీర్తన : దొరతనములతోడ తొడపై శ్రీసతితోడ
సంఖ్య : 518 పుట : 348 రాగం: నాట

**నాట**

71 దొరతనములతోడ తొడపై శ్రీసతితోడ
కేరలీఁ బంతముల సుగ్రీవనారసింహము. ॥ పల్లవి॥

నిక్కినకర్ణములతో నిట్ట చూపుగుడ్లతో
మిక్కుటమైన పెద్దమీసాలతోడ
వెక్కసపునోరితోడ వెలయుబుగ్గలతోడ
క్రిక్కిరిసీ నవ్వుల సుగ్రీవనారసింహము. ॥దొర॥

చల్లునూరుపులతోడ సంకుఁజక్రములతోడ
మొల్ల మైనసహస్రకరములతోడ
తెల్లనిమేనితోడ దిండ్డైనపిరుఁదుతోడ
కెల్లరేఁగీఁ గరుణ సుగ్రీవనారసింమము. ॥దొర॥

విరులపాదాలతోడ వెలయుసొమ్ములతోడ
తిరమైనకోటిసూర్యతేజముతోడ
విరులదండలతోడ వేడుక శ్రీవేంకట-
గిరిమీఁద వెలసె సుగ్రీవనారసింహము. ॥దొర॥518

**అవతారిక:**

సహజత్వం వుట్టిపడేలా వర్ణనలు కీర్తనలో జొప్పించటం అన్నమాచార్యుల వారికి వెన్నతోపెట్టిన విద్య. ఆయన నరసింహుని వర్ణిస్తుంటే మనకళ్ళయెదుట ఆ స్వామి నిలుచున్నట్లే వుంటుంది. “దొరతనంతోడ, తొడపై శ్రీసతితోడ ఈ సుగ్రీవనరసింహుడు పంతములకేరలీ” అంటున్నారు. ఈయన కంఠము సుగ్రీవమట. అందంగావున్న కంఠస్వరం అన్నమాట. ఈయన పాదాలు





పువ్వుల్లా వున్నాయట. వేంకటగిరి మీదనున్న సుగ్రీవనరసింహుని కీర్తించండి అంటున్నారు.

**భావ వివరణ:**

దొరతనముతోడ (సర్వేశ్వరుని ఠీవితో) తనతొడపై శ్రీదేవితో ఈ సుగ్రీవనారసింహుడు (చక్కటి కంఠధ్వనిగల నరసింహుడు), కేరడి పంతములవాడు (మిక్కుటమైన పట్టుదలగలవాడు).

ఈయన యెలావున్నాడో చూడండి. ఇతను నిక్కిన కర్ణములతో (నిక్కపొడుచుకొనిన చెవులతో) నిట్టచూపుగుడ్లతో (మిడిగుడ్లతో). దట్టమైన పెద్దమీసాలతో, వెక్కసపు (భీతినిగొలుపు) నోటితోను, వెలయు (మెరయుచున్న) బుగ్గలతోను, క్రిక్కిరిసిన నవ్వులతోనూ (దట్టమైన నవ్వులు చిందించుచూ) ఈ సుగ్రీవ నారసింహుడు దర్శనమొసగుచున్నాడు.

ఈయన చల్లునూరుపులతో వున్నాడు (వెలువడునప్పుడు విస్తరించుచున్న నిశ్వాసములతో వున్నాడు.) ఈ చతుర్భుజుని, రెండుచేతులలో శంఖచక్రములన్నవి. అధికముగ వేయి కరములతో ఈ స్వామి వెలసియున్నాడు. ఈయన తెల్లని మేనితో (దేహంతో) దిండ్లవంటి పిరుదులతోనున్నాడు. ఈయన కెల్లురేగిన (పెల్లుబికిన) కరుణ మూర్తీభవించినట్లున్నాడు. ఈ సుగ్రీవనారసింహుని చూచి తరించండి.

ఈ దేవదేవుడు విరులవంటి (పుష్పములవలె సున్నితమైన) పాదములను కలిగియున్నాడు. విరివిగానున్న సొమ్ములు (ఆభరణములతోనున్నాడు). తిరమైన (స్థిరమైన) కోటి సూర్యులకాంతితో వెలుగొందుచున్నాడు. మెడలో ఈ స్వామి అనేక పుష్పహారములను ధరించియున్నాడు. వింతగా ఈ సుగ్రీవనారసింహుడు వేడుకతో శ్రీ వేంకటగిరిమీద వేంకటేశ్వరుడై వెలసియున్నాడు. ఈ స్వామిని చూచి భక్తితో మొక్కండి.

సంపుటి: 2 కీర్తన : ఘనుడాతడా యితడు కలశాపురముకాడ
సంఖ్య : 302 పుట : 204 రాగం: గుండక్రియ

## గుండక్రియ

72 ఘనుఁడాతఁడా యితఁడు కలశాపురముకాడ
హనుమంతుఁ డితఁడా అంజనాతనయుఁడు. ॥ పల్లవి॥

పెడచేత లోచేత బెరసి కొందరిఁ గొట్టె
అదరి దానవుల హనుమంతుఁడు
బెడిదంపుఁ బెనుదోఁక బిరబిరఁ దిప్పి మొత్తె
అడఁగ మాల్యవంతు హనుమంతుఁడు ॥ఘనుఁ॥

దాకాల మోఁకాలఁ దాటించెఁ గొందరి
ఆకాశవీధినుండి హనుమంతుఁడు
పైకొని భుజములఁ బడఁదాఁకెఁ గొందరి
ఆకడ జలధిలోను హనుమంతుఁడు. ॥ఘనుఁ॥

ఆరుపుల నూరుపుల నందరిఁ బారఁగఁ దోలె
ఔరా సంజీవికొండహనుమంతుఁడు
మేరతో శ్రీవేంకటాద్రిమీఁదిదేవునిబంటు
ఆరితేరినబిరుదు హనుమంతుఁడు. ॥ఘనుఁ॥ 302

**అవతారిక:**

కలశాపురంలో తనయెదుటనున్న ఘనమైన హనుమంతుని యెదుట అన్నమాచార్యులవారు ఈ కీర్తనను వినిపిస్తున్నారు. ఆనాడు లంకలో రాక్షసమూకనుయెట్లు చీల్చి చెండాడినాడో వర్ణిస్తున్నారు. నేటి మన దుస్థితి యేమంటే అచ్చతెలుగు కీర్తనకి, సంకరతెలుగులో వివరణ ఇచ్చుకోవలసిన వస్తున్నది. "ఆరుపుల నూరుపులనందరి బారగ దోలె"... ఆయన హూంకారముతో కూడిన గట్టి నిశ్వాసవదిలి అందరూ కకావికలై





పారిపోయేట్లు చేశాడట. ఇట్లా అడుగడుగునా తేలికగా తెలియని తెలివైన తెలుగు తికమకలు దిట్టంగావున్నాయి ఈ కీర్తనలో.

**భావ వివరణ:**

ఆనాడు లంకలో అన్ని ఘనకార్యములను చేసిన ఆ ఘనుడైన హనుమంతుడు ఆతడా, యితడు (ఈ కలశాపురంలో మనయెదుటనున్న ఆంజనేయుడు). ఏమి ఆశ్చర్యము!

ఈయన సీతాన్వేషణలో లంకలోని రాక్షసులను యెట్లు చితక్కొట్టాడో వినండి. ఆయన తన మోచేతితో కొందరిని కుమ్మి చంపాడు. కొందరిని చేతిలోపలి భాగంలో నొక్కి చంపాడు. అదరి (ఆ విధంగా అతిశయించి) ఆ హనుమంతుడు దానవులను చంపాడు. అప్పుడు మాల్యవంతుడనే రాక్షసుడు ఆయనపైకి వెళ్ళాడు. బెడిదంపు (భయంకరమైన) పెనుతోక (పెద్దతోకతో) బిరబిర తిప్పి అణిగిపోయేట్లు మొత్తి వాడిని ఆ హనుమంతుడు చంపేశాడు.

తన దాకాలు (దాగు+కాలు) కాలివెనుక భాగంతో) తో తన్ని కొందరిని, మోకాలితో కుమ్మించి కొందరిని తాటించినాడు (కొట్టినాడు), ఆ హనుమంతుడు. ఇదంతా ఆయన ఆకాశవీధిలోనే చేశాడు. ఆ కడ (అప్పుడు) కొందరిని పైకొని (మీదపడి) భుజములతోపడదోసి జలధిలో చంపేశాడు. హనుమంతుని మారణకాండనేమని వర్ణింతుము?

అనంతరం ఆ హనుమంతుడు "ఆరుపుల నూరుపుల నందరి బారగదోలె" (తన హూంకారముతో కూడిన గట్టి నిస్వాసముతో అందరినీ చిందరవందరగా పారిపోయేట్లు చేశాడు. ఔరా సంజీవి కొండను తెచ్చిన ఈ హనుమంతుడు జగజ్జెట్టి. మేరతో (ఆ క్రమంలో) వేంకటాద్రిమీది దేవుడైన వేంకటేశ్వరుని బంటు అనే ఆరితేరిన బిరుదుతో ఈ హనుమంతుడు శోభించుచున్నాడు.

సంపుటి: 2 కీర్తన : బోధింపరే యెరిగిన బుధులాల పెద్దలాల
సంఖ్య : 58 పుట : 39 రాగం: బౌళి

**బౌళి**

73 బోధింపరే యెరిఁగినబుధులాల పెద్దలాల
శ్రీధరునిమాయలలోఁ జిక్కితిమి నేము. ॥ పల్లవి॥

దైవమును నొల్లము ధర్మమును నొల్లము
దావతిసంసారముతో తగులేకాని
భావపుభవబంధాలభయమూ నెరఁగము
వేవేలు విధులే కాని వేగిలేచి నేము. ॥బోధిం॥

ముందు విచారించము మొదల విచారించము
పొందేటిసతులతోడిభోగమేకాని
చెందినమనసులోనిచింతలను బాయము
మందపుమదమే కాని మాపుదాఁకా నేము. ॥బోధిం॥

పరమూఁ దడవము భక్తీఁ దడవము
అరిది ధనముమీఁది ఆసలేకాని
ఇరవై శ్రీవేంకటేశుఁ డేలుకొనెఁ దానే నన్ను
నిరతి నెరఁగనైతి నే నించుకంతాను. ॥బోధిం॥58

**అవతారిక:**

"ఓ పెద్దలారా! మేము శ్రీధరుని మాయలో చిక్కుకుపోయామయ్యా! దిక్కు తెలీటంలేదు. మాకు యేమి చెయ్యాలో చెప్పండయ్యా!" అంటున్నారు జాలిగా అన్నమాచార్యులవారు. దేవుణ్ణి నమ్మం, ధర్మం ఒప్పుకోము, భవబంధాలలో అల్లాడిపోతున్నాం. ముందు విచారించము, మొదల విచారించము యెంతసేపూ వనితాభోగమే. మందపుమదమే మాపుదాకా, పరము వద్దంటాము. భక్తిసున్నా. ఏమిటీ దౌర్భాగ్యం!! తేలికగా కనుపించే క్లిష్టమైన కీర్తన ఇది. జాగ్రత్తగా చదవండి.





**భావ వివరణ:**

ఓ పెద్దలారా! బుధులారా! (పండితులారా!) మీరు అన్నీ యెరిగినవారు కదా! నాకు బోధింపరో (బోధపరచండయ్యా!) నేము (మేము) శ్రీధరుని మాయలలో చిక్కుకుపోయాం.

మేము దేవుని వొల్లము (అంగీకరించము). ధర్మమునంగీకరించము. దావతి సంసారముతో (దు:ఖభాజన ప్రపంచపు) తగులే (అనుబంధములే) కాని, భవబంధాల భయంలేనేలేదాయెను. అనేక మార్గాలనవలంభిస్తాము కాని, వేగిలేచేము (ప్రతిదానికీ తొందరే). మాకేమి చేయాలో తెలియుటలేదు.

మాకున్న ఇంకొక దురలవాటు ముందుగా విచారించము (కార్యము ప్రారంభమునకు ముందుగ ఆలోచన చేయము). మొదల విచారించము (కార్య ప్రారంభమునందును ఆలోచించము). మాకు లభించిన భామలతో భోగాసక్తే కాని ఇంకొక ఆలోచనేవుండదాయెను. ఈ వ్యవహారాలవల్ల మనస్సులో యెప్పుడూ దిగుళ్ళే, ఆలోచనలే. వాటిని బాయము (వదలము). మాపుదాకా (ముసలివాళ్ళమై జవసత్వాలు వుడిగేదాక) మందపు మదమే (దట్టమైన గర్వమే...) కాని మరొకటి లేదు. మేము భ్రష్టులమైపోయాము.

అవన్నీ అటుంచి, పరము (మోక్షము) అంటే యేమిటో తడవము (చలించము) భక్తి గురించిన ఆలోచనేలేదు. అరిది ధనముపై ఆసలే (అరుదుగా లభిస్తుందని ధనముపై వ్యామోహమే)... కాని భగవంతుని మాటే తలవము. ఇట్లా చాలాకాలం గడిచింది. ఒకనాడు శ్రీవేంకటేశునికి ఈ జీవిపై దయపుట్టింది. ఆయన ఇరవై (నా తలపులలో నెలకొని) తానే నన్ను యేలుకొనె. నేను ఇంచుకంతా, నిరతినెరుగనైతి (కొంచెము కూడా అత్యాశ లేక) జీవించుట ప్రారంభిచితిని. ఆ విధంగా ధన్యుడనైతిని.

సంపుటి: 2 కీర్తన : దాసోహమనుబుద్ధిదలచరు దానవులు
సంఖ్య : 5 పుట : 4 రాగం: నాట

**నాట**

74 దాసోహ మనుబుద్ధిఁ దలఁచరు దానవులు
యీసులకే పెనఁగేరు యిప్పుడూఁ గొందరు. ॥ పల్లవి॥

హరిచక్రముదూషించేయట్టివారే యసురలు
అరయఁ దామేదైవమన్న వారు నసురలే
ధర నరకాసురుఁడు తానే దైవమని చెడె
యిరవై యిది మానరు యిప్పుడూఁ గొందరు. ॥దాసో॥

పురుషోత్తమునిపూజపొంతఁ బోరు అసురలు
సరవి విష్ణుని జపించనివారు నసురలే
హిరణ్యకశిపుఁడును యీతని నొల్లక చెడె
ఇరవై యీతని నొల్ల రిప్పుడూఁ గొందరు ॥దాసో॥

సురలును మునులును శుకాదియోగులును
పరమము శ్రీవేంకటపతి యనుచు
శరణని బ్రదికేరు సరి నేఁడు వైష్ణవులు
యెరపరికానఁ బొయ్యే రిప్పుడూఁ గొందరు. ॥దాసో॥5

**అవతారిక:**

దానవులు దేవతలు అక్కచెల్లెళ్ళ పిల్లలే కాని వారి మధ్య ఎంత అంతరం వున్నదంటే ఒకరు చెడుకు వుదాహరణైతే, ఇంకొకరు మంచికి మారుపేరు. హరికి సురులు శరణాగతులైతే, అసురులు హరి విరసులు. ఈ కీర్తనలో అన్నమాచార్యులవారు దానవులకు హరికి దాసోహమనే బుద్ధివుండదని, వారు అసూయకే అలవాటుపడ్డవారని, అందుకనే చెడిపోయారని అంటున్నారు. తన వాదనని సోదాహరణంగా





నిరూపిస్తున్నారు కూడా. అసురులు అట్లావుంటే, సురులు మునులు హరి శరణాగతులు.

**భావ వివరణ:**

దానవులు (రాక్షసలు) దాసోహమనుబుద్ధి (శరణాగతిని) దలచరు (ఒప్పుకోరు). ఇప్పుడు (ఈ కలియుగంలో) కొందరు మానవులు, ఈసులకే (అసూయతో) పెనగేరు (ఒకరితో నొకరు కొట్లాడుచున్నారు).

అసురులంటే వేరేవరో కాదు. విష్ణుదేవుని చక్రాన్ని దూషించేవారంతా అసురులే. అరయ (పరిశీలించి చూచిన) తామే దైవమని అహంకరించినవారెవరైనా అసురులే. విష్ణువు భూకాంతలపుత్రుడు నరకుడు. వాడు అసురుడై లోక కంటకుడైనాడు. హరి వానిని సంహరిస్తాడు కావున భూదేవి హరిని వాడినంతము చేయవద్దని వేడుకొంది. "నేను చంపను వీడిని నీవు చావు అని తిట్టే దాకా వాడు చావడు" అని వరమిచ్చాడు విష్ణువు. ఆ నరకాసురుడు తానే దైవమని లోకకంటకుడయ్యాడు. వాడికోసం భూదేవి అంశతో పుట్టిన సత్యభామతో కృష్ణుడైన హరి తమపుత్రునే చంపించాడు. ఈరోజుల్లో నరుల్లో కూడా నరకాసురులు కోకొల్లలు.

అసురులు పురుషోత్తముని పూజదగ్గరకే పోరు. విష్ణుని జపించనివారంతా అసురులే. కృతయుగమున హిరణ్యకశిపుడు కూడా హరి నొల్లక అంతమైనాడు. ఈ కలియుగంలో కూడా కొందరు యీతని (ఈ దేవదేవుని వొల్లరు (అంగీకరించరు).

దేవతలు, మునులు, శుకుడు మొదలైన యోగులు పరమము మోక్షప్రదాత శ్రీవేంకటేశ్వరుడే అని శరణాగతితో బ్రతుకుచున్నారు. సరి (అదట్టుండగా) నేడు వైష్ణవులు కూడా కొందరు "యెరపరికాన" (రోత కలిగి) పొయ్యేరు (ద్వేషముతో జీవించుచున్నారు).

**గమనిక :** ఆచార్యులవారి భావన ఇదేనేమోనని నా ఊహ. నా ఆశ.

సంపుటి: 2    కీర్తన : నారాయణుడ నీనామమె మంత్రించివేసి
సంఖ్య : 494    పుట : 332    రాగం: సామంతం

## సామంతం

75 నారాయణుఁడ నీ నామము మంత్రించివేసి
పారేటియీజంతువులభ్రమ విడిపించవే. ॥ పల్లవి॥

మదనభూతము సోఁకి మగువలుఁ బురుషులు
అదన విరిదలలై యంగమొలలై
పెదవి నెత్తురు వీర్చి పెనుగోళ్ళఁ జించుకొంటా
కొదలు కుత్తికలనుఁ గూసేరు జీవులు. ॥నారా॥

పంచభూతములు సోఁకి భ్రమసి యజ్ఞానులై
పొంచి హేయములు మన్నుఁబూసుకొంటాను
అంచెల వీడెపురస మందు నిందు గురియుచు
యెంచి ధనముపిశాచాలిట్టెరి జీవులు. ॥నారా॥

తమితోడ మాయాభూతము సోఁకి బహుజాతి-
యెముకలుఁ దోలు నరా లిరవుచేసి
నెమకి శ్రీవేంకటేశ నిన్నుఁ జేర కెక్కడైన
తముఁ దా మెరఁగరింతటాఁ జూడు జీవులు. ॥నారా॥494

**అవతారిక:**

'పారేటి' జీవులు అంటే జీవనసంగ్రామంలో కకావికలై పరుగులు పెడుతున్న జీవకోటి (మనబోటివాళ్ళం) అన్నమాట. ఎందుకు వీళ్ళంతా పరుగులు పెడుతున్నారు? భ్రమకులోనైనందువల్ల. స్త్రీ మీద భ్రమ, ధనంమీద భ్రమతో, మాయ అనే భూతంపట్టి వాళ్ళు పరమాత్మ అంశ అనే జ్ఞానం లేక 'నేను' అంటే ఎముకలు నెత్తురు మాంసం నరాలు వున్న 60 కిలోల దేహం అనుకొంటున్నారు. మరి ఇక వాళ్ళు నారాయణుడైన





శ్రీవేంకటేశ్వరుని చేరితే ఏమవుతుంది? తామెవరో తెలుసుకోగలుగుతారు.

**భావ వివరణ:**

ఓ శ్రీమన్నారాయణుడా! నీనామమును "మంత్రించి" ప్రయోగించినచో, పారేటి (జీవనయానంలో పరుగులు పెడుతున్న) యీ జంతువుల భ్రమలన్నీ విడిపించవే (తొలగించవయ్యా!)

ఈ జీవులకు 'మదన భూతము' సోకినది (మన్మథుడు అనే భూతం పట్టుకొన్నది). ఆడామగా అనే వివక్ష లేక విరిదలలై (తొలగిన విచక్షణ కలవారై) అంగమొలలై (దిగంబరులై) పెదవులు రక్తాలు చిమ్మేదాకా వీర్చి (చిమ్మించి) గోళ్ళతో గీరి, కొదలి (అతిశయించి) అవతలివారి పొందుకోసం గొంతుకలు కోసుకునే దాకా తెగిస్తారు. ఎంత దౌర్భాగ్యం!!

ఈ జీవులకి ప్రకృతిలో నున్న పంచభూతములు సోకి వశులను చేసికొని భ్రమలకు గుఱిచేసి అజ్ఞానులను చేస్తున్నవి. మన్ను పూసుకొనేవాడు ఒకడైతే తాంబూల రసాస్వాదనతో బ్రతికేవాడు ఇంకొకడు. ధనపిశాచి పట్టి జీవులు ఇట్టెరి. ఉచ్ఛము నీచమూ లేదు. ధనంకోసం చేయరాని పనులు చేస్తారు. ఎంత హేయమైన బ్రతుకులు!!

తమితోడ (అతి ఆసక్తిగల) ఈ జీవులకు భూతం పట్టింది. దానిపేరు "మాయా భూతము". దానివల్ల ఈ జీవుడు వాడెవరో తెలుసుకోలేకున్నాడు. ఓ శ్రీవేంకటేశ్వరా వాడు 'నేను' అనుకొంటున్నది తన దేహాన్ని అనేభ్రమలో వున్నాడు. దేహంలోని తోలు, నరాలు, యెముకలు వాడి జాతి అని అనుకొంటున్నాడు. నేను అంటే జీవుడు. వాడు నిజానికి పరమాత్మ ప్రతిరూపమే. కానీ మాయవాడిని ఆవరించి, అజ్ఞానియై అనేక భ్రమలకులోనై అరిషడ్వర్గ పీడితుడై దాని పర్యవసానంగా జననమరణాల విషవలయంలో చిక్కాడు. వీడికి ఏడుకొండలవాడి దయకలిగేదాకా ఈ భ్రమలు తప్పవు.

సంపుటి: 2 కీర్తన : భక్తి నీపై దొకటె పరమసుఖము
సంఖ్య : 322 పుట : 218 రాగం: శుద్ధవసంతం

## శుద్ధవసంతం

76 భక్తి నీపైదొకటె పరమసుఖము
యుక్తిచూచిన నిజం బొక్కటే లేదు. ॥ పల్లవి॥

కులమెంత గలిగె నది కూడించు గర్వంబు
చలమెంత గలిగె నది జగడమె రేఁచు
తలఁపెంత పెంచినాఁ దగిలించు కోరికలు
యెలమి విజ్ఞానంబు యేమిటా లేదు. ॥భక్తి॥

ధన మెంత గలిగె నది దట్టమౌ లోభంబు
మొనయుఁ జక్కందనంబు మోహములు రేఁచు
ఘనవిద్య గలిగినను కప్పుఁ బైపై మదము
యెనయఁగఁ బరమపద మించుకయు లేదు. ॥భక్తి॥

తరుణు లెందరుఅయిన తాపములు సమకూడు
సిరులెన్ని గలిగినను చింతలే పెరుగు
యిరవయిన శ్రీవేంకటేశ నినుఁ గొలువఁగా
పెరిగె నానందంబు బెళకు లిఁకలేవు. ॥భక్తి॥322

**అవతారిక:**

ప్రభూ! పరమసుఖమిచ్చేది ఈ ప్రపంచంలో యేదన్నా వున్నదంటే అది నీపై కలిగిన భక్తి మాత్రమే. అయితే ప్రాపంచిక సుఖాలు మాత్రమే అవసరం అనుకొన్నంత కాలమూ భక్తి రుచి మనిషి గ్రహించలేదు. యుక్తాయుక్త విచక్షణ వున్న వారికి నిజమైన సుఖము ఒక్క భక్తియేనని తెలుస్తుంది. శ్రీవేంకటేశ్వరుని కొలిచిన ఆనందము పెరగటమే కాదు





ఆపైన ఇక బెళకులుండవుట. కులము, ధనము, పేరు ప్రతిష్ఠలు, విద్యావైశిష్ట్యమూ... యేవీ శ్రీహరి భక్తికి సాటిరావంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! మాకు నీపై భక్తియొక్కటే పరమ సుఖము (ద్రైవికమైన సౌఖ్యమును) ప్రసాదించును. యుక్తి జూచిన (విచక్షణతో పరికించిన) ఆ పరమసుఖము ఒక్కటే నిజమైనది. మరియేదియును లేదు.

ఎవ్వరి“కులమై”నా యెంతగొప్పదైనా ప్రయోజనమేమిటి? దానివల్ల గర్వం పెరుగుతుంది, అంతేకద! జగడమెందుకువస్తుంది? యెంత ‘చలము’ (ద్వేషము) వుంటే, అది అంత వస్తుంది. ‘తలపు’ అధికమయిందంటే కోరిక తగులుకొంటుంది. అవన్నీ పీడిస్తున్నవాడికి యెలమి (అతిశయించిన) విజ్ఞానము (భగవత్సంబంధమైన జ్ఞానము) యెలాకలుగుతుంది?

ఇంకొక వింత యేమిటంటే ధనమెంత పెరుగుతుంటే లోభత్వం అంత యెక్కువవుతుంది. స్త్రీ పురుషులలో సౌందర్యమెక్కువైతే మోహము వారిపై పెరుగుతుంది. పోనీ విద్య వలన కూడా మంచి జరుగదు. భక్తిలేనివాడికి యెంత విద్యవున్నా అది మదమును పెంచటానికి తప్పించి ఇంకెందుకు ఉపయోగిస్తుంది? ఎనయగ (అవన్నీ వృద్ధిచెందివున్నచోట) పరమపదము ఇంచుకయినా సాధ్యంకాదు.

తరుణులు (స్త్రీలు) యెంతమందివున్నా పురుషులకు మదనతాపము కలుగుతూనే వుంటుంది. ఏమాత్రం తగ్గదు. సిరిసంపదలెన్నివున్నా చింతలు (దిగులు) పెరుగుతుందేకాని తరుగదు. స్థిరమైన శ్రీవేంకటేశ్వరా! నిన్ను కొలిచినయెడల ఆనందము పెరుగుతూనే వుంటుంది. వారికి బెళకులు (చలించిపోవుటలు) లేవు (వుండవు).

సంపుటి: 3 కీర్తన : భూమిలోన గొత్తలాయ బుత్రోత్సవ మిదివో
సంఖ్య : 17 పుట : 12 రాగం: రామక్రియ

## రామక్రియ

77 భూమిలోనఁ గొత్తలాయఁ బుత్రోత్సవ మిదివో
నేమపు కృష్ణజయంతి నేఁడే యమ్మా ॥ పల్లవి॥

కావిరి బ్రహ్మాండము కడుపులోనున్నవాని
దేవకి గర్భమున నద్దిర మోచెను
దేవతలెల్ల వెదకి తెలిసి కాననివాని
యీవల వసుదేవుఁడు యెట్టు గనెనమ్మా. ॥భూమి॥

పొడవుకుఁ బొడవైన పురుషోత్తముఁడు నేఁడు
అదరి తొట్టెలబాలుఁడాయ నమ్మ
వుడుగక యజ్ఞ భాగమొగి నారగించేవాఁడు
కొడుకై తల్లిచన్నుగుడిచీనమ్మా. ॥భూమి॥

పాలజలధియల్లుండె(డై?) పాయకుండేయీతనికి
పాలవుట్లపండుగ బాఁతే (తా?) యనటే
ఆలరి శ్రీవేంకటాద్రి నాటలాడనే మరిగి
పేలరియై కడు పెచ్చుపెరిగీనమ్మా ॥భూమి॥ 17

**అవతారిక:**

శ్రీకృష్ణజయంతి పర్వదినాన అన్నమాచార్యులవారు వినిపించిన కీర్తన ఇది. “ఓ అమ్మలారా! మనం అంతా నియమంతో జరుపుకొనే కృష్ణజయంతి వేడుక నేడు నందుని ఇంట పుత్రుడుదయించాడనె వుత్సవం భూమిపై ప్రతియేడూ జరుపుకొంటున్నా అది యెప్పటికప్పుడు కొత్తలాయె” అంటున్నారు అన్నమాచార్యులవారు. ఆ అల్లరి కృష్ణుడు శ్రీవేంకటాద్రిపై ఆటలాడుట మరిగిపేలరియై కడుపెచుపెరిగీనమ్మా! అంటున్నారు. అంటే





యేమిటి? ‘పేలరి’ అంటే వదరుబోతు అని అర్థం. వాగుడుకాయ అన్నమాట. మరి “బాత్రేయనటే” అంటే....?

**భావ వివరణ:**

ఓ అమ్మలారా! ఇదివో ఈ పుత్రోత్సవము (పుత్రుని పుట్టుక సందర్భంగా చేయు పండుగ) భూమిపై కొత్తలాయ (ఎప్పటికప్పుడు కొత్తగానే వుంటుంది). నేడే అట్టి కృష్ణజయంతి. ఇది నేమపు పండుగ (నియమం ప్రకారం జరిపే పండుగ).

కావిరి బ్రహ్మాండము (అనంత నిశీధిలో యెడతెగక విస్తరించే విశ్వము) తన బొజ్జలో దాచుకొన్న ఈ విశ్వరూపుని కంసుడి చెల్లెలు దేవకీదేవి తన గర్భమున మోసిందమ్మా! అద్దిర! (అదిరా... ఎంతంటే) దేవతలంతా త్రిభువనాలు వెదకినా కనబడని ‘పరమాత్మ’ యీ యాదవరాజు వసుదేవుడికి యెట్లా కనుపించాడో కదా!

ఆ దేవదేవుని లీలలు చెప్పలేమమ్మా!

పొడవుకు బొడవైన (ఉన్నతోన్నతుడైన) ఈ పురుషోత్తముడు నేడు, అదరి (అతిశయించి) తొట్టెలో బాలుడు (ఉయ్యాలలో శిశువు) యైనాడమ్మా! ఈ ప్రపంచంలో యెక్కడ యే యజ్ఞం జరిగినా ఆ యజ్ఞభోక్త (యాగఫలములో మొదటిభాగం ఈయనకే అర్పిస్తారు. దానిని ఆయన వుడుగక (వదలక) నారగించీ (స్వీకరిస్తాడు). అట్టి యజ్ఞపురుషుడు, కొడుకై చనుబాలుత్రాగుతున్నాడే... ఆహా! ఏమిఈ పరమాత్ముని లీల.

ఈయన యెవరో తెలుసునటే? క్షీరసాగరునికి స్వయంగా అల్లుడు. పైగా ఆయన నివాసస్థానంకూడ పాలసముద్రమే. అటువంటి వాడికి పాలవుట్లు తెంచేపండుగ ‘బాతేయనటే’ (ప్రేమకలిగిందటనే?) ఎంతెంత మనం పండుగ చేసికొంటే అదే ఆయనకు పండుగ. ఇవన్నీ ఆవిశ్వాత్మునికెందుకమ్మా? నేడు ఈ తిరుమలలో ఆలరి (అల్లరిపిల్లవాడే) శ్రీవేంకటాద్రిపై ఆటలాడమరగినాడు. పేలరియై (అతివాగుడుకాయయై) ఈ పిల్లవాడు కడుపెచ్చుపెరిగీనమ్మా (తెగ విజృంభిస్తున్నాడమ్మా!)

సంపుటి: 3 కీర్తన : ఇందులోననే నెవ్వరిబోలుదు
సంఖ్య : 581 పుట : 390 రాగం: పాడి

**పాడి**

78 ఇందులోన నే నెవ్వరిఁబోలుదు
అంది నీవాఁడ నేననుకొంటిఁజుమ్మీ ॥ పల్లవి॥

జలజనాభ నీ శరణనువారలు
అల నారదసనకాదులు
కెలన మరియు నీ కింకరవర్తులు
తెలిసినబ్రహ్మాదిదేవతలు ॥ఇందు॥

నోరార హరి నిను నుతించువారలు
చేరువనుండేటిశేషాదులు
ధారుణిలో నీదాసాన(ను?) దాసులు
మారుతిముఖ్యులు మహామహులు ॥ఇందు॥

బడి నీచే ముక్తివడసినవారలు
సుడిగొనుమునిజనశుకాదులు
కడఁగిన శ్రీవేంకటపతి నీవే
తడవి నన్ను దయదలఁచుమీ ॥ఇందు॥581

**అవతారిక:**

శ్రీమన్నారాయణుని ఆశ్రయించేవారిలో మూడు రకాలవారుంటారు. నారదమహర్షివంటి శరణాగతులు, ఆదిశేషునివంటి దాసులు, శుకమహర్షివంటి జీవన్ముక్తులు. వీరందరి ఆశయం ఒకటే అయినా అవలంభించిన మార్గాలలో భిన్నత్వమున్నది. ఇందులో నేనెవ్వరి బోలుదును స్వామీ! అని ప్రశ్నిస్తున్నారు అన్నమచార్యులవారు. నేనుమాత్రం నీవాడను అనుకొంటూనే బ్రతుకు వెళ్ళమారుస్తున్నానని





అంటున్నారు. తడవి నన్ను దయచూడుము ప్రభూ! నవవిధ భక్తిలో యేదోఒక విధమున తనను కడతేర్చమని బ్రతిమిలాడుతున్నారు అన్నమాచార్యులవారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఈ క్రిందివారిలో నేనెవ్వరి బోలియున్నానో తెలుపుము ప్రభూ! అంది (స్థిరపడి) ఇంతవరకు నేను నీవాడనే అని అనుకొంటున్నాను సుమా!

ఓ జలజనాభా! (పద్మనాభా) ఆనాటి నారదుడు సనకసనందనాది ఋషులు కెలన (దిక్కు) నీవే అన్నారు. వారు నీ శరణాగతులు. శరణని నిన్ను ఆశ్రయించినవారు. మరియు తెలిసిన (విఖ్యాతులైన) బ్రహ్మాదిదేవతలు నీ కింకరవర్తులు (భృత్యులు) వీరంతా ఆవిధముగా నీ శరణాగతులై నిశ్చింతగానున్నారు.

ఓ శ్రీహరీ! ఆదిశేషుడు నీ చేరువనే వుండి నీకు పానుపువలె సేవించుచు, నోరార (వేయినోళ్ళతో) నిన్ను కీర్తించుచు నీవాడైనాడు. మారుతి (ఆంజనేయుడు) మొదలైన మహామహులు ఈ ధారుణిలో (భూమిపై) నీదాస్యమును తరించే మార్గముగా నెంచుకొన్నారు. వారంతా నీ దాసానుదాసులుగావుండి నీ భక్తులకు యెన్నో వుపకారాలు చేస్తున్నారు.

ఓ పరమపురుషా! శుకమహర్షి, భారతము వ్రాసిన తన తండ్రి వ్యాసునివలె, తను కూడా భాగవతము వినిపించి బడి (శీఘ్రముగా) నీచే ముక్తిని బడసినాడు. వారంతా సుడిగొను (చుట్టుకొని) నీవద్దనే వుండే జీవన్ముక్తులు. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవే నన్ను కడగి (యత్నించి) తడవి (గ్రహించి) దయదలచవయ్యా! ఎందుకంటే నేను నీవాడను తండ్రీ!

సంపుటి: 3 కీర్తన : అతని నమ్మలే రల్పమతులు భువి
సంఖ్య : 533 పుట : 358 రాగం: వసంతవరాళి

**వసంతవరాళి**

79 అతని నమ్మలే రల్పమతులు భువి
నతఁ డాద్యుఁడు పరమాత్ముఁడు ॥ పల్లవి॥

సకలలోకపతి సర్వేశ్వరుఁడట
వొకఁడిఁక దొర మరి వున్నాఁడా
ప్రకటించఁగ శ్రీపతియే దాతట
వెకలి నియ్యఁ గొన వేరేకలరా. ॥అత॥

దివిజవందితుఁడు దిక్కుల హరియట
యివల మొక్క సురలిఁక వేరీ
కవ నంతర్యామి కరుణాకరుఁడట
వివిధభంగులను వెదకఁగనేలా. ॥అత॥

వేదాంగుఁడు శ్రీవేంకటపతియట
ఆదిమతము లిఁక నరసేదా
యేదెస నెవ్వరి కెప్పుడుఁ గలఁ డితఁ-
డీదేవుఁడె మన కిహపర మొసఁగ. ॥అత॥533

**అవతారిక:**

శ్రీహరి పరమాత్మ, ఆదిదేవుడు. కొందరు అల్పమతులు. ఈ సత్యమును నమ్మలేక చెడిపోతున్నారు. సర్వలోకపతి శ్రీపతియేనని తెలియకున్నారు. అందరి దిక్కూ ఆ దివిజవంద్యుడేనని అరయలెకున్నారు. వేదాంగములచే నేర్చి భావించవలసిన శ్రీవేంకటేశ్వరుని శరణని ఇహపరములను సాధించలేకున్నారు. కనుక మొదటి మెట్టు నమ్మం,





చివరిమెట్టు శరణాగతి మధ్యలో అన్నీ నమ్మకాన్ని సడలించే జారుడుమెట్లే. కానీ భయపడకండి... కరివరదుని శరణని పరమునెరిగే దారి నరయండి.

**భావ వివరణ:**

భువిని (ఈభూమిమీద) అల్పమతులు (తెలివతక్కువవారు) ఆతని (ఆ శ్రీహరిని) నమ్మలేరు, (లేనేలేడంటారు). నిజమేమిటంటే అతడు ఆద్యుడు (అన్నిటికి ఆదియైనవాడు), పరమాత్ముడు.

ఆయన సకలలోకపతి, సర్వేశ్వరుడూ అతడేనట. ప్రకటించగ (వెల్లడిజేయగా) మరి దొర (మరివేరొక అధిపతి) వొకడిక (ఇంకావొకడు) వున్నాడా? శ్రీపతి యొక్కడే దాతట. వెకవినియ్యగా (ప్రత్యక్షమీయగ) వేరొకరు కొనన్ (చిట్టచివర) కలరా?

అన్ని దిక్కులయందును మొక్కుటకు ఆదిక్పాలకులుంటారు. ఆ దివిజులందరికీ వంద్యుడు (పూజింపదగినవాడు) శ్రీహరియే. ఇవల (ఇటువైపున) ఇంకా అన్యులైన సురలేరీ? ఆక్రమించిన అంతర్యామి యెల్లరకు హరియే. ఆయన కరుణాకరుడట. మనలోనేవుండు వానిని, వివిధ భంగులను (రకరకములైన మార్గములలో) వెదకగనేలా (వెదుకుటెందులకు?)

శ్రీవేంకటేశ్వరుడు వేదాంగుడు (వేదములే అంగములుగా గలవాడు). ఆయన శరణాగతితో నేను ఆయన నాశ్రయించితిని (విశిష్టాద్వైతినైతిని). అటువంటప్పుడు "ఆది మతములికనరసేదా? (తొల్లిటి మతములను గురించి ఆలోచించుటెందులకు?) ఏదెస నెవ్వరి కెవ్వడుగలడు? (ఏ దిక్కుయైనా ఈ లోకంలో యెవ్వరికెవరున్నారు? అందరూ మధ్యలోవచ్చి మధ్యలో పోయేవారే కదా!) మనకు ఇహము, పరమునొసగెడివాడు ఈ దేవుడే. ఇంకెవ్వరూ లేరు, వుండరు.

సంపుటి: 2 కీర్తన : హరియవతారమితడు అన్నమయ్య

సంఖ్య : 100 పుట :67 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

80 హరియవతార మీతఁడు అన్నమయ్య
అరయ మాగురుఁ డీతఁ డన్నమయ్య ॥ పల్లవి॥

వైకుంఠనాథునివద్ద వడిఁ బాడుచున్న వాఁడు
ఆకరమై తాళ్లపాక అన్నమయ్య
ఆకశపు విష్ణుపాదమందు నిత్యమై వున్నవాఁడు
ఆకడీకడఁ దాళ్లపాక అన్నమయ్య ॥హరి॥

క్షీరాబ్ధిశాయి నిట్టే సేవింపుచు నున్నవాఁడు
ఆరితేరి తాళ్ళపాక అన్నమయ్య
ధీరుఁడై సూర్యమండలతేజమువద్ద నున్నవాఁడు
ఆ రీతులఁ దాళ్లపాక అన్నమయ్య ॥హరి॥

యీవల సంసారలీల యిందిరేశుతో నున్నవాఁడు
ఆవటించి తాళ్లపాక అన్నమయ్య
భావింప శ్రీవేంకటేశుపాదములందె వున్నవాఁడు
ఆ (హా)వ భావమై తాళ్లపాక అన్నమయ్య ॥హరి॥100

**అవతారిక:**

తాళ్లపాక పెదతిరుమలాచార్యులవారు తన తండ్రి అన్నమాచార్యులవారిని కీర్తిస్తూ చెప్పిన కర్ణపేయమైన కీర్తననాస్వాదించండి. అన్నమయ్య శ్రీహరి అవతారమని చెబుతున్నారు. తన గురువు కూడా అన్నమయ్యయేనంటున్నారు. వైకుంఠవాసమునొందిన తనతండ్రి నిత్యమూ క్షీరాబ్ధిశయనుని సేవించుటలో



అంతయు నీవే హరిపుండరీకాక్ష

ఆరితేరియున్నాడట. శ్రీవేంకటేశ్వరుని పాదముల చెంత తన హావభావములను ప్రకటిస్తూ అన్నమయ్య నేటికీ వున్నాడట.

**భావ వివరణ:**

ఈ అన్నమయ్య స్వయముగా శ్రీహరి అవతారమే. ఈయనే మాకు జన్మనిచ్చి శ్రీహరి భక్తియు నొసగిన గురుపుంగవులు.

వైకుంఠనాథునివద్ద ఆకరమై (స్థానమును పొందిన వాడై) ఈ తాళ్ళపాక అన్నమాచార్యులవారు వడి (వేగముగా) హరిని కీర్తించుచు పాడుచున్నారు. ఆకాశవీధిలో విష్ణుని పాదపద్మముల చెంత ఈయన నిత్యమై (శాశ్వతుడై) వున్నాడు. ఈ తాళ్ళపాక అన్నమయ్య ఆకడ (ఆ వైకుంఠసీమలోను) ఈ కడ (తిరుమల శిఖరాలచెంతను) హరి సేవలోనే గడుపుతున్నారు.

ఆరితేరిన (నిష్ణాతులైన) ఈ తాళ్ళపాక అన్నమయ్య, క్షీరసాగరశయనుడైన శ్రీహరిని ఇట్టే సేవింపుచూ వున్నవాడు. అదే ఆయనకు నిత్యకృత్యమైనది. సూర్యమండలపు దివ్యతేజస్సుతో వెలుగులు జిమ్మే చోట అన్నమయ్య ధీరుడై తేజో మూర్తియైయున్నాడు.

ఈవల (ఈ కలియుగంలో) సంసారలీల ప్రకారం ఇందిరానాథునితో ఈ తాళ్ళపాక అన్నమయ్య ఆవటించి (పొందికతో) యున్నవాడు. భావించిచూడగా శ్రీవేంకటేశ్వరుని పాదపద్మముల చెంతనే తన హావభావములను ప్రకటించుచు తేజోరూపుడై ఈ అన్నమాచార్యులవారు హరిసేవలో వున్నారు.

సంపుటి: 5 కీర్తన : సుతుని నరకుని జంప జూచినాడవు సుమ్మీ

సంఖ్య : 66 పుట : 45 రాగం: పాడి

**పాడి**

81 సుతుని నరకునిఁ జంపఁ జూచినాఁడవు సుమ్మీ
మతి నన్నుఁ దలఁచక మానిన నీకాన ॥ పల్లవి॥

ఎత్తుక నీతోడఁబుట్టు హిరణ్యకశిపుని
నెత్తురు దాగితి సుమ్మీ నేఁడే రాకుంటే
ఉత్తలాన నేడనైనా నుండుదువో యని భీతి
బిత్తరముగాఁ బెట్టితి పెట్టరాని యాన ॥సుతుని॥

కప్పుక మేనమామ కంసుని ప్రాణానకు
తప్పినవాఁడవు సుమ్మీ తడసితేను
ఇప్పుడిట్టే నీవు రాని యీరసానఁ బ్రియములు
చెప్పలేక పొడిచితి చెడుగైన యాన ॥సుతుని॥

సిరుల మేన మరఁది శిశుపాలు నీ విట్టే
పొరిగొంటివి సుమ్మీ పోయితే నీవు
తిరువేంకటేశ నిన్నుఁ దివిరి కూడి (డే?) వని
కరుణఁ బెట్టితి నీకుఁ గపటాన నాన ॥సుతుని॥

**అవతారిక:**

పరంధాముని నిందాస్తుతితో ప్రార్థించిన భక్తాగ్రేసరులు కోకొల్లలు. బాధతాళలేక నిందించినా అది స్తుతితోనే ముగుస్తుంది. ఈ కీర్తన ప్రత్యేకత యేమంటే అన్నమయ్య. వ్యావహారిక దృష్టిలో 'కొడుకు'ను చంపిన క్రూరుడు, 'అన్నను' చంపిన అతి జిత్తులమారి, మేనమరిదిని చంపిన కఠినుడు నన్ను కాపాడతాడో లేదోనని యేవేవో ఒట్లు పెట్టి నన్ను కాపాడమని వేడుతున్నాను ఇవన్నీ 'కపటపు ఆనలే' ప్రభూ! ఎలాగైనా





నీదయ పొందాలనే నా 'ప్రయత్నం' అంటున్నారు పరమాత్మతో. ఇటువంటి కీర్తన మనసును కరిగిస్తుంది.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీవు కఠినాత్ముడవు. నీసుతుడైన నరకుని (వాడు శ్రీహరికీ భూదేవికి, హిరణ్యాసుర వధానంతరం పుట్టిన కొడుకు) చంపజూచి, వాడిచావు వాడి తల్లి అంశతో జన్మించిన సత్యభామ చేతితో జరిపించావు). నన్ను దయతలచక మానితే నీకు 'ఆన' (ఒట్టే సుమా!)

నీవు నరసింహుడవై హిరణ్యకశిపుని చీల్చి చంపి వాడినెత్తురు నేలరాలరాదని వాడి నెత్తురు త్రాగినావు. ఇంతాజేసి వాడు నీతోడబుట్టిన అన్నయే కదా! వాడు చెల్లెలుదితి కొడుకైతే, నీవు అక్క అదితి కొడుకువి. ఉత్తలాన (తొందరపాటుతో) యెక్కడైనా నాకోసం పొంచివున్నావేమోనని భీతిచే బిత్తరజెంది పెట్టరాని 'ఆన' బెట్టితినయ్యా! నన్ను క్షమించు. నీవు నన్ను చంపితే అంతకంటే నేకోరునదేమున్నది తండ్రీ!

నీవు మేనమామను చంపిన గొప్ప మేనల్లుడవని అందరూ యెరిగినదే కదా! మామూలుగా చంపవచ్చును కదా! వాడిని (కంసుని) ఆకాశవాణిద్వారా హెచ్చరికపంపి మేనల్లుళ్ళని చంపిన క్రూరుడన్న పాపం అంటగట్టి, వాడిని ప్రాణానకు తప్పినవాడవు (ప్రాణాలు తీసినవాడవు). ఈరసార (కొద్దిగా ఈర్ష్యతో) ప్రియములు చెప్పలేక, తొందరపడి ఇప్పుడు నేను యేవేవో 'ఆన'లు (ఒట్లు) పెట్టేను. అంతే స్వామీ! వాటిని లెక్కజేయకు.

స్వయముగ నీ మేనమరిది శిశుపాలుని సుదర్శన చక్రంతో పొరిగొంటివి (తలనరికేవు). సభలో తరిమితరిమి చంపినావు. అందుకు నూరుతిట్లు నిన్ను తిట్టినపాపము వాడి చేత చేయించావు. పోయితే నీవు (ఇకపోతే నీవు) తిరువేంకటేశ్వరుడవై తివిరి (ప్రయత్నముతో) నన్ను కూడేవని (అనుగ్రహింతువని) నీకు కపటపు ఆనలు పెట్టాను స్వామీ! నన్ను కరుణతో చూస్తే చాలు తండ్రీ! నీకు ఆనలు పెట్టే ధైర్యం నాకెక్కడిది ప్రభూ!

సంపుటి: 5 కీర్తన : మొలనూలి గొల్లెత మురియుచును
సంఖ్య : 372 పుట : 252 రాగం: శుద్ధదేశి

## శుద్ధదేశి

82 మొలనూలి గొల్లెత మురియుచును
వలవంతఁ దిరిగీని వాడవాడలను ॥ పల్లవి॥

సంపెఁగలతురుముతో చల్లలమ్మీనిదివొ
వంపుమోము గొల్లెత వాడలను
యింపులకోరికె తో నిందిరాపతి యెదుట
జంపుల నటనలతో సొళగింపుచును ॥మొలనూ॥

నొసలికస్తూరితోఁ గన్నుల నవ్వీనిదివో
వసివాడు గొల్లెత వాడలను
కసరుచు హరిమీఁదికాఁకల కోపముతో
యెసరుఁజెమట గోర యెమ్మెలఁ జిమ్ముచును ॥మొలనూ॥

చెలవంపుటుంగరాల చెయి వీచీనిదివో
వలపుల గొల్లెత వాడలను
కలికియై తిరువేంకటవిభుకౌఁగిట
అలసిన నటనల నల్లంతనేఁగుచును. ॥లలల॥

**అవతారిక:**

ఆ గొల్లెత మొలనులు (స్త్రీలు ప్రత్యేకముగా ధరించు మొలత్రాడు) ధరించినదై మురిపెముతోనున్నదట. ద్విగుణీకృతమైన అందంతో ఆమె వాడవాడలా విరహవేదనతో తిరుగుతున్నదట. ఆమె సంపెంగపూలు కొప్పులో తురిమింది. నొసటిమీద కస్తూరీ తిలకం ధరించింది. ఉంగరాల చేతిని విలాసంగా వూపిందట. తరువాత వేంకటపతి సందిట నర్తించి





అలసినదట. ఇది సరస శృంగార కీర్తన. అన్నమాచార్యులవారి శృంగార భక్తి నభూతో నభవిష్యతి.

**భావ వివరణ:**

మొలనూలు (స్త్రీలు ధరించునట్టి మొలత్రాడు) ధరించిన ఆ గొల్లెత (గొల్లభామ) మురియుచును (సంతోషంతో మురిసిపోతూ) వాడవాడలా (పల్లెలోని తన పేటంతా) వలవంత దిరిగీని (మదనవేదనతో తిరుగుచున్నది).

ఆ గొల్లెతవంపు మోము గొల్లెత (గుండ్రని ముఖముగల గొల్ల భామ). ఆమె చల్లలమ్ముతుంది. ఆమె తలలో సంపెంగపూలు ధరించినది. ఆమె ఇందిరాపతియైన శ్రీకృష్ణుని వలచినది. మధురమైన కోరికలతో రగులుచున్న ఆమె కదలాడుచున్న 'చెంపసరాలు' ధరించి కలివిడిగా ఆ గొల్లవాడంతా తిరుగుచున్నది.

ఆమె తన నొసట (నుదురుపై) కస్తూరి తిలకమును ధరించినది. తన కన్నులతోనే ఆమె మనోహరంగా నవ్వుతున్నది. వాడ అంతా కలియతిరుగటచే వసివాడిన (అలసిన). ఆమె ముఖము నీరసముగానున్నది. హరిమీద (కృష్ణునిపై) కసరుచు (విసుగుకొనుచు) కాకకోపముతో (మండించే క్రోధముతో) ఆ గొల్లెత, యెసరుజెమట (వేడిచెమటను) చిమ్ముచున్నది.

వలపులను చిందిచుచున్న ఆ గొల్లెత వాడ అంతా కలయతిరుగుచున్నది. చెలువంపుటుంగరములను (సొగసైన అంగుళీయకములను) వేళ్ళకు ధరించిన ఆమె తన చేయి (చేతిని) ఇదిగో ఎలా వీచుచున్నదో చూడండి. ఆమె కలికియై (అందాలరాసియై) శ్రీవేంకటేశ్వరుని కౌగిట కరగి నర్తించుచు అటూఇటూ యేగుచు (నడచుచు) మిక్కిలి అలసినది.

సంపుటి: 5 కీర్తన : శిన్నెక తేవే శెలువుని తా
సంఖ్య : 268 పుట : 183 రాగం: మేచబౌళి

**మేచబౌళి**

83 శిన్నెక తేవే శెలువుని తా
వెన్నలు సవిగొను వెన్నుని తా ॥ పల్లవి॥

మూటల్ మాటల్ మూరల్ బారల్
బాటల్ సదివే బాపలు తా
వేటల్ వీపుల్ వేలుపు గుడుపుల్
తేటలు మరగిన దేవుని తా ॥శిన్నెక॥

వాకుల్ చీకుల్ వాదుల్ పోదుల్
సోకపు తొల్లిటి సుద్దుల్ తా
పోకులు లోకుల్ పొగడఁగ మనిపెడి
కేకిగరుల తల కిష్ణుని తా ॥శిన్నెక॥

బగ్గుల్ నగ్గుల్ బావుల్ సొరె (ర?) గా
దగ్గర వెరపగు తపసుల తా
సిగ్గుల్ వాపెడి శ్రీ వేంకటపతి-
నగ్గపు సొమ్ములయాతని తా ॥శిన్నెక॥

**అవతారిక:**

జానపదుల బాణీలో కొనసాగే అన్నమాచార్యులవారి కీర్తననాస్వాదించండి. ఒక గోపిక ఇంకొక గోపికను శిన్నెక అనిపిలిచి తన చెలికాడైన 'కిష్ణుని' (కృష్ణుని) తీసికొని రమ్మని వేడుకొంటున్నది. వాడు వెన్నల నారగించేవెన్నుడట. ఆతనిని తెమ్మంటున్నది. ఈ కీర్తనలో తా అని ప్రతిచరణం ముగిసినందువలన 'తా' అనునది తాళము కోసం తాలద్యోతకమని తోచుచున్నది. చరణములలో కొన్ని మాటలు ధ్వని





ప్రధానమైనవి. కావున చిందేసే ఆటకు ప్రత్యేకించినవే. కీర్తన ప్రతిపదార్థం అసంభవమని నా భావన.

**భావ వివరణ:**

ఓ శిన్నెకా! (చిన్నక్కా!) శెలువుని (చెలికాడైన ఈ శ్రీకృష్ణుని) తేవే (నాయెదుటకు తీసికొనిరావే). ఈతడెవరో తెలియునా? చిన్నప్పుడు ఇంటింటా వెన్నదొంగతనం చేసి, చవిగొన్న (రుచి మరిగిన) వెన్నడు (శ్రీకృష్ణుడు).

ఈ అల్లరి పిడుగుకు ఆనాడు, మాటలు మూటలుగా వుండేవి. అవి బారలు, మూరలు (బారెడు మూరెడు మాటలు... అంటే... పెద్దగా ఆరిందలా మాట్లాడేవాడు.) బాటలు సదివే బాపలు తా (వేదపండితులమని విఱ్ఱవీగే బ్రాహ్మణులకు హితోపదేశము చేశాడు.) వేలుపు కుడుపులు (దేవతల కివ్వవలసిన నైవేద్యము) ఇవ్వలేదని అలిగిన దేవేంద్రుడి దేవతల వీపులు సాపుచేసి వేటాడినాడట. ఎందుకంటే ఈయన తేటలు మరిగిన దేవుని తా (ప్రసన్నత అతిశయించిన దేవదేవుడట).

ఈ చరణానికి అన్నమయ్య భావన సులభగ్రాహ్యము కాదు. నా భావన నా స్ఫురణయే..)

తొల్లిటి సోకపు సుద్దులు (దేవతల తొలినాటి కష్టములు) తొలగించుటకు కేకిగరులతల కిష్ణుడు (నెమలి పింఛమును తలపై ధరించిన శ్రీకృష్ణుడు, లోకులు పొగడగ పోకులు (లీలలు) ప్రదర్శించాడు.

దుర్మార్గులు పెట్టు అంతరాయములు పోయి వెఱపగు తాపసుల (భీతిల్లిన మునుల) దగ్గరయై ప్రశాంతముగానున్నారు. దివ్యాభరణములు ధరించిన శ్రీవేంకటేశ్వరుడు భక్తుల సిగ్గులు బాపెడి పరమపురుషుడు.

సంపుటి: 5 కీర్తన : పసులు గాచేటి కోల పసపుజేల
సంఖ్య : 96 పుట : 66 రాగం: ముఖారి

### ముఖారి

84 పసులు గాచేటి కోల పసపుఁ జేల
పొసఁగ నీకింతయేల బుద్ధుల గోల ॥ పల్లవి॥

కట్టిన చిక్కపు బుత్తి కచ్చుకాయల తిత్తి
చుట్టిన పించెపుఁబాగ చుంగుల సోగ
ఇట్టి సింగారము సేయ నింత నీకుఁ బ్రియమాయ
వెట్టి నీచేఁతల మాయ విట్టలరాయ ॥పసులు॥

పేయలఁ బిలుచుకూఁత పిల్లఁగోవి బలుమోఁత
సేయరాని గొల్లెతల సిగ్గులచేఁత
ఆయెడలఁ దలపోఁత యమున లోపలి యీఁత
వేయరాని మోపులాయ విట్టలరాయ ॥పసులు॥

కొంకులేని పొలయాట కూరిములలో తేట
అంకెల బాలులతోడి యాట పాట
పొంకపు తుత్తురు కొమ్ము పొలుపైన నీ సొమ్ము
వేంకటనగము చాయ విట్టలరాయ. ॥పసులు॥

**అవతారిక:**

విఠ్ఠల దేవుని విట్టలరాయా అని సంభోదిస్తూ గొప్ప జానపదకీర్తన చెబుతున్నారు అన్నమయ్య. ఇదివరలో ఇటువంటి కీర్తన నాస్వాదించినప్పటికీ దీని ప్రత్యేకత యేమంటే చాలా మాటలు యధాతథంగా నిఘంటువులలో దొరకవు. "పసపు జేల" అంటే ఏమిటి? పసుపురంగు చేలము అని అర్థం చేసికోవాలి, అంటే పీతాంబరుడైన కృష్ణుడు, దూడలను కాచే ఈ విట్టలరాయుడు వింతకూతవేసి ఆ దూడల్ని





తన దగ్గరకు పిలుస్తాడట. ఎంతని చెప్పను? గొప్ప వర్ణన. మీరే రుచి చూడండి.

**భావ వివరణ:**

ఈ విట్టలరాయడు (విఠ్ఠలుడు) యెలావున్నాడంటే ఈతడు పసుపుజేల (పీతాంబరము) కట్టిన శ్రీకృష్ణుడు ఇతని చేతిలో పసులుగాచే కోల (ముల్లుకఱ్ఱ) వుంటుంది. స్వామీ! పొసగ (అతిశయించుటకు) నీకింత బుద్ధుల గోల యెందుకయ్యా!

ఇతడు తన బుత్తి (భోజనము) చిక్కములో (చిన్న వుట్టిలో) కట్టి తెచ్చుకొన్నాడు. గచ్చకాయల తిత్తి (గచ్చకాయరంగులో వుండె తన వుంగరాల జుట్టును కుచ్చులుగా కట్టుకొన్నాడు. చుట్టిన తలపాగలో నెమలిపింఛము గుచ్చి అలంకరించుకొన్నాడు. ఇటువంటి సింగారము నీకు ఇంత ప్రియమా విట్టలరాయా! నీచేతలు యెంతవెట్టి (పనికిమాలిన) వో చెబుతాను, వినవయ్యా!

ఈ విట్టలరాయుడు తన ఆవు పేయలను (దూడలను) ఒక వింతయైన 'కూత'తో పిలిచి ఒకచోట చేరుస్తాడు. అతని పిల్లఁగోవి (మురళి) బలు మోత (పెద్ద ధ్వని చేస్తుంది). అతడు గొల్లెతలతో చేయరాని సిగ్గుల చేతలు చేస్తాడు. ఆపైన యమునాతటిలో అతని లీలలు తలపోతలు వేయరాని మోపులు (ఆరోపణలకు) దారితీశాయి.

కొంకులేని (ఏమాత్రమూ జంకులేని) అతని పొలయాట (రాసలీల) కూరిములలో తేట (ప్రణయమాధుర్యపు తేట). అంకెల బాలులతోటి (తన ఈడు గొల్ల బాలురతో) నిత్యమూ ఆటపాటలతో కాలక్షేపం చేస్తాడు. ఈ వేంకటాద్రి నీడలోని విట్టలరాయా! నీ పొలుపైన సొమ్ము (ఒప్పయిన ఆభరణం) యేమిటో తెలుసునా స్వామీ? నీ పొంకపు తుత్తురుకొమ్ము (నీ అందమైన తూతూ ధ్వనిచేసే శృంగనాదము). దానినే కొందరు "కొమ్ముబూర" అంటారు.

సంపుటి: 5 కీర్తన : కుందణంపుమై గొల్లెత తా-
సంఖ్య : 92 పుట : 63 రాగం: ఆహిరి

**ఆహిరి**

85 కుందణంపుమై గొల్లెత తా-
నెందును బుట్టని యేతరి జాతి ॥పల్లవి॥

కప్పులు దేరేటి కస్తురి చంకల
కొప్పెర గుబ్బల గొల్లెత
చప్పుడు మట్టెల చల్లలమ్మెడిని
అప్పని ముందట హస్తిణిజాతి ॥కుంద॥

దుంప వెంట్రుకల దొడ్డతురుముగల-
గుంపెన నడపుల గొల్లెత
జంపుల నటనలఁ జల్లలమ్మెడిని
చెంపల చెమటల చిత్తిణిజాతి ॥కుంద॥

వీఁపున నఖములు వెడవెడ నాఁటిన
కోపపుఁ జూపుల గొల్లెత
చాఁపున కట్టిగఁ జల్లలమ్మెడిని
చాఁపేటి యెలుగున శంకిణిజాతి ॥కుంద॥

గారవమున వేంకటపతి కౌఁగిట
కూరిమిఁ బాయని గొల్లెత
సారెకు నతనితో చల్లలమ్మెడిని
భారపుటలపుల పద్మిణిజాతి ॥కుంద॥

**అవతారిక:**

కావ్యనాయికలను శృంగారశాస్త్రం నాలుగురకాలుగా వర్ణించింది. పద్మినిజాతి స్త్రీ, హస్తిణి, చిత్తిణి, శంకిణి అని చెప్పబడిన వీరిలో ప్రతి యువతి తన శారీరక, మానసిక లక్షణాలను బట్టి ఆ జాతికి చెందిన స్త్రీగా నిశ్చయింపబడినది. ఈ కీర్తనలో అన్నమాచర్యులవారు నలుగురు గొల్లెతలను ఆ విధంగా విభజించి బంగారు శరీరఛాయతోనున్న గొల్లెత తానెందును





బుట్టని యేతరిజాతి చిన్నది అంటున్నారు. అంటే యేమిటి? సరసశృంగారంకాస్త గూఢంగా వుంటే అందం కదా! భావవివరణ జాగ్రత్తగా చదవండి. కొసమెరుపేమంటే, నలుగురికీ ఆ నల్లనివాడంటే వుల్లములో జల్లే.

**భావ వివరణ:**

కుందణంపుమై (బంగారు శరీరచ్ఛాయగల) గొల్లెత (ఆ గొల్లభామ) తాను యెందును (ఏజాతిలోనూ) పుట్టని యేతరిజాతి (అతిశయముగల స్త్రీ). అనగా వూహాసుందరి.

కప్పులుదేరేటి కస్తూరి (నల్లని కస్తూరీ పరిమళముగల) బాహు మూలములామె ప్రత్యేకత. ఆమె కొప్పెర గుబ్బల (వున్నత కుచయుగళము) గల గొల్లెత. ఆమె చల్లలమ్ముటకు పోతుంటే ఆమెమట్టెల చప్పుడు ప్రతిధ్వనిస్తుంది. అప్పనిముందట (హరియెదుట) ఆ హస్తిణీజాతి గొల్లెత నడయాడుచున్నది.

ఆమె తల వెంట్రుకలు, దుంపలు కట్టి (కుచ్చులు కట్టి) పెద్ద కొప్పుతో వున్నది. ఆమె నడుస్తుంటే గుంపెనగా (అట్టహాసముగా) వుంటుంది. ఆమె కదులుతుంటే ఆమె చెవులకు దరించిన జంపులు (చెంపసరములు) నర్తించుతాయి. చల్లలమ్ముటకు ఆమె మధురానగరంలో నడుస్తుంటే శ్రమవల్ల ఆమె చెంపలు చెమటను చెమరించుచున్నవి. ఆమె తప్పకుండా చిత్తిణీజాతి స్త్రీయే సుమా!

ఇదిగో ఈ గొల్లెతను చూడండి. ఉద్రేకమున ఈమె వీపుపై నఖక్షతములను సైతము జేయగలదు. ఈమె చూపులే చురచురమనునట్లు కోపాగ్నితో వుంటాయి. ఆమె నడుస్తుంటే పరుగెడునట్లుంటుంది. ఈమె చల్లలమ్ముటకు చాపేటి యెలుగున (పెద్ద గొంతుతో కేకలు వేస్తూ అమ్ముతుంది). ఈ జవ్వని శంకిణిజాతి గొల్లెత.

ఈ గొల్లెతను చూశారా? ఈమె అతిశయించిన గారవము (గౌరవము)తో శ్రీవేంకటేశ్వరుని కౌగిటిని యెన్నడు విడువదు. తిరుమలేశునిపై ఆమె యెనలేని కూరిమి (వలపు) కలిగి వుంటుంది. ఈ గొల్లెత యెప్పుడు చల్లలమ్ముటకు పోయినా తనవెంట ఆ రమణుడే వుండాలని ఆశపడుతుంది. ఆమె భారపు (అధికమైన) అలసటను (శ్రమను) తట్టుకోలేదు. ఆమె ఆయనకు ప్రియమైన పద్మినీజాతి స్త్రీ.

సంపుటి: 5 కీర్తన : నెయ్యములల్లో నేరేళ్ళో
సంఖ్య : 179 పుట : 123 రాగం: దేసాళం

## దేసాళం

86 నెయ్యములల్లోనేరేళ్ళో
వొయ్యన వూరెడి వువ్విళ్ళో ॥పల్లవి॥

పలచని చెమటల బాహుమూలముల-
చెలమలలోనాఁ జెలువములే
థళథళమను ముత్యపుఁ జెఱఁగు సురటి
దులిపేట నీళ్ళతుంపిళ్ళో ॥నెయ్యము॥

తొటతొటఁ గన్నులఁ దొరిగేటి నీళ్ళ
చిటి పొటి యలుకల చిరునగవే
వటఫలంబు నీ వన్నెల మోవికి
గుటుకలలోనా గుక్కిళ్ళో ॥నెయ్యము॥

గరగరికల వేంకటపతి కౌఁగిట
పరిమళములలో బచ్చనలు
మరునివింటి కమ్మనియంప విరుల-
గురితాఁ కులినుపగుగ్గిళ్ళో ॥నెయ్యము॥

**అవతారిక:**

జానపదులు కోలాటములాడుతూ పాడే మధురమైన కీర్తన అన్నమాచార్యులవారి ద్వారా ఆస్వాదించండి. అల్లోనేరేడు పళ్ళవలె మధరములైన నెయ్యములు (స్నేహములు) ఒయ్యన (తిన్నగా) వువ్విళ్ళురు చున్నవి. ఇది ఆట ప్రధానమైన కీర్తన. బాహుమూలములలో పలచని చెమటల గురించి వర్ణించగలిగిన సత్తా అన్నమయ్యకు మాత్రమే వున్నదని





వేరే చెప్పక్కరలేదు. ఇది సుగ్రాహ్యము అనుకోవడానికి వీలులేని కీర్తన. జాగ్రత్తగా చదివితేకాని అర్థంకాదు, మరి.

**భావ వివరణ:**

మా నెయ్యములు (స్నేహము) అల్లోనేరేడు పండ్లవలె మధురమైనవి. ఒయ్యన (తిన్నగా) వువ్విళ్ళూరెడి మా అనుబంధం దినదిన ప్రవర్ధమానమవుగాక!

బాహుమూలములలో పరిఢవిల్లిన లే చిత్తడి చెమటల చెలమలలో అందములు అలంకార ప్రాయమైనవి. ఈ నృత్యమువలన చెమట ఇంకా అధికమై, థళథళమను (తళతళమని) మెరయు ముత్యములను చెరగు సురటి (విసనకఱ్ఱ), దులిపేటి నీళ్ళతుంపరల వలె వున్నవి.

ఈ గోవిందుడు తన విరహంతో ఆమెనెంత బాధిస్తున్నాడంటే, ఆమె కన్నులనుండి తొటతొటమని కన్నీరు కురియుచున్నది. ఆమె అది తాళలేక అలుక వహించినది. ఆ చిటిపొటి (చిన్న చిన్న) అలుకలు చివరికి చిరునవ్వులై రావిపండురంగులోనున్న నీ వన్నెల అధరమునాస్వాదించి గుక్కిళ్ళువేయుచూ (గుటకలు మింగించినది). అలుకలు మరింత మధురమైనవి.

ఓ గరగరికల (నిర్మలుడవైన)వేంకటేశ్వరా! నీ కౌగిటిలో పరిమళములు వెదజల్లు మీ ఒంటిపై పూతలు ఒండొరులకు ఎలా వున్నాయంటే మన్మథుని వింటినుండి వెలువడిన కమ్మని పుష్పబాణములు కూడా గురిగా తాకునట్లు మీపై వేసిన ఇనుప గుగ్గిళ్ళవలెనున్నవి.

సంపుటి: 5 కీర్తన : అంజలిరంజలిరయం తే

సంఖ్య : 289 పుట : 197 రాగం: శ్రీరాగం

## శ్రీరాగం

87 అంజలిరంజలిరయం తే
కిం జనయసి మమ ఖేదం వచనై: ॥పల్లవి॥

మాం కిం భజసే మయా కింతే
త్వం కోవా మే తవ కాఽహం
కిం కార్యమితో గేహే మమ తే
శంకాం వినా కిం సమాగతోసి ॥అంజలి॥

నను వినయోక్తేర్న యోగ్యాఽహం
పున: పునస్త్వం పూజ్యోసి
దినదిన కలహవిధినా తే కిం
మనసిజజనక రమారమణ ॥అంజలి॥

దైవం బలవత్తరం భువనే
నైవ రోచతే నర్మ మయి
ఏవమేవ భవదిష్టం కురు కురు
శ్రీవేంకటాద్రి శ్రీనివాస. ॥అంజలి॥

**అవతారిక:**

చక్కటి సంస్కృత కీర్తన వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. నాయిక శ్రీవేంకటేశ్వరునిపై అలిగింది. నీకు దండంపెడతాను నన్నెందుకు





మాటలతో ఏడిపిస్తావు. అని రుసరుసలాడిందామె. నీవెవరివి? నేనెవరిని? పోపోవయ్యా! అని పోట్లాడింది. కాని ఆయన లేకుండా క్షణం వుండలేదామె. చివరికి నీ ఇష్టం మహాప్రభో! అని లొంగిపోయింది.

**భావ వివరణ:**

నీకు ఈ నమస్కారములు, వందనములు. నాకు నీ మాటలతో యెందుకు దు:ఖమును కలిగిస్తున్నావు?

దేవా! నన్నెందుకు తలచెదవు? నాతో నీకేమిటి? నీవెవరవు? నీకు నేనేమవుతాను? నీవు నాకేమవుతావు? నా ఇంట్లో నీకేమి పనివున్నదయ్యా? నాపై నీకు శంకలేకుంటే ఇక్కడికెందుకు వచ్చావు?

ఓ మనసిజ జనకా! (మన్మధునికి తండ్రీ) నీ వినయపు మాటలకు నేను యోగ్యురాలనా? కానయ్యా! నీవు మరల మరల పూజింపదగిన వాడివైయున్నావు. దినదినమూ జరిగే ఈ కలహాలతో నీకేమి పనిలే? ఓ రమారమణా! నేను దీనితో విసిగిపోయాను.

భువనములో దైవమే బలవత్తరమైనది. నాయందు నీవంచనలు నాకు రుచించవు. పోనీలే, నీకేది ఇష్టమో అదేచేయుము. ఓ వేంకటాద్రిపైనున్న శ్రీనివాసా! నేనేమనగలను?

సంపుటి: 5　　కీర్తన : సిన్నవాడవని నమ్మసెల్లదునిన్ను
సంఖ్య : 15　　పుట : 11　　రాగం: భైరవి

**భైరవి**

88 సి (చి)న్న వాఁడవని నమ్మ సెల్లదు నిన్ను
సిన్నైన యాటదెల్ల సిక్కు సీరై పోయను ॥పల్లవి॥

అవుర బాలకిసునరాయఁడ నీవు సంటిపాలు
సవులంటా నెత్తురెల్ల సప్పరించఁగా
కవకవ నవ్వి నవ్వి కన్నులు దేలగిలఁగ
సవరన్ని (ని) యాటదెల్ల సప్పుసారై పోయను ॥సిన్న॥

రారా గోపాలకిసునరాయ నీవదె గొల్ల-
వారి మగుపల సూవు (పు) వల్లె వేయఁగా
సూరఁబోయె రేపల్లె సొక్కని యా గుబ్బెతల-
సేరలంతల కన్నుల సిన్ని సిన్ని సిగ్గులు ॥సిన్న॥

కిన్నెర వెంకటగిరి కిసునరాయఁడ నీవు
వన్నెలుగ వీది వీది వాయించఁగా
మిన్ను దాఁకి లోకానకు మేఁటియైన లకిమమ్మ
నిన్ను సేరి సరుగన నిలుసుండే సొక్కెను ॥సిన్న॥

**అవతారిక:**

జానపదుల బాణీలో సాగిన కృష్ణలీలామృతం వినిపిస్తున్నారు అన్నమాచార్యులవారు. ఈ కీర్తనలో ఆయన వాడిన బాలకిసున రాయడు, సిక్కుసీరై పోయను, సప్పుసారైపోయను వంటి మాటలు జానపద సాహిత్యంలో వుంటాయేమోకాని నేటి తెలుగు పాఠకులకు సుపరిచితాలు కాదు. ఈ బాలకృష్ణుని చిన్నవాడని నమ్మటానికి వీలులేదట. నేడు ఈ వెంకటగిరి కిసునరాయడు వీధివీధిలో కిన్నెర వాయిస్తుంటే లకిమమ్మ





ఆయనను సేరి సరుగున నిలుసుండిందట. ఈ పాటికి మీకూ కొంత బుర్రకెక్కింది కదా!

**భావ వివరణ:**

ఓ కిసునరాయా! (కృష్ణరాయా!) నిన్ను చిన్నవాడవని నమ్మసెల్లదు (నమ్మకూడదు). సిన్నైన యాటదెల్లా (యుక్తవయసు వచ్చిన ప్రతి ఆడపిల్లా) నీమూలంగా, సిక్కు సీరై పోయను (సిగ్గుతో చితికిపోయింది).

అవుర బాలకిసునరాయడ (ఔరా! బాలకృష్ణరాయా!) నీవు సంటిపాలు (స్తన్యము) రుచిగావుంటుందని పూతన స్తనము చప్పరించి నెత్తురంతా పీల్చేస్తే అది కవకవ (వికటంగా) నవ్వినవ్వి కళ్ళు తేలేసింది. సవరని యాటదెల్ల (అందమైన ఆ యువతి పూతన) సప్పుసారైపోయను (చచ్చి శవమై పోయింది).

ఓ గోపాల కృష్ణరాయా! నీవు అదిగో ఆ గొల్లవాడలో మగువల చూపులు వల్లెవేయగా (చూపులతో చూపులు కలిపి చిలిపి సంకేతాలీయగా), సూరబోయె రేపల్లె (సిగ్గుతో రేపల్లె చితికిపోయింది). గుబ్బలవంటి కుచగిరులున్న గొల్లెతల చేరడేసి కన్నులు 'సిన్ని సిన్ని సిగ్గులు' చిమ్మినవి.

ఓ వేంకటగిరి కిసునరాయ (వేంకట కృష్ణరాయా!) నీవు వన్నెలుగ (అందముగా) వీధివీధిలోనూ కిన్నెర (వీణ) వాయించగా అది, మిన్నుదాకి (ఆకాశంలో మారుమ్రోగి) జగదేకసుందరియైన 'లకిమమ్మ' (లక్ష్మీదేవి) నిన్నుచేరి సరుగున (నీ పక్కన) నిలుసుండే సొక్కెను (నిలబడి యుండగానే పరవశంతో నిద్రించినది).

సంపుటి: 5 కీర్తన : ప్రలపనవచనై: ఫలమిహకిం

సంఖ్య : 39 పుట : 27 రాగం: శుద్ధ వసంతం-రచ్చెతాళం

## శుద్ధవసంతం-రచ్చెతాళం

89 ప్రలపనవచనై : ఫలమిహకిం

చల చల కుడ్యక్షాళనయా కిం ॥పల్లవి॥

ఇతర వధూ మోహితం త్వాం ప్రతి
హితవచనై రీహితు మిహ కిం
సతతం తవానుసరణమిదం మమ
గతజల సేతూకరణ మిదానీం ॥ప్రలప॥

వికలవినయ దుర్విటం త్వాం ప్రతి
సుకుమారార్ద్రస్తుత్యా కిం
ప్రకటబహల కోపనం మమ తే
సకల చర్విత చర్వణమేవ ॥ప్రలప॥

శిరసా నతసుస్థిరం త్వాం ప్రతి
విరసాలాపన విధినా కిం
తిరువేంకటగిరి దేవ త్వదీయ-
విరహవిలపనం వృథాచరణం ॥ప్రలప॥

**అవతారిక:**

అద్భుతమైన సంస్కృత కీర్తననావిష్కరిస్తున్నారు అన్నమాచార్యులవారు. కృష్ణుని మాయమాటలు నమ్మి మోసపోయాననుకొని చింతిస్తున్న నాయిక నిర్వేదంతో అంటున్న పలుకులివి. ఎందుకు ప్రేలాపనలవంటి మాటలు





మాట్లాడతావు. దానివల్ల యేమిలాభం? పోపోవయ్యా! అని ఆవిడ విసుక్కొంటున్నది. నీకు నమస్కరించినందువల్ల ప్రయోజనమేమిటి అనేంత నిస్పృహకు లోనైంది ఆమె.

**భావ వివరణ:**

ప్రేలాపనలవంటి మాటల వలన ప్రయోజనమేమిటి? పోపోవయ్యా! పో గోడను నీళ్ళతో కడిగినందువలన ప్రయోజనమేమిటి?

ఇతర వధూటీమణులయందు వ్యామోహము గలిగిన నీకు హితవు బోధించాలని చూడటం ఎంత అవివేకమైన పని? నిన్నే నమ్ముకొన్న నన్ను కల్లబొల్లి కబుర్లతో ప్రసన్నురాలను చేయాలని చూచెదవు, యెందుకు? గతజలసేతుబంధనము వలన కలిగే ప్రయోజనమేమిటి?

నీవు కపటివి. కపట వినయములు. నీవు దుర్మతివైన విటుడవు. నీకు సున్నితమైన స్తుతులవలన ప్రయోజనమేమిటి? నాయందు గొప్ప క్రోధమును ప్రకటిస్తున్నావు. ఇదంతా చర్విత చరణమే.

నీయందు స్థిరమైనట్టి నా నమస్కారములు, విరసాలాపనలు అవుతుంటే... యేమి ప్రయోజనము కలుగుతుంది? ఓ తిరువేంకటగిరి దేవా! నీయందు విరహవేదన నిష్ప్రయోజనమవుతున్నది ప్రభూ!

సంపుటి: 4 కీర్తన : తలలేదు తోకలేదు దైవమానీ మాయలకు
సంఖ్య : 368 పుట : 247 రాగం: కన్నడగౌళ

## కన్నడగౌళ

90 తల లేదు తోఁక లేదు దైవమా నీమాయలకు
తెలిసియుఁ దెలియక తిరిగేము నేము ॥పల్లవి॥

తను వేఁటిదో యీ తలపోఁత లేఁటివో
యెనయు సంసార సుఖ మిది యేఁటిదో
వెనక ముం దేఁటిదో వివేక మెరఁగక
దినదినమును నేమో తిరిగేము నేము ॥తల॥

పుట్టు గిది యెక్కడో పోయేటి దెక్కడో
ఇట్టె యీ సిరులెల్లా నెక్కడెక్కడో
మట్టులేని హరినిర్మాణ చక్రములోన
దిట్టలమై యేమేమో తిరిగేము నేము ॥తల॥

నేరు పేదో నేర మేదో నిలిచిన దొకటేదో
వూరకే నీదాసులమై వున్నారము
చేరి నన్నేలినయిట్టె శ్రీవేంకటేశ్వర
గారవించి కరుణించి కావఁగదవే ॥తల॥368

**అవతారిక:**

చక్కటి వైరాగ్య దీపికవంటి కీర్తననావిష్కరిస్తున్న అన్నమాచార్యులవారిని ఆలకించండి. "ఓ దైవమా! నీమాయలకు తలతోక వుండవయ్యా! మేము మాత్రం తెలియనివాటిని తెలుసునని, తెలిసినవాటిని తెలియవని తలపోస్తూ తిరుగుతుంటాము. మాకు దేంట్లోనూ నేర్పులేదు. మాకు తెలిసిందల్లా నీ దాసులుగా వుండటం. మమ్మల్ని యెలాగో వొకలాగ ఒడ్డునపడవెయ్యవయ్యా! కరుణించు" అంటున్నారు.



అంతయు నీవే హరిపుండరీకాక్ష

**భావ వివరణ:**

ఓ దేవదేవా! నీ మాయలకు (లీలలకు) తలలేదు తోకలేదు (ఆరంభం యెప్పుడు జరుగుతుందో తెలియదు. ఎప్పుడు పూర్తి అవుతుందో తెలియదు). నీమాయ ఆవరించినంతసేపూ, పిచ్చిపట్టినట్లు తెలిసీ తెలియక యేవేవో భ్రమలలో పడి, తిరుగాడుతూనే వుంటాము.

మా అంత పిచ్చివాళ్ళున్నారా ప్రభూ! మా ఈ శరీరం యెట్లా వచ్చిందో మాకు తెలియదు. దీనికి ఆలోచనలెలావస్తున్నాయో తెలియదు. సంసార సుఖము యెట్లా వుంటుందో తెలియదు. వెనక ముందేటిదో వివేకమెరుగము (పూర్వజన్మలో నేనెవరినో తెలియదు. మళ్ళీ నేను చచ్చాక యేమవుతానో తెలియదు). బ్రతికున్నంతకాలమూ ప్రతిరోజూ యేమో తిరుగుతూనే వుంటాము. ఏమిటి నీమాయ?

తల్లి కడుపులో యెప్పుడు యెలా పడ్డామో తెలియదు. ఏ క్షణాన గుటుక్కుమని కన్ను మూస్తామో తెలియదు. నాకు ధనమెలా వచ్చిందో, యెన్నాళ్ళుంటుందో, వున్నట్లుండి యెప్పుడు పోతాయో తెలియదు. శ్రీహరియొక్క ఈ "నిర్మాణ చక్రములో" మట్టు లేకుండా (పొందిక లేకుండా) తిరుగుతూనే వున్నాము. విచిత్రమేమంటే అట్లా తిరుగుతున్నా మేమే దిట్టలము (సమర్థులము) అని అనుకొంటుంటాము.

నీ కృపతో చివరికి ఒకనాటికి నాకు జ్ఞానోదయమయింది. నేర్వవలసిన దేమిటో తెలిసింది. ఇక నాకు నేర్పుతోను పనిలేదు. నిలిచినది వొక్కటేననే నేర్పు యేదో అది నా స్వంతమయింది. ఇక వూరకనే నీ దాసులమై వున్నారము. ఓ శ్రీవేంకటేశ్వరా! నీవే నన్ను వెదకి చేరుకుని నన్ను యేలినావు. ఇక నన్ను విడువకు. గారవించి కరుణించి కావగదవే (మన్నించి కరుణతో రక్షించుము తండ్రీ!) నాకు నీవే దిక్కు.

సంపుటి: 4 కీర్తన : నమో నమో దశరథనందన మమ్ముర‌క్షించు
సంఖ్య : 301 పుట : 202 రాగం: మాళవశ్రీ

**మాళవశ్రీ**

91 నమో నమో దశరథనందన మమ్ము రక్షించు
కమనీయ శరణాగతవ‌జ్రపంజరా ॥పల్లవి॥

కోదండదీక్షాగురుఁడ రామచంద్ర
ఆదిత్యకుల దివ్యాస్త్రవేది
సోదించుమారీచునితలగుండుగండ
ఆదినారాయణ యసురభంజనా ॥నమో॥

ఖరదూషణశిర:ఖండనప్రతాప
శరధిబంధన విభీషణవరదా
అరయ విశ్వామిత్రయాగసంరక్షణ
ధరలోన రావణదర్పాపహరణ ॥నమో॥

పొలుపొంద నయోధ్యపురవరాధీశ్వర
గెలుపుమీరిన జానకీరమణ
అలఘుసుగ్రీవాంగదాదికపిసేవిత
సలలిత శ్రీవేంకటశైలనివాసా ॥నమో॥301

**అవతారిక:**

దశరథనందనుడైన శ్రీరామచంద్రమూర్తిని స్తుతించుచున్న అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో కూడా రామాయణ ఘట్టములను వర్ణిస్తూ రాముని నామాలను సన్నుతిస్తున్నారు. అన్నమాచార్య కీర్తనా యజ్ఞంలో ఈ దీక్షితులు సమర్పిస్తున్న ఈ కీర్తన సంఖ్య 1000. సహస్రాక్షుడు, సహస్రబాహువు, సహస్రముఖుడు, సహస్రరూపుడు అయిన ఆ “సాసముఖుని” సహస్రకీర్తనల వివరణతో అర్చించగలుగుతున్నాను. ఈ





జన్మకిది చాలు. అన్నమయ్య అన్నట్లు “ఇదిగాక సౌభాగ్యమిదిగాక తపము మతి, యిదిగాక వైభవంబికవొకటి కలదే”!

**భావ వివరణ:**

దశరథనందునడవైన ఓ శ్రీరామచంద్రా! నమో నమో! నీకు వేలకొలది వందనములు. మమ్ము రక్షింపుము తండ్రీ! నీవెవ్వరివి ప్రభూ “కమనీయ శరణాగత వజ్రపంజరుడవు” (నీ శరణార్థులకు మనోజ్ఞమైన వజ్రపు కవచము వంటి రక్షకుడవు).

ఓ రామంచంద్రా! నీవు నీదాసుల రక్షణకై యెప్పుడూ కోదండమును ధరించియే వుంటాను, అనే దీక్ష నిర్వహించిన దీక్షితుడవు. ఆదిత్యకులములో (సూర్య వంశములో) జన్మించిన సకల శస్త్రాస్త్రపారంగతుడవు. మాయలేడివలె వచ్చిన మారీచుని సోదించు (వెదుకునట్టి) తలగుండు గండవు (శిక్షగా తలపై పెట్టుకొని తిరిగే పెద్దబండ వంటి మొనగాడివి). అంటే మారీచునివంటి కపటుల పాలిటి యముడివి అని భావము.

ఖరదూషణుల తలలను ఖండించి పదివేల మంది రాక్షసులను క్షణంలో మట్టుబెట్టావు. శరధిని బంధించి (వారధి నిర్మించి) విభీషణునికి వరదుడవైన ప్రతాపశాలివి. విశ్వామిత్రుని యాగమును సంరక్షించిన జగజ్జెట్టివి. పుడమియందు జన్మించి, రావణాసురని చంపగలిగి కూడా “నేడుపోయి విశ్రాంతి తీసికొని తిరిగి రేపటికి తేరుకొని రా!” అని వదలివైచి వాడి గర్వాన్ని సమూలంగా హరించిన వీరాధివీరుడవు.

కీర్తితో అయోధ్యాపురాధీశ్వరుడవై యేలిన చక్రవర్తివి. గెలుపుమీరిన (కీర్తికాంత, భూకాంత, శ్రీకాంతలను కూడా గెలిచిన) జానకీరమణుడవు. కపిసేనలో అలఘులైన (ఉద్దండులైన) సుగ్రీవుడు అంగదుడు మొదలైన వారందరిచే సేవించబడినవాడవు. ఇంతే కాదు స్వామీ! నీవు సలలితము (దివ్యసౌందర్యోపేతమైన) శ్రీవేంకటశిఖర నివాసివైన మా దైవము శ్రీవేంకటేశ్వరుడవూ నీవే.

సంపుటి: 4 కీర్తన : ఇవియే పో ప్రద్యుమ్నా యిహపరసాధనము
సంఖ్య : 405 పుట : 272 రాగం: భూపాళం

**భూపాళం**

92 ఇవియే పో ప్రద్యుమ్న యిహపరసాధనము
భవజలధులతేప పరమయోగులకు ॥పల్లవి॥

వామన గోవింద విష్ణు వాసుదేవ హరి కృష్ణ
దామోదరాచ్యుత మాధవ శ్రీధరా
నీమహిమ గానలేము నిన్నెంచఁగలేము నీ -
నామజపమే చాలు నాలుక (కు) సులభము ॥ఇవి॥

అనిరుద్ధ పురుషోత్తమాధోక్షజ ఉపేంద్ర
జనార్దన కేశవ సంకర్షణా
నినుఁ దలఁచఁగ లేము నిన్నుఁ దెలియఁగ లేము
నునుపై నీనామమే నోటికి సులభము ॥ఇవి॥

నారాయణ పద్మనాభ హృషీకేశ
నారసింహ మధుసూదన త్రివిక్రమ
నీరూపు భావించలేము నిక్కపు శ్రీవేంకటేశ
ఆరయ నీనామజప మన్నిటా సులభము ॥ఇవి॥405

**అవతారిక:**

ప్రద్యుమ్నుడు అంటే 'ప్రకృష్ట'మైన 'ద్యుమ్నము' కలవాడు. అనగా అతిశయించిన బలముకలవాడని అర్థం. మన్మథుని కున్న పర్యాయపదం అది. శ్రీమన్నారాయణుని కేశవనామాలలో కూడా ప్రత్యుమ్నునిపేరు చూస్తాము. శ్రీహరి కూడా అతిక్రమించ సాధ్యంకాని బలము కలవాడు కావున ఆయననూ ప్రద్యుమ్నుడు అంటారు. "ఓ ప్రద్యుమ్నా! పరమ యోగులకైనా భవసాగరమును దాటించే తెప్ప ఇవియే. ఇహమున సుఖము పరమున మోక్షము ఇవ్వవలెనంటే ఇవియేపో సాధనములు" -





అంటున్నారు అన్నమాచార్యులవారు. భజన సాంప్రదాయంలో సాగే ఈ కీర్తన పాడితే కేశవనామాలు చదివినట్లే. మీదే ఆలస్యం...

**భావ వివరణ:**

ఓ ప్రద్యుమ్నా! (అతిశయించిన బలము కలవాడా) ఇహపరసాధనములు (బ్రతికుండగా ఈలోకములో సుఖము చనిపోయాక పైలోకములలో మోక్షము సాధించు మార్గము) ఇవియేపో (ఇవియే సుమా!) పరమయోగులైన వారికి, భవజలధి తేప (సంసార సాగరమును దాటించగల నావ ఇదియే కదా!)

ఓ వామనమూర్తి! గోవిందుడా! విష్ణుదేవా! వాసుదేవా! శ్రీహరీ! శ్రీకృష్ణా! దామోదరా! (ఉదరమునకు తల్లి యశోదచే దామముతో కట్టబడినవాడా!) అచ్యుతా! మాధవా! శ్రీధరా! (లక్ష్మీవల్లభా!) నీమహిమను గానలేము (తెలుసుకొనలేము). నిన్ను ఇటువంటివాడని అంచనావేయలేము. మరి ఇక యేమి చేయగలం? నాలుకకు అతి సులభమైన పని నీ నామమును జపించుట. అది చాలునాకు.

ఓ అనిరుద్ధా! (పరులచేత అడ్డగింపలేనివాడు) పురుషోత్తమా! అధోక్షజా! (ఇంద్రియములను జయించిన వారికి మాత్రమే కనబడువాడు) ఉపేంద్రా! జనార్ధనా! కేశవా! సంకర్షణా! (ప్రళయకాలమందు అందరినీ అంతముజేయువాడు) నిన్ను దలచలేము (నీగురించి ఆలోచించలేము). ఇక నిన్ను యెట్లు తెలియగలము? నునుపైన (పట్టుకోవటానికి తేలికైన) నీ నామము నోటితో సులభముగా పలికెదను ప్రభూ!

ఓ నారాయణుడా! పద్మనాభుడా!, హృషీకేశా! (ఇంద్రియములకు అధిపతి) నారసింహా! మధుసూదనా! త్రివిక్రమా! నీరూపము విశ్వరూపమైనందువలన యెట్లుండునో వూహింపజాలము. కానీ నేడు మాకన్నులయెదుట నిజముగా కనుపించుచున్న నిక్కపు వేంకటేశ్వరుడవు నీవే తండ్రీ! దర్శించి జపించుటకు అతి సులభమైన నీనామజపమును అన్నిటా స్వీకరింతును. ఎందుకంటే సులభమైన తరుణోపాయము ఓం నమో వేంకటేశాయ! అనడమే సుమా!

సంపుటి: 4 కీర్తన : పరమవివేకులాల బంధువులాల
సంఖ్య : 475 పుట : 320 రాగం: ధన్నాసి

## ధన్నాసి

93 పరమవివేకులాల బంధువులాల
తెరదీసి మాకు నిది తెలుపరో ॥పల్లవి॥

యేడుజా నలమేనిలో నిందిరానాథుఁ డున్నాఁడు
వేడుకతో నతనిని వెదకరో
పూడిచి వున్నది మతిఁ బొందుగ వైకుంతము
చూడరో ధ్యానముసేసి సోదించరో ॥పరమ॥

కొడిదెఁడుబయలిలో గోవిందునినెలవఁట
చిడిముడితో నిట్టే చేరి పట్టరో
అడఁచి దాఁచివున్నది అందే బ్రహ్మానందము
విడువరో యీ ముడియ వెలయఁ జేపట్టరో ॥పరమ॥

వూని నల్లెఁడు నాలికలో నుండు శ్రీవేంకటేశుఁ-
డానుకొని బత్తితోడ నటు నిల్పరో
నానఁబెట్టివున్నది నామకీర్తనములందు
తానకముగా నేపొద్దుఁ దలఁచుకోరో ॥పరమ॥475

**అవతారిక:**

అన్నమాచార్యులవారు చెప్పిన ఈ కీర్తనలో సాటివారిని తమ మనస్సులలోని అజ్ఞానపు తెరలను తొలగించి శ్రీహరిని దర్శించమని వేడుకొంటున్నారు. ఇది కూడా తేలికగా కనుపించే క్లిష్టమైన కీర్తన. భావ వివరణ చదివినవారికి ఈ సంగతి వెంటనే అర్థమవుతుంది. గోవిందునికి మీమనస్సులో నెలవుగా వుంచితే బ్రహ్మానందము దానంతట అదే సిద్ధిస్తుంది. శ్రీవేంకటేశ్వరుని నామసంకీర్తనము నాలికపై నుంటే, యే





పొద్దునైనా ఆయననే తలుస్తుంటే... తప్పక ఒకనాటికి ఆ స్వామి దయకలుగుతుంది.

**భావ వివరణ:**

పరమవివేకులాల (విశిష్ఠమైన వివేకము గల జ్ఞానులారా!) బంధువులారా! మాకు తెరదీసి (వివేకము చూపి) ఇది (ఈసంగతిని) తెలియజేయండయ్యా!

ఏడు'జానలు' పొడుగున్న ఈ శరీరంలో ఇందిరానాథుడైన శ్రీహరివున్నాడు. కాని ప్రయత్నించి వెదకకపోతే మాత్రం కనబడదు. వైకుంతము అనేది వేరేయెక్కడో లేదు. మనస్సులో శ్రీహరి వున్నట్లే, వైకుంతము కూడా మన మెదడులోనే పూడ్చివున్నది, (దాగివున్నది). అది వూరకనే కనబడదు. ధ్యానముచేసి, పరిశోధించి వెతికి చూస్తేకాని కనుపించదు. అయ్యలారా! అట్లే సోధించరో!

గోవిందుని నెలవు (వుండేచోటు) నిజంగా యెక్కడవున్నది? కొడిదెడు బయలులోనట (పుడిసిలిలో ఇమిడిన ఆకాశములో వున్నాడట). చిడిముడితో (తొట్రుబాటుతో కూడిన జాగ్రత్తతో) ఆయనను ఇట్టే పట్టరో (మీ వశము చేసికొనండి). అందే (ఆయనను వశపరచుకొనుటలోనే) బ్రహ్మానందము, అణచిదాచివున్నది (అణిగి దాగివున్నది). ఈ ముడియ (మాట)లో దాగి వున్న బ్రహ్మానందము విడువరో (బయటపెట్టండి). వెలయజేపట్టరో (బయటపడంగానే) మీలో భద్రపరచుకొనండి.

శ్రీవేంకటేశ్వరుడు యెక్కడవున్నాడు? పూనినల్లెడు నాలుకలోవున్నాడు (వహించి అటూఇటూ కదలే నాలుకలోనే, ఆయన వున్నాడు). ఆనుకొని (దరిజేరి) ఆయనను బత్తితో (భక్తితో) మనస్సులో నిల్పరో. శ్రీహరి నామసంకీర్తనములో మీ మనస్సును నానబెట్టి (నిమగ్నముచేసి) యే వేళనైనా తానకము (స్థానము)గా ధ్యానించుడు.

సంపుటి: 4 కీర్తన : చెల్లె నీచేతలు నీకే చేరి మేడెగుడిదిన్న
సంఖ్య : 412 పుట : 277 రాగం: సామంతం

## సామంతం

94 చెల్లె నీచేఁతలు నీకే చేరి మేడెగుడిదిన్న
నల్లదె కంటిమి నిన్ను హనుమంతరాయ ॥పల్లవి॥

జంగ చాఁచినట్టి నీసంగడి పాదములు
చెంగలించి యెత్తిన నీ శ్రీహస్తము
ముంగలిఁ బిడికిలించి మొలఁజేర్చినచేయి
అంగమాయ నీసొబగు హనుమంతరాయ ॥చెల్లె॥

పెరిగినవాలము పెద్దైన పిరుఁదును
అరిగి జలధి దాఁటే యాయితమును
సిరుల బంగారు కాసె చెలఁగిన సింగారము
అరుదాయ నీవునికి హనుమంతరాయ ॥చెల్లె॥

స్వామికార్యపుఁజింత జానికి సేమపువార్త
దీమసాన మగుడి యేతెంచిన చేఁత
రామనామజపముతో రతి శ్రీ వేంకటపతి-
కా మేటిబంటవైతివి హనుమంతరాయ ॥చెల్లె॥413

**అవతారిక:**

"మేడెగుడిదిన్న" అనే గ్రామములో వెలసిన హనుమంతుని సేవిస్తూ అన్నమాచార్యులవారు చెప్పిన అద్భుతమైన కీర్తననాస్వాదిద్దాము. నీ చేతలు నీకే చెల్లినవి స్వామీ! అని కీర్తిస్తున్నారు. ఇటువంటి కీర్తనలు కోకొల్లలున్నాయి! జానకి క్షేమసమాచారము రాముని కెరిగించిన ధీశాలియైన బంటు అని, శ్రీవేంకటేశ్వరునికి కూడా ఈయన మేటి బంటేనట. ఆయన వునికే అరుదాయెనట.





**భావ వివరణ:**

అల్లదె (అదిగో) 'మేడెగుడిదిన్న'లో చేరి వెలసిన హనుమంతరాయా! నిన్ను కంటిమి (నీ వైభవమును చూచితిమి). నీచేతలు నీకె చెల్లె (నీసాహసములు ఇతరులకు అసాధ్యము. అవినీకే చెల్లినవి ప్రభూ!)

జంగచాచినట్టి నీ సంగడిపాదములు (బారగా పంగజాచినటువంటి నీ పాదముల జంట) కనువిందు చేయుచున్నవి. చెంగలించి (అతిశయముగా) యెత్తిన నీ శ్రీహస్తము (మంగళకరమైన చేయి) ముంగలి బిడికిలించితివి (మీదికెత్తి పిడికిలి బిగించియుంటివి). ఇంకొక చేయి నీ మొలజేర్చితివి (నడుముపై వుంచుకొంటివి). ఓ హనుమంతరాయా! ఈ విధముగా నీసొబగు (శోభ) అంగమాయస్వామీ! (చాలవైభవయుతముగా నున్నది).

పొడవుగాపెంచిన నీ వాలము (తోక) నీ పెద్దవైన పిరుదులమధ్య వ్రేలాడుచున్నది. తిరిగి (వెళ్ళి) నూరుయోజనముల జలధిని (సముద్రమును దాటే నీయాయితము (నిడపు... అంటే... దూకగల సామర్థ్యము...)ను యేమని పొగడగలము! బంగారు రంగు కాసే (వస్త్రము) వైభవోపేతముగానున్నది. ఆభరణములతో నీ సింగారము చెలగినది (కన్నుల పండువగా వున్నది). ఓ హనుమంతరాయా! నీ వునికి (వున్నవిధానము) అరుదాయ (బహు అరుదుగా చూడగలుగుతాము) స్వామీ!

జానకి క్షేమసమాచారము యెంత త్వరగా శ్రీరామచంద్రునికి అందించగలనా, అన్నదే నీ ఆశయము. అదే నీ చింత (ఆలోచన). దీమసాన మగుడియేతెంచిన చేత (లంకలో రాక్షసులను చితకబాది, లంకా దహనము చేసి, రావణునికే హితబోధ చేసి సీతాదేవి చూడామణితో తిరిగివచ్చిన... నీ సాహసము...) అసాధ్యము. రామనామ జపముతో, రతికెక్కితివి (ప్రసిద్ధుడవైతివి). ఓ హనుమంతరాయా! నేడు శ్రీవేంకటపతియైన నీ రామునికే మేటి బంటువైతివి స్వామీ!

సంపుటి: 4 కీర్తన : సమమతినని నీవే చాటుదువు
సంఖ్య : 366 పుట : 246 రాగం: వరాళి

**వరాళి**

95 సమమతినని నీవే చాటుదువు
రమణ నేరుపునేరము నెవ్వరివి ॥పల్లవి॥

రావణాదులైన రాక్షససమితిలో
నీవే, దేవతలలో నీవేకావా
భావింప నసురలు పగ నీకు నేలైరి
యీవల సురులెల్ల (లేల?) హితులైరి ॥సమ॥

సకలజంతువులకుఁ జైతన్యుఁడవు నీవే
వొకరు నీకుపకారమొనరించేరా
అకట కొందరిఁ బాపాత్ములఁగాఁ జేసి
వెకలిఁ గొందరిఁ బుణ్యవిధులఁ జేసితివి ॥సమ॥

అటుగాన ఇట్టాయ నట్టాయననేల
యిటు నీచిత్తముకొలఁ దింతేకాక
గటియించి శ్రీవేంకటపతి నీదాసు-
లిటువలె ఘనులై రిదివో నీకృపను ॥సమ॥366

**అవతారిక:**

ఆ దేవదేవుడే మనందరి తండ్రి. రాక్షసులైన, దేవతలైన, మనబోటి నరులైనా, జంతుజాలములైనా, క్రిమికీటకములైన ఆయనబిడ్డలే. కాని వీరందరి బ్రతుకు ఒక్కలాగున లేవు. కొందరు సుఖిస్తుంటే కొందరు దు:ఖిస్తున్నారు. ఆయన కొందరికి మేలు చేస్తున్నట్లు కొందరిని శిక్షిస్తున్నట్లు అనిపిస్తుంది. ఆయనకు 'సమమతి' (సమానంగా చూచే బుద్ధి) లేదేమో అనిపిస్తుంది. అన్నమాచార్యులవారు ఈ కీర్తనలో 'నీవే సమమతినని చాటుకొంటావు. రమణ నేరుపులెవ్వరివి, నేరములెవ్వరివి? నీకు దేవతలు





చేసిన మంచేమిటి, రాక్షసులు చేసిన చెడేమిటి? వాళ్ళనెందుకు రక్షించావు, వీళ్ళనెందుకు శిక్షించావు? అంతా నీ చిత్తము మా ప్రాప్తము అంటున్నారు.

**భావ వివరణ:**

ప్రభూ! నీవే సమమతివని (పక్షపాతములేక అందరినీ సమానముగా చూచే బుద్ధికలవాడినని) చాటుకొంటావు. అట్లయినచో, రమణ నేరుపులెవరివి (ఆ చక్కని నేర్పుగల పనులు యెవరికి దక్కుతున్నవి) మరియు నేరములెవ్వారివి (చెడ్డపనులు యెవరికి దక్కుతున్నవి?)

రావణుడు మొదలైన రాక్షసులలో ఆత్మరూపుడవై వున్నదెవరు? నీవేకదా! దేవతలలో వున్నదీ నీవే కాదా? మరి భావించుటకు నీకు, అసురులు పగవారెందుకయ్యారు? మరి ఇటు చూస్తే సురులు నీకు యెట్లు హితులు అయ్యారు, ఇంతా చేసి ఇద్దరూ నీ సంతానమే కదా! ఎందుకు దేవతల్ని రక్షిస్తున్నావు, రాక్షసులనెందుకు భక్షిస్తున్నావు?

జంతువులన్నింటిలోనూ వున్న చైతన్య పదర్థాం ఒక్కటే. దాన్నే ప్రాణము అంటారు కొందరు. అది నీవే కదా! అటువంటప్పుడు ఒకరు నీకు ఉపకారమొనరించిరా అకట (అయ్యో!) కొందరిని పాపాత్ములను చేసినావే? వెకలి (ఆసక్తితో) కొందరిని పుణ్యవిధులు చేసే వారిగ నొనరించితివే? ఎందుకీ బేధ భావము నీకు కలుగుతున్నది? ఒకరిమంచేమిటి, ఇంకొకరి చెడేమిటి?

దీనికి కొందరు విధి అని పేరుపెట్టి, కర్మ అనే ఒక సిద్ధాంతం తీసికొనివచ్చి, అందుకని ఇట్లా అయింది. ఇందుకని అట్లా అయింది అని యేవేవో కారణాలు చెబుతారు. అసలేమిటంటే అంతా నీ చిత్తము మా ప్రాప్తము అంతేకాక ఇంకేమిటి? అవునా? ఓ శ్రీవేంకటేశ్వరా! ఏది ఏమైనా నీ దాసులు మాత్రం నీ కృపవల్ల ఘనులయ్యారు తండ్రీ! నీవు గటియించినచో (తలచుకొంటే) మేము తప్పక ఘనులమవుతాము.

సంపుటి: 4 కీర్తన : నారాయణుని శ్రీనామమిది
సంఖ్య : 73 పుట : 410 రాగం: కేదారగౌళ

**కేదారగౌళ**

96 నారాయణుని శ్రీ నామమిది
కోరినవిచ్చీఁ గోవో మనసా ॥పల్లవి॥

శుకవరదుని సొంపుగఁ దలఁచుటె
సకలభవ విజయము
అకలంకము మహాభయహరణ -
మొకటి నొకటి వోహొ మనసా ॥నారా॥

పక్షిగమన శుభము (పదము?) దలఁచుటే
అభయభోగ విహారమ్ము
వక్షపు లక్ష్మీవరుసే (చే?) సిరులు
లక్షలు గోట్లొల్లవొ మనసా ॥నారా॥

ఇంకా నీతలఁపులెన్ని గలిగిన
వేంకటాధిపు సేవించఁగదో
అంకెలకిన్నియునైన యీ (?)
మంకపు గాక నమ్మవో మనసా ॥నారా॥73

**అవతారిక:**

తనమనసును హెచ్చరిస్తున్న అన్నమాచార్యులవారిని ఆలకించండి. నారాయణుని శుభప్రదమైన నామము పలికితే చాలును. కోరినవిచ్చీగోవో అంటే కోరుకున్నవన్నీ ఇస్తాడు, స్వీకరించు అని అర్థం. కొన్ని మాటలకి నిఘంటువులలో కూడా సులభగ్రాహ్యమైన అర్థం దొరకదు. అది అట్లా అయ్యుంటుందని భావించాలి. "అంకెలకిన్నియునైన యీమంకపుగాక నమ్మవో మనసా" అంటున్నారు. అంటే యేమిటి? నీవశమయ్యేట్లుగా అన్నీ నీకు శ్రీహరే ఇస్తాడు. నీ మంకుతనము మాని ఆయనను నమ్మవే అని అర్థం. ఆయన హృదయవాసినియైన లక్ష్మీదేవి ఆయన ఇమ్మంటే లక్షలు, కోట్లు





ఇస్తుంది. కానీ ఒల్లవో మనసా! నీవు అసలొప్పుకోవద్దు అంటున్నారు. ఒప్పుకుంటే డబ్బుపిచ్చివాళ్ళవుతారు, మరి.

**భావ వివరణ:**

ఓ మనసా! శ్రీమన్నారాయణుని శ్రీనామము (మంగళప్రదమైన నామం ఇదే). హరీ! అను. ఇది నీవు కోరిన విచ్చీ (కోరికలు తీరుస్తుంది) కోవో (తీసికో...) కానీ ఆ నామాన్ని మాత్రం వదిలిపెట్టకు.

శుకమహర్షిని భాగవత బోధకునిగా చేసి అనుగ్రహించి తరింపజేసినది శ్రీహరినామమే. ఆయనను సొంపుగా ధ్యానిస్తే సకల భవబంధాలు తొలగిపోతాయి. వాటిపై విజయము సాధించగలవు. ఆ శ్రీహరినామము అకలంకము (ఏ దోషమూ లేనిది). గొప్ప భయమును నివారించునది. ఓహొ! మనసా! అది ఒకటినొకటి (ఒకే యొక్కటి... అట్టిది ఇంకొకటి లేదు అని అర్థం.)

ఆ శ్రీహరి అలవాట్లు యేమిటో ఒకసారి గమనించండి. ఆయన పక్షిగమనుడు. అత్యంత వేగంగా వెళ్ళే గరుత్మంతునిపై వెళ్ళేవాడు ఆయనే. క్షణాల మీద (తలచినదే తడవుగా) వచ్చి రక్షిస్తాడు. అభయప్రదాతయైన శేషునిపై పవళిస్తాడు విహరిస్తాడు. ఆయన వక్షస్థలంపై సిరులరాణి శ్రీమహాలక్ష్మివుంటుంది. ఆయన సైగచేస్తే లక్షలు కోట్లు ఇస్తుందావిడ. కానీ ఓ వెఱ్ఱి మనసా! వాటిని ఒల్లకే (ఆ లక్షలు కోట్లను అంగీకరించకే... చెడిపోతావు).

అవన్నీ అటుంచి ఈ మాట వినుము. నీకు ఈ ప్రాపంచిక తలపులు (కోర్కెలు) యెన్ని కలిగినా శ్రీవేంకటేశ్వరుని మాత్రము వదలిపెట్టకు. ఆయననే సేవించగదో! అంకెలకిన్నియునైన యీ (నీ వశమయ్యేట్లుగా ఆయన నీకెన్నియైనా ఈయగలడు). ఓ మనసా! మంకెపుగాక (మంకుతనమునకు పోక... అంటే... మొండిగా చెడిపోక) నమ్మవో (ఆయననే శరణు అని నమ్ముకో). తప్పక నీకు మేలు జరుగుతుంది.

సంపుటి: 4 కీర్తన : స్వతంత్రుఁడవు నీవు సరిలేని దొరవు నే-
సంఖ్య : 431 పుట : 290 రాగం: తోడి

**తోడి**

97 స్వతంత్రుఁడవు నీవు సరిలేని దొరవు నే-
నతికమై యాడినట్లు ఆడఁబోయేవా ॥పల్లవి॥

యెంత నీమనసునను యెట్టుండె నట్లనే
అంతయుఁ జేయవయ్య మాకదే చాలు
అంతకంటే నెక్కుడు నేమంటిమివో యటమీఁదఁ
జెంతల మా చెప్పినట్టు సేయఁబోయేవా ॥స్వతం॥

కమ్మి నీవు మునుప సంకల్పించినట్లనే
కిమ్ముల నారీతిఁ జిత్తగించవయ్య
అమ్మరో నేమందుకుఁ గాదనినను నీవు
సమ్మతించి మాతలఁపు సాగనిచ్చేవా ॥స్వతం॥

పొంచీదేహమున మమ్ముఁ బుట్టించినట్లనే
పెంచి నీపై భక్తిమాకుఁ బెనచవయ్య
నించిన శ్రీవేంకటేశ నేనే పదరితిఁగాక
మంచితనములు నీవు మానఁబోయేవా ॥స్వతం॥431

**అవతారిక:**

అన్నమాచార్యులవారి అద్భుత సృష్టి ఈ కీర్తన. స్వామీ! నీవు సర్వస్వతంత్రుడవు. నీకెవరన్నా ఇట్లా చెయ్యి, అట్లాచెయ్యి అని నిర్దేశించగలరా? నీకు సమానమైన యెవ్వరూలేని ప్రభువు నీవే. నేను ఆడమన్నట్లు ఆడతావా యేమిటి? నీ ఇష్టమొచ్చినట్లే చేస్తావు. ఏదో అజ్ఞానిని పైగా వదరుబోతును. నీ మంచితనం నీకే వుంటుంది. కాస్త నన్ను బాగుచేయవయ్యా! నీపై మాకు భక్తి పెంచవయ్యా! ఈ జన్మలో





కాకపోతే వచ్చే జన్మలో తరిస్తాను. నన్ను మాత్రం నీ భక్తి నుండి విడదీయకు. నీనుండి విముఖుని చేయకు. నీకు పుణ్యం వుంటుంది. నాకు నీ భక్తి చాలు అంటున్నారు.

**భావ వివరణ:**

ప్రభూ! నీవు సర్వస్వతంత్రుడవు. నీకు సమానమైన వారెవ్వరూ లేని దొరవు (యేలికవు). నేనూ అతికమై (నిన్ను మించి) ఆడమన్నట్లు ఆడబోయేవా? (ఆడెదవా యేమి?) చివరికి నీ ఇష్టం వచ్చినట్లే నీవు చేస్తావు.

నీ మనసున యెంత యెట్లావుంటే అట్లనే అంతా చేయవయ్యా! నిన్ను కాదనగలవారెవరు? నీవేమి చేస్తే మాకు అదే చాలు. అంతకంటే యెక్కువ యేమాత్రం యేమన్నాము? వో అటుమీద మేము చెప్పినట్లు చేయబోయేవా యేమి? నీకెట్లా తోస్తే అట్లాగే చేయవయ్యా!

మునుప (మేము అమ్మకడుపులోంచి బయటకు రాక మునుపే) నీవు కమ్మి సంకల్పించావు. (పైకొని నిశ్చయించావు). నాదేమున్నది? కిమ్ముల (రహస్యంగా) నారీతి జిత్తగించవయ్యా (అట్లాగే చేయవయ్యా). అమ్మరో! (అమ్మయ్యో!) నేము (మేము) అందుకు కాదనినను నీవు అంగీకరించి మా ఇష్టం సాగనిస్తావా యేమన్నానా? అలాగే కానీవయ్యా!

పొంచీ (కావాలని) ఈ దేహము మాకిచ్చి నీవే మమ్ము పుట్టించావు. సరే! అయినదైదో అయింది. నా విన్నపమొక్కటే, మమ్మల్ని పెంచినట్లే మాకు నీపై భక్తిని కూడా పెంచవయ్యా! మంచితనము నిండిన ఓ శ్రీవేంకటేశ్వరా! నేనే పదరితిని (నేనేయేదో వాగాను). నీవు నీమంచితనం మానుకొంటావా యేమి? ఎట్లాగైనా నీవు మమ్మల్ని కరుణిస్తావు.

సంపుటి: 4 కీర్తన : కలిగె మాకిదె కైవల్యసారము
సంఖ్య : 419 పుట : 281 రాగం: బౌళిరామక్రియ

## బౌళిరామక్రియ

98 కలిగె మాకిదె కైవల్యసారము
ఫలించె నాడెదఁ బాడెద నేను ॥పల్లవి॥

నీపాదతీర్థము నీరజభవుని
పైపై కమండలపానీయము
చేపట్టి శంభుని చిరుజడలలో
దీపించుగంగాతీర్థరాజము ॥కలిగె॥

ఘన నీ నామమె గౌరినాలికపై
పనిగొన్న మంత్రపాఠము
అనుఁగువాణికి నాదిచదువులఁ
బెనఁచే మొదలి బీజాక్షరము ॥కలిగె॥

శ్రీవేంకటేశ్వర చేరి నీదాసుల
సేవ నాపాలిఁటి జీవనము
ఆవిటించి శరణాగతులకును
త్రోవయైన దిదె దోషహరము ॥కలిగె॥419

**అవతారిక:**

తనకు కైవల్యసారం సిద్ధించినదని ఆనందంతో ఉత్తుంగ తరంగమై కీర్తన నాలాపిస్తున్న అన్నమాచార్యులవారిని వినండి. తన ఆశయం ఫలించింది కావున ఆడెదను, పాడెదను అని నృత్యం చేస్తూ ఈ కీర్తన నాలాపిస్తున్నారు. త్రివిక్రముడైన శ్రీమన్నారాయణుని పాదాలను కడుగవలెనని బ్రహ్మదేవుడు తన కమండలంలోని నీళ్ళను పోస్తే అది ఆకాశగంగయై ప్రవహించి భగీరథుని కోసం భూమిమీదకు చేరటానికి శివుని తలపై చేరి అక్కడనుండి భూమిపై దూకి ప్రవహించి యావత్ ప్రజానీకాన్ని పునీతుల్ని చేస్తున్నదట. గౌరీదేవి శ్రీహరి నామమంత్రం





జపిస్తుందట. వాణికి మొదటి బీజాక్షరాలను ఆదేవ దేవుడే ఇచ్చాడట ప్రభూ! అట్టి నీదాసులను సేవించే భాగ్యం కలిగింది. అదే మాకు కైవల్యసారము అంటున్నారు.

**భావ వివరణ:**

ఓ దేవదేవా! ఇదే మాకు కైవల్యము యొక్క సారము కలిగినది. మా కల ఫలించినది. ఇక నేను ఆడెద (నాట్యం చేస్తాను) పాడెద (కీర్తనలాలాపిస్తాను). ఇంతకీ నాకు సిద్ధించినదేమిటో వినవయ్యా!

ఓ ప్రభూ! నీరజభవుని (బ్రహ్మదేవుని) కమండలంలోని పానీయము (త్రాగేనీరు) శ్రీహరి బలిచక్రవర్తిని పాతాళానికి తొక్కేయుటకు త్రివిక్రముడైనాడు. అప్పుడు వున్నపళంగా ఆయన కాళ్ళు కడగాలని బ్రహ్మ తన కమండలంలోని నీళ్ళు పోసినాడట. ఆ శ్రీహరి పాదజలము ఆకాశగంగయై దివిలో ప్రవహించి భగీరథునికోసం భూమి చేరుటకు శంభుని శిరసుపై దూకి అచ్చటనుండి ఒక పాయ భూమిపై దూకి కోట్లాది ప్రజలు గంగా తీర్థమని సేవించు, గంగానదియై తీర్థరాజమైనది.

ఓ దేవా! నీ ఘననామము గౌరీదేవి నాలుకపై పనిగొన్న (పూనుకొనిన) మంత్రపఠనమైనది. ఆమె నిత్యమూ చేసే నీ నామసంకీర్తన మాకూ దిక్కైనది. నీ అనుగు కోడలైన వాణికి (సరస్వతీదేవికి) ఆనాడు సోమకాసురుని జంపి తిరిగి తెచ్చిన ఆది చదువులను (వేదములను) మొదటి బీజాక్షరములుగా నేడు మాకు విద్యనందించి ఆమెను చదువుల రాణిని చేసినది.

ఓ శ్రీవేంకటేశ్వరా! చేరి నేడు నీదాసులను సేవించుటే నా పాలిట జీవనమైనది. ఆవిటించి (వ్యాపించి) నీ శరణాగతులమైన మాబోటి వారికి అది దోష రహితమై కైవల్యమునకు త్రోవ యైనది. తండ్రీ! నాబోటి అల్పుడు కూడా నిన్ను చేరే ఆధారమైనది.

సంపుటి: 4 కీర్తన : హరిహరి యిందరికి నబ్బురముగాని యిది
సంఖ్య : 363 పుట : 244 రాగం: లలిత

**లలిత**

99 హరిహరి యిందరికి నబ్బురముగాని యిది
పరగ నీదాసుఁడే పరతత్వవేది ॥పల్లవి॥

పొలసి మశకమందుఁ బొడమేటి జీవుని
తలఁపు బ్రహ్మాండాలు దాఁటిపోయీనీ
నిలవెంత నీఁటెంత నీమాయ లివి భువి
బలిమిఁ దెలియువాఁడె పరతత్వవేది ॥హరి॥

తగిలి చూచిన నాత్మఁ దనుఁ గానరాదుగాని
జగమెల్ల దానైతే సరి గనీని
చిగురెంత చేగెంత శ్రీపతి యిందులో నీ-
పగటు దెలియువాఁడే పరతత్వవేది ॥హరి॥

యేవంకఁ దనబుద్ధి యెక్కడనుండునోకాని
శ్రీవేంకటేశ నిన్నుఁ జింతించీని
పూవెంత ఫలమెంత పురుషోత్తముఁడ నీ -
భావమెరుఁగువాఁడె పరతత్వవేది ॥హరి॥363

**అవతారిక:**

ఓ శ్రీహరీ! నీదాసుడొక్కడే పరతత్వవేది. (నీయొక్క పరా ప్రకృతిని తెలిసినవాడు). మిగిలినవారందరికీ నీ పరతత్వం అబ్బురముగానే వుంటుంది. ఒక మశకము (దోమ) ఎగురుతున్నదంటే జీవాత్మ రూపంలో నీవు దాంట్లో వుండబట్టే. ఆ ఆత్మ నాలోనూ వున్నది. కానీ కానరాదు. ఈ ఆత్మలన్నీ నీవే అవటంచేత జీవాత్మే పరమాత్మయై అద్వైత సిద్ధాంత ప్రతిపాదన సరైనదే అనిపిస్తున్నది. ఓ పురుషోత్తమా! నీ ఈ భావము



అంతయు నీవే హరిపుండరీకాక్ష

తెలిసినవాడే నిజమైన పరతత్వవేది అంటున్నారు అన్నమాచార్యులవారు.

**భావ వివరణ:**

ఓ శ్రీహరీ! ఇందరికి (ఇంతమందికి) అబ్బురముగానిది (ఆశ్చర్యకరము కానిది) ఇదే. అదేమిటంటే... నీదాసుడే ఈ జగతియందు భగవంతుని పరతత్వము తెలిసినవాడగుచున్నాడు.

మశకమున (దోమయందు) పొలసి పొడమేటి (సంచరించుచు నెలకొన్న) జీవుడితలపులు చూడబోతే బ్రహ్మాండములను దాటిపోతున్నాయి. ఏమిటీ అద్భుతమాయ!! ఇది యెంతవున్నతమైనది! ఎంత నీటైనది (ఎంత మురిపెము కలిగించునది!) ఈ భువిలో దీనిని తెలియగలవాడెవడు? ఒకవేళ ఎవడన్నావుంటే... వాడేనయ్యా! పరతంత్రుడంటే

తగిలి (పూని) వెదకినా ఆత్మ తాను కనబడదు. కాని సరిగా చూడగలిగితే జగమంతా అది నిండివుంటుంది. ఇదెట్లా సాధ్యమని ఆశ్చర్యపడుతున్నారా? అక్కరలేదండీ... చెట్టు చిగురిస్తున్నప్పుడు ఆ చిగురు యెంత అల్పమైనది!!. కాని దాని చేగు (చేవ లేక బలం) యెంత వుంటుంది. (అది మాను అయితే ఇంటి దూలమై కప్పునే మోస్తుంది కదా!) ఇది నీ దివ్యశక్తి. ఓ శ్రీపతీ! ఇందులో నీ పగలు (ప్రకాశము) తెలియగలమొనగాడెవడు? ఎవడన్నావుంటే వాడేనయ్యా! పరతంత్రుడంటే.

నరుడు తన బుద్ధి యేవంకనున్నా యెక్కడున్నా, ఓ శ్రీవేంకటేశా! నిన్ను జింతించీని (ధానించునా?) నీకృప కలిగితే అట్లా చేయగలడు. వాడెలావుంటాడో యెవరికి తెలుసు? పూవు ఎంత సున్నితము, కోమలముగా వుంటుంది. పండుయెంత పెద్దగా రాయిలా వుంటుంది. రుచిగా కూడా వుంటుందే!! ఓ పురుషోత్తమా! నీ ఈ భావము (లీల) యెరుగగలిగినవాడేనయ్యా! పరతంత్రుడంటే.

సంపుటి: 4 కీర్తన : హరిహరి నీ మాయామహిమ

సంఖ్య : 293 పుట : 196 రాగం: నారాయణి

## నారాయణి

100 హరి హరి నీ మాయామహిమ
సరవి దెలియ నను( గరుణించ(గదే ॥పల్లవి॥

తలంతును నా పాలిదైవమవని నిను
తలంతును తల్లివి( దండ్రివని
మలసి యంతలో మఱతును తెలుతును
కలవలె నున్నది కడ గనరాదు ॥హరి॥

మొక్కుదు నొకపరి మొగి నేలికవని
మొక్కుదు నీ వాదిమూలమని
వుక్కున గర్వించి యుబ్బుదు సగ్గుదు
కక్క సమైనది కడ గనరాదు ॥హరి॥

చూతును నీమూర్తి సులభు(డవనుచును
చూతు జగములకు సోద్యమని
యీతల శ్రీవేంకటేశ నన్నేలితివి
కౌతుకమొదవెను కడ గనరాదు ॥హరి॥293

**అవతారిక:**

హరిహరీ! నీమాయామహిమ క్రమంగా తెలిసికొనునట్లు నన్ను కరుణించితివి, గదే! నేను ధన్యుడనయ్యాను తండ్రీ! నీవే నాపాలి దైవము, నా తల్లివి, తండ్రివి, గురుడవు. నీవే నా ప్రాణానివి. అందుకని నీవే కౌతుకమున నన్నేలితివి. ఈ జీవితానికి ఇది చాలు స్వామి. నేను కళ్ళు





తెరిచినా కళ్ళుమూసినా నీ మూర్తే కనబడుతున్నది ఇక ఈ బ్రతుకునకింతకంటే కావలసిందేమి వున్నది ప్రభూ!

**భావ వివరణ:**

ఓ శ్రీహరీ! నీమాయామహిమల యొక్క తీరుతెన్నులు యెలావుంటాయో వాటిని సరవి (క్రమముగ) తెలియునట్లు నన్ను అనుగ్రహింపుము ప్రభూ!

దేవా! నేను నిన్నే దేవునిగా తలచెదను. నిన్నే నా తల్లిగాను తండ్రిగాను తలచెదను. మలసి (తిరిగి) అంతలోనే ఆ విషయం మరచిపోతాను. ఏమిటి ప్రభూ! నీమాయ? ఇంతలోనే కలవలె అన్నీ మరచిపోయి యేదో పోగొట్టుకున్నవాడిలా బాధపడి నలిగిపోతాను. ఈ భ్రాంతికి కడగనరాదు (అంతము కనబడదు).

ఒకపరి (ఒకసారి) వూరకనే నీకు మ్రొక్కెదను. ఒకపరి నీవు నా ప్రభువువని కీర్తిస్తూ మొక్కుతాను. ఒకపరి సృష్టి కంతటికి ఆదిమూలము నీవేనని నమ్ముతాను. నీవు నా పక్షాన వున్నావని ఉక్కున (స్థైర్యము గలవాడనై) గర్వించి ఉబ్బుదును (సంతోషిస్తాను). అటుపై సగ్గుదును (తగ్గిపోతాను). కక్కసమైనది (యెంతో బాధ కలుగుతుంది). కడకనరాదు (దీనికి అంతూ పొంతూ తెలియదు).

ఓ దేవా! నీ దివ్య సుందరమూర్తిని జూచి నీవు మమ్ము సులభముగా అనుగ్రహింతువని తలచెదను. జగములన్నిటికి ఇది సోద్యము (సంభ్రమకరము) అని చూతును. ఓ శ్రీవేంకటేశ్వరా! ఈ విధముగా నన్ననుగ్రహించితివి. నాకు యెంతో కౌతుకము (ఆనందము) కలుగుచున్నది. దానికి కడ కనరాదు (అంతు తెలియకుండా వున్నది). నేను ధన్యుడను తండ్రీ!

సంపుటి: 4 కీర్తన : ఎత్తరే ఆరతులు యియ్యరేకానుకలు
సంఖ్య : 31 పుట : 21 రాగం: బౌళి

**బౌళి**

101 ఎత్తరే ఆరతులు యియ్యరేకానుకలు
యిత్తల నేఁగివచ్చీని యిందిరానాథుఁడు ॥ పల్లవి॥

గరుడధ్వజపు తేరు కనకమయపు తేరు
సిరులతో వేదములచేరుల తేరు
సురలు మునులుఁ బట్టి సొంపుతోడఁ దియ్యఁగాను
యిరవుగ నేఁగివచ్చీ నిందిరానాథుఁడు ॥ఎత్త॥

జీవకోట్లున్న తేరు శేషుఁడే రూపైన తేరు
వేవేలు సింగారముల వెలయు తేరు
మావరుస నిత్యులును ముక్తులును గొలువఁగా
యీవల నేఁగివచ్చీ నిందిరానాథుఁడు ॥ఎత్త॥

పంచభూతముల తేరు బ్రహ్మాండమైన తేరు
మించిన శ్రీవేంకటాద్రిమీఁదటి తేరు
కొంచక యలమేల్మంగఁ గూడి వచ్చీ నదె తేరు
యెంచరాని మహిమల నిందిరానాథుఁడు ॥ఎత్త॥31

**అవతారిక:**

శ్రీవేంకటేశ్వరుని రథము తిరువీధులగుండా సాగుతున్నది. ఇందిరానాథుడు ఇటువైపు వచ్చేస్తున్నాడు, ఓ ప్రజలారా! రాండి... హారతులీయండి... కానుకలనీయండి... మీ జన్మ తరింపజేసికోండి అని మంగళం పాడుతున్నారు అన్నమాచార్యులవారు. ఈ తేరు, పంచభూతముల మూలరూపమైన పరమాత్ముని బ్రహ్మాండమైన తేరు అని కీర్తిస్తున్నారు. జీవకోట్లన్నీ ఇందులోనే అదృశ్యరూపంలో వున్నాయట. సురులు మునులు ఈ తేరుని పట్టుకొని సొంపుగా లాగుతున్నారట. ఏరీ కనుపించరేమి? అని జుట్టు పీక్కోకండి. మనకు వారినిచూచే శక్తీ, అర్హతా, భక్తీ





యేవీ లేవు. స్వామి సశరీరుడై తన దేవేరులతో వారికి కనుపిస్తాడు. కాని మనకు అంత అదృష్టం లేదు.

**భావ వివరణ:**

ఓ ప్రజలారా! ఇందిరానాథుడు ఇటు వూరేగి యిత్తల వస్తున్నాడు (ఇటువైపు వచ్చుచున్నాడు). ఎత్తరో ఆరతులు (హారతులను యెత్తిచూపండి). మీ శక్తి కొలది కానుకలు స్వామికి సమర్పించుకోండి.

ఈ స్వామి యెన్ని రకములైన రథములనెక్కాడో చూడండి. గరుడధ్వజముతో నొప్పిన తేరు బంగారము రాసులైన తేరు. నాలుగు వేదములు దీనికి చేరులు (పట్టుకొని గుంజుటకు వుపయోగించిన నాలుగు త్రాళ్ళు). దేవతలు మునులు అదృశ్యరూపులై దీనిని లాగి తరిస్తున్నారు. ఈవిధంగా ఇరవుగా (సొంపుగా) ఇందిరానాథుడు వూరేగివస్తున్నాడు.

సృష్టిలోని జీవకోట్లన్నీ సూక్ష్మరూపంలో వున్నాయి, ఈ రథంలో ఉన్నాయి. ఇది మనకు రథములా కనిపిస్తున్నది కానీ ఆదిశేషుడు చుట్టలు చుట్టుకొని తన పడగలను స్వామికి గొడుగులాపట్టినాడు. వేవేల సింగారములు (అనేకమైన అలంకరణలతో) ఈ తేరు కన్నులపండువగా వున్నది. నారదాది నిత్యులూ, సనక సనందనాది ఋషులు, వ్యాసాంబరీషులవంటి ముక్తులు (ముక్తిపొందినవారు)... మూడు వరుసలలో నిలిచి సేవిస్తున్నారు. ఈవిధముగా ఇందిరానాథుడు వూరేగివస్తున్నాడు.

బ్రహ్మాండమైన ఈ తేరులో పరమాత్మ పంచభూతముల రూపములో విలసిల్లుతున్నాడు. ఈ తేరు మించిన (వుత్కృష్టమైన) శ్రీవేంకటాద్రిపై సాగిపోతున్నది. అదిగో ఈ ఇందిరానాథుడు కొంచక (తగ్గక) తన దేవేరి అలమేల్మంగతో గూడి ఈ తేరుపై వస్తున్నాడు. ఈ మహానుభావుడు యెంచరాని మహిమలు కలవాడు. ఈయనయొక్క అనుగ్రహం పొంది మీజన్మ చరితార్థం చేసికొనండి. ఒక్కసారి ముక్తకంఠంతో అనండి

**శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే।**
**చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం॥**